

పండగ ఉత్సాహమా?
వాతావరణం ఉత్సాహపూరితమైయుంది,
ఇంపైన, సొంపైన, శోభస్కరమైన నూలు,
సిల్కు చీరలు, దుస్తులతో నిండియుంది
హేండ్‌లూమ్ హౌస్. అంతులేని రకాలు,
ఇంద్రధనస్సునుంచి, నెమలినుంచి సంగ్రహించబడ్డ
రంగులతో అందచందాలకు అలవాలంగా డిజైను
చెయ్యబడినవి. మీకోసం, పండగ ఉత్సాహభరితమైన,
మీకోసం సిద్ధంగా ఉన్నాయి! హేండ్‌లూమ్
హౌస్-పాఠకులకు పెట్టినపేరు,
హేండ్‌లూమ్ హౌస్
మద్రాసులో 9, రతన్ బజారునందు మాత్రమే.
•10% ప్రత్యేక తగ్గింపు ఇవ్వబడుతున్నది

21228

ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి, రచయితలకి, రచయిత్రులకి మా కొత్త సంవత్సర శుభాభినందనలు. —సం.

### కథలు

మీ మాపత్రికలో 'ఆ అమ్మాయి' కథ బాగుంది.

బొగ్గారపు మణి (అనకాపల్లి)

* * *

20—12—68 ఆంధ్రపత్రికలో శ్రీ వేమ కోటి సీతారామశాస్త్రి గారి కథానిక "మనసు బ్రతకాలి", మాధ్యమిక కుటుంబం జీవనానికి ఒక దర్పణం. ఆయన ఆ చిన్నకథలో యెంతో ప్రపంచాన్ని, చిత్రించారు. ఆ మలుపుల్లో, మెరుపుల్లో సృజనాత్మకమైన వేదన, స్పందించిన హృదయాన్ని పిండేసింది. విశ్వజనీనత స్ఫష్టించింది. రామలక్ష్మిగారి "ప్రేమించు ప్రేమకై" నవల బాగుంది. శారద కథానికలో ముగింపు బాగులేదు.

కె. విజయలక్ష్మి (విశాఖపట్నం)

### సీరియల్

18—12—68 సంచిక 'జీవిత వలయాలు' సీరియల్‌లో "కొందరు—పిరికి సైనికులు తుపాకులు పట్టుకుని ముందుకు నడువమంటే లోపల ఎట్లా గజగజ వణికేది వర్ణించి, వర్ణించి చెప్పి వాళ్ళని నవ్వించాడు" అన్న వాక్యం చాలా అవ్యక్తము, అప్రస్తుతమూ, అప్రాకృతికంగా కన్పించి బాధ కలిగింది. పిరికితనమనేది సైన్యంలో చేరిన మరుక్షణమే పటాపంచలవుతుంది. చెప్పటం సులభం. చేయటం కష్టం. ట్యాంకుల హోరు, షెల్లింగ్ మోత, మరతుపాకీల గుళ్ళవర్షం—ఆ పరిస్థితుల్లో గుండె ఆగి చచ్చిపోకుండా, ఆమాత్రం తుపాకీ చేత పట్టుకున్నందుకు అభినందించవలసింది పోయి, కించ పరచటం శోచనీయము. తల్లిదండ్రులను, భార్యాబిడ్డలను, అయినవాళ్ళి, కానివాళ్ళి ఆప్త బంధువులను వదలి, అనుక్షణం ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని, అనుక్షణం మన మంచి కోసం మన శ్రేయస్సు కోసం పాటు పడుతున్న సైనికులకు అందజేయవలసింది కృతజ్ఞతగానీ, కించ పరచే విమర్శ కాదు. రచయిత్రి నా విమర్శను సహృదయంతో అర్థం చేసుకుంటారని ఆశిస్తాను.

వారంట్ ఆఫీసర్, నిరంజన్ చిట్బార్ప్
56 ఆర్మీ పోస్టాఫీసు.

### వ్యాసాలు

20—12—68 వ తేది పత్రిక భారతి ముఖచిత్రంతో ఆకర్షణీయంగా వెలువడింది. అదే సంచికలో ప్రచురితమైన శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారి 'సినిమాలలో స్త్రీలపాత్రలు' వ్యాసం ఎంతో సమంజసంగా ఉంది. సోదరి ప్రభావతిగారు వెలిబుచ్చిన అభిప్రాయాలతో ప్రతి ఒక్కరూ ఏకీభవించగలరంటె అతిశయోక్తి కాదేమో!

మేకా రామచంద్రరావు, విజయలక్ష్మి
(సికింద్రాబాదు)

* * *

# ఉత్తరాలు

20—12—68 పత్రికలోని మహేష్‌గారి ఊర్మిళ—ఒకవైపు రాజకీయ వ్యాసంగాను, మరొక వైపు హాస్యపూరితమైన కథగాను రెండు వైపులా పదునున్న కత్తిలా పాఠకుల హృదయాల్లోంచి దూసుకుపోతుంది. ఇది సినిమారంగంలోనూ, ప్రేక్షక లోకంలోనూ నిజంగా సత్ఫలితాలనిస్తే తప్పకుండా మహేష్‌గారికి 'విమర్శకశ్రీ' బిరుదివ్వాల్సిందే. ఇలాంటి కథ ప్రచురించినందుకు సంపాదకుల నభినందిస్తూ "ముగ్గురు మూర్ఖుల"ను నాలుగు కాలాల పాటు మాకు కనిపింప జేయవలసిందిగా అభ్యర్థిస్తున్నాను.

కొడవంటి కాశీపతిరావు (విజయనగరము)

* * *

'పద్మశ్రీకి అర్థం ఉందా?' అంటూ ఉన్న పేరు చూసేసరికి, హమ్మయ్యో ఇది ముగ్గురుమూర్ఖుల నోట్లో పడిందన్న మాట, భేష్ అనుకున్నా. కాని 'పద్మశ్రీకి అర్థం ఉందా? అన్నట్లుగానే, అదివ్వటానికి కూడా అర్థం ఉందో లేదో చెప్తే బాగున్ను.

'మూర్ఖులు ముచ్చటించుకునేవి చాలా మట్టుకు ప్రజల అభిప్రాయాల్లా ఉన్నాయి. అంటే, ప్రజలు కూడా..?'

సురేష్, ఝార్సుగుడా (ఒరిస్సా)

* * *

"ముగ్గురు మూర్ఖులు" సామాన్యులుగారు. ఒక్కొక్క విషయాన్నే తీసుకొని చాల నిశితమైన విమర్శలు చేస్తున్నారు. వాళ్ళను 'మూర్ఖులు' అనటానికి ధైర్యము చాలటంలేదు.

మహమ్మద్ అలీబేగ్ (చిన్నూరు)

* * *

సెకండరీ ట్రైయినింగ్ పూర్తి చేసి, కొంత కాలం పాటు నిరుద్యోగినై విధిలేక స్వల్పవేతనముతో లారీ కంపెనీలో పని చేయుచున్న నేను, 13—12—68 వ తేదీన ప్రచురింపబడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలోని "బ్రతకలేకపోతున్న బడిపంతుళ్ళు" వ్యాసం నేటి మన విద్యావిధానాన్ని బహు చక్కగా యధాతథంగా నిర్వచించినదని చెప్పగలను. రచయితకు నా అభినందనలు.

బి. రుక్మాంగద (కోయంబత్తూరు)

* * *

(13—12—68) ఈవారం పత్రికలో "విలేఖరి" వ్రాసిన "బ్రతకలేని బడిపంతులు" వ్యాసం చాలా బాగుంది. నిజంగా బడిపంతుల ఎన్ని అవస్థలు పడుతున్నాడో అన్నీబాగా వివరించారు. ప్రభుత్వం ట్రైనింగ్‌సెంటర్సు తియ్యరు, ఉన్నవాళ్లకి దారి చూపించరు. ట్రెయినింగు అవుతున్న వాళ్లకి మాత్రం "స్టయిఫెండు" ఇస్తున్నారు. ఆ ట్రెయినింగ్‌నే కొంతకాలం తీసేస్తే ఈబాధలన్నీ తప్పుతాయి కదా!

వి. కామేశ్వరి (నర్సీపట్నం)

* * *

నేను ప్రతివారం "ధర్మపథం" చదువుతూ వుంటాను. 20—12—68 సంచికలోని ధర్మపథం వ్యాసం చదివిన తర్వాత నాకు చాలా అనుమానం గల్గింది. వేంకటరమణయ్యగారు ఏ వుద్దేశ్యముతో ఈ వ్యాసం వ్రాశారో అర్థం గావటంలేదు. "శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు" అని సూక్తిగదా! ఆ యువకుని నాస్తికునిగా ఆ దేవుడే పుట్టించాడు గదా! దేవుడులేడనే భావం అతనిలో వున్నాది. అంతేకాని అంతకుమించి అతడు ఏ పాపము ఎరుగడు. ఇతరుల బాధించలేడు. అందువలన, కేవలము తన్ను బూజించలేదనే కోపముతో, ఉత్తి పుణ్యానికి ఆ యువకుని గణపతి (దేవుడు?) బొట్టనవెట్టుకోవాల్సిన అవసరం యేమొచ్చింది? నా ఈ సమస్యకు వేంకటరమణయ్యగారు సమాధానమిస్తారని ఆశిస్తున్నాను.

కృష్ణప్రసాద్, (నెల్లూరు)

### న్యూఢిల్లీ లేఖ

20—12—68 వారపత్రికలోని శ్రీకృష్ణగారి న్యూఢిల్లీ లేఖ చదివాను. అందులో పాకిస్తాన్ సృష్టికి కారణం ఉత్తరప్రదేశ్ హిందువు లేననటానికి బలమైన సాక్ష్యం బయడపటుతోందని వ్రాశారు. ఉర్దూని బహిష్కరించటానికి, ప్రజాస్వామ్యపద్ధతులు రావటానికి, ముస్లిములు ఇంగ్లీషు నేర్చుకొనకపోవటం చేత ఉద్యోగాలు సంపాదించుకోలేక పోవటానికి హిందువులు ఏ విధంగా బాధ్యులో, పాకిస్తాన్ సృష్టికి హిందువులే విధంగా కారకులో సహేతుకంగా తెలుపవలసింది. నిందలు నిరూపించుట ఉత్తముల లక్షణం.

పాకిస్తాన్ సృష్టికి హిందువులే బాధ్యులని మతం పేరుతో నిందవేసిన శ్రీకృష్ణగారు, రాంచీహెవీ ఇంజనీరింగ్ కార్పొరేషన్ నాశనం చేయటానికి పన్నిన కుట్ర కేసులో ఇరుక్కున్న ఆరుగురు ముద్దాయిలూ ముస్లిములేనని ఎందుచేత వ్రాయలేక పోయారు? క్రిష్టియన్లు ప్రత్యేక 'జెస్సీటిస్తాన్' కావాలని ఎప్పుడూ అడుగలేదని వ్రాశారు. ఆ పేరుతో అడుగకపోయి ఉండవచ్చుగాని ప్రస్తుత నాగాలాండ్ సమస్య మిషనరీలవల్లనే ఉత్పన్నమయిన సంగతి శ్రీకృష్ణగారికి తెలియదా? దేశవ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొంటున్నాడని నాగాలాండ్‌లో ఉంటున్న మైకేల్‌స్కాట్‌ను దేశంనుంచి బహిష్కరించిన సంగతి శ్రీకృష్ణగారికి తెలియదా? దేశ ఆంతరంగిక కార్యకలాపాలలో పాల్గొంటున్నారని, విద్రోహచర్యలకు పాల్పడుతున్నాడని బలమైన సాక్ష్యం సేకరించిన పిమ్మట మహారాష్ట్రనుంచి బహిష్కరింపబడి గుజరాతులో ప్రవేశానుమతి తిరస్కరింపబడి, ఆంధ్రప్రదేశ్‌లో తిష్టవేయనున్న ఫాదర్ ఫెరర్ సంగతి శ్రీకృష్ణగారికి తెలియదా? ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి క్రిష్టియానిటీ స్వీకరించాడన్నవార్తను (న్యూఢిల్లీ ఆంగ్లవారపత్రిక, ఆర్గనైజర్) బ్రహ్మానందరెడ్డిగారు, ఖండించ పోవటానికి కారణం? దీనినిబట్టి క్రిష్టియన్లను ఆదుకొనే పెద్దమంత్రి ఎవరూ లేరని శ్రీకృష్ణగారు వెలిబుచ్చే సానుభూతి అర్థరహితం. దేశవ్యతిరేక కార్యకలాపాలు జరిపే విదేశీ మిషనరీలను జాతీయం చేయమనటంలో తప్పేమిటి?

# కొత్త
# సూపర్ సర్ఫ్
## అత్యంత అమిత తెల్లగా ఉతుకుతుంది




సూపర్ సర్ఫ్ అత్యధిక ఉతికే శక్తిని కలిగియున్నది! సూపర్ సర్ఫ్ [illegible] తుంది— ఎంత ఎక్కువగా మాసిపోయినవైనా సరే. సూపర్ సర్ఫ్ కానరాని మురికిని సహితం తొలగించేస్తుంది. ఇంక మీ బట్టలన్నిటికీ మెరయుచుండే తెలుపును కలిగిస్తుంది, తెలుపుచేసే పౌడర్‌ను చేర్చక్కర్లేదు. మీ అత్యధిక బట్టలను ఉతుకుట కూడ సూపర్ సర్ఫ్‌తో సులభం. మరి ఆనందకరం కూడా. ఆ తాజా పరిమళాన్ని ఆఘ్రాణించండి —ఇంకే ఇతర ఉతికే పౌడర్ ఇంత సౌకర్యమును సమకూరుస్తుంది!

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్టమైన ఉత్పత్తి

లింటాస్-SU.55-140 TL

జనసంఘానికి హైందవ ఓటర్ల ఆదరణ ఉన్న దని వ్రాశారు. అదితప్పు. మత ప్రమేయంలేదనే కాంగ్రెసుకు, మతమే (దేవుడే) లేడనే కమ్యూనిస్టులకు, అన్యమత రాజకీయపక్షమైన 'ముస్లింలీగు'కు (మద్రాసు మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలు) వోట్లు వేసినట్లుగానే జనసంఘానికి కూడా హిందువులు వోటు వేస్తున్నారు. పైగా హిందువులు మత ప్రమేయం లేకుండా వారివారి పార్టీలను బట్టివోటు చేస్తారనటానికి, ముస్లిములు ఏ పార్టీలో ఉన్నప్పటికీ వారి మతాన్ని దృష్టిలో పెట్టుకొని వోటు చేస్తారనటానికి రాష్ట్రపతిగా డా. జకీర్‌హుస్సేన్ గారి ఎన్నిక ఋజువుతునకలాంటి ఉదాహరణకాదా? కమ్యూనిస్టులకు రష్యావారి ఆదరణ, మహమ్మదీయులకు మహమ్మదీయ దేశాల ఆదరణ ఉన్నదని వ్రాశారు. అన్ని పార్టీలకు వోటు చేస్తున్న హిందువులకు ఎవరి ఆదరణా లేనట్లేగదా? ఆదరించకపోగా న్యాయాన్యాయాలు విచారించకుండా, సత్యాసత్యాలు తెలుసుకోకుండా, అన్ని పార్టీలవారు, అన్యమతాలవారు హిందువులను నిందించుట పరిపాటి అయిపోయింది. అకారణంగా, నిరాధారంగా హిందువులను నిందించటమే సెక్యులరిజమా? మత పరమైన కొట్లాటలు, ఎప్పుడయినా జరిగిన వెంటనే అన్ని పార్టీలవారు హిందువులదే తప్పు అని ప్రకటిస్తుంటారు. మరి ఆయా సందర్భాలలో నియమించిన న్యాయమూర్తులు సమర్పించిన నివేదికలు బయట పెట్టక పోవటానికి కారణం? నిందవేసినవారు నివేదికలను బయట పెట్టక పోవటానికి కారణం వారి నిందలు అబద్ధాలు అని, హిందువుల తప్పులేదనేకదా?

రాజకీయనాయకులు స్వప్రయోజనాల కొరకు అశక్తులయిన హిందువులను నిందిస్తున్నారు. మరి పత్రికా రచయితలు ఈ విధంగా ఎందుకు చూస్తున్నారో? సత్యం తెలిపే ధైర్యంలేనపుడు నిరాధారంగా నిందించటమే మార్గాంతరమా?

ఈ 'శ్రీకృష్ణ' నామానికే కళంకం వచ్చేవిధంగా కాకుండా ఇకమీదటయినా నిష్పాక్షికంగా (న్యూఢిల్లీ) లేఖ వ్రాస్తారని ఆశిస్తున్నాను.

తడవర్తి రుక్మాంగధరుడు, (నాగార్జునసాగర్)

* * *

1—11—68వ సంచికలోని శ్రీ విజయ (శ్రీశైల ఆత్మకూరు) వ్రాసిన ఉత్తరం చదివినాను. వారు వ్రాసిన విషయము ఎంతో వాస్తవము. వారు వ్రాసిన ఉత్తరంలోని ప్రతి విషయము ఎంతో చక్కగా వ్రాశారు. 20—12—68వ సంచికలో మరల శ్రీకృష్ణగారు అదేవిధంగా జనసంఘంను ప్రత్యేకంగా మొదటి పేరాలలోనే విమర్శించారు. పాకిస్తాన్ యుద్ధం అప్పుడు, ఏ పార్టీలు చేయలేనివిధంగా సైనికులకు సహాయపడి లాల్‌బహదూర్‌శాస్త్రి గారిచే గౌరవంగా పొగడబడిన జనసంఘీయులా అక్రమంగా ప్రవర్తించేది. జనసంఘంలో ఎక్కువగా విద్యావంతులు వున్నారేకాని, అంగళ్ళవారు వ్యాపారస్థులు లేరు. వారు చెప్పిన వారు వున్నది కాంగ్రెస్‌లో! వారు ఒక పార్టీకి పక్షపాతిగా వుంటూ జనసంఘంను విమర్శించటం శోచనీయము. ఇకనైనావారు దాన్ని విర

# ఉత్తరాలు

మించాలని కోరుతున్నాను.

పి. అనంతరామయ్య, కళ్యాణిఖని, (మందమర్రి)

## సినిమా

మీ (మా) 20—12—68 వ తేదీ పత్రికలో ముగ్గురు విజ్ఞాన సముపార్జన ప్రియులంటూ లేఖ రాసిన మీకు తెలుసా సినీ ప్రియుల (శ్రీ ఎం. ఎన్. ప్రకాశ్‌గారి) లేఖ చదివిన తర్వాత నా అభిప్రాయం రాయలేకుండా ఉండలేకపోతున్నాను.

1. కుటుంబం అంతా చదివే ఏ పత్రికలోనైనా సినిమా శీర్షిక అంటూ ఉంటూనే ఉన్నది. కాని వైజ్ఞానికరంగంలో కృషి చేస్తున్న వారి, చేసిన వారి ప్రతిభా విశేషాలు తెలిపే శీర్షికలు, బహు కొద్ది పుస్తకాలలో ఉంటున్నాయి. ప్రతిభావంతుల జీవిత విశేషాలను, విజ్ఞాన శీర్షిక ద్వారా ప్రచురిస్తే చాలా బాగుంటుంది. యిదివరలో 'మెదడుకు మేత" అన్న శీర్షిక ఉండేది. యిప్పుడు అది లేకపోవటం చాలా శోచనీయం. "మీకు తెలుసా" అన్న శీర్షిక సినిమాతో కలిపి, "చెత్త" విషయాలు (తారల అలవాట్లు) రాసే కంటే విజ్ఞాన శీర్షికతో కలిపి నూతన విషయాలు తెలియపరుస్తే ఎంతో సమంజసముగా ఉంటుంది. అలా జరిగితే పత్రిక స్థాయి కూడా పెరుగుతుంది.

2. సినీతారల అలవాట్ల కొరకు (మీకు తెలుసా ద్వారా) వారపత్రికకి ప్రతివారం ఎదురు చూసే కంటే ఒకేసారి సినీతారల జీవిత సంగ్రహ చరిత్రలు చదివి తెలుసుకొనటం ప్రకాష్‌గారి లాంటి సినీప్రియులకు ఎంతో లాభదాయకం అని నా అభిప్రాయం.

పి. శ్యామసుందర్‌రావు ( బాపట్ల )

## కార్టూన్

29—11—68 సంచిక, 19వ పేజీలోని బాబుగారి కార్టూనుమీద 20—12—68వ తేదీ పత్రికలో ప్రచురితమైన, శ్రీ అప్పారావ్ (హుబ్లీ)గారి విమర్శ చదివాను. రైలుసురక్షితంగా గమ్యస్థానం చేరడానికి "రైల్వే పనివారందరూ ప్రధాన పాత్రధారులే" కాదని ఎవరన్నారు. ప్రమాదాలు కావాలని ఎవరూ చేయరు. అది నిజమే! అయినా ప్రమాదం పొరపాటున జరిగినా,-- అది ప్రమాదమే! తత్సంబంధమైన వ్యక్తి శిక్షార్హుడే!

అయినా కార్టూనననేది కేవలం నవ్వించడానికేగానీ ఎవరినీ అవమాన పరచడానికి వేయరు. ఒక సీరియస్ విషయాన్ని హాస్యంగామార్చి అందరినీ నవ్వించాలన్నదే, కార్టూనిస్టు దిగానీ లేక మరొక హాస్యగాడిదిగాని ఉద్దేశ్యం. ఇలా బాధపడితే చిర్నల్, వెనాలి రామకృష్ణుల్లాంటి వారి మాటేమిటి?

పొరుపల్లి రామచంద్రమూర్తి (విజయవాడ)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 3—1—'68
కీలకనామ సం|| పౌషమాసం పూర్ణిమ
సంపుటము : 61 సంచిక : 19

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

# సంవత్సరం ముగిస్తూ వుండగా





















# ఢిల్లీ సమస్యలు: జరిగిన పొరపాట్లు

బయటి రాజకీయ వాదులూ, పదవుల కోసం ఎగబాకేవారూ ఢిల్లీ ప్రజలకి అన్యాయం చేశారు.

అసలు రాజధానిని కలకత్తానుంచి ఢిల్లీకి ఎందుకు మార్చారు? లార్డ్ హార్డింజ్ తమ ప్రభుత్వానికి కారణాలు చెప్తూ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ ఒకే నగరంలో ఉండటం మంచిది కాదన్నారు. (వంగ రాష్ట్రానికీ, దేశానికీ కలకత్తా నగరమే రాజధానిగా ఉండరాదని ఆయన అభిప్రాయం) బ్రిటిషు సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఈ సూచనని ఆమోదిస్తూ ఇలా అన్నారు—

'మీరు చెప్పినట్లు (ప్రస్తుతపు) ఏర్పాటు రెండు ప్రభుత్వాలకీ హాని కలిగిస్తున్నది. వయిస్రాయి బెంగాలుకి గవర్నర్ — ఇన్- ఛీఫ్ ·యినా అనిపించుకునేట్లు ప్రవర్తించాలి. లేదా ఇండియా లోపలా బయటా ఉన్న ప్రజాభిప్రాయాన్ని బట్టి నడుచుకుంటూ పరిపాలనా వ్యవహారాల విషయంలో వేరుగా బాధ్యతని స్వీకరించాలి. (ఈ పరిపాలనా వ్యవహారాలలో జోక్యంచేసుకునేటప్పుడు తాను (వయిస్రాయి) ఒక సర్వాధికారాలు కల ప్రభుత్వంమీద సాధారణమయిన ఆధిపత్యం మాత్రమే వహిస్తున్నట్లు గమనించాలి.) ఇక స్థానిక ప్రభుత్వం తన బాధ్యతని కోల్పోయినట్లు కూడా భావిస్తుంది. అన్ని విషయాలూ 'వయి ప్రభుత్వ'నికే వర్తిస్తాయనే ధోరణి బలపడుతుంది.'

**నేటికీ వర్తిస్తుంది...**

ఈ వైఖరి ఒకవిదేశ ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పటి పరిస్థితికి మాత్రమే వర్తిస్తాయనుకొనటం పొరపాటు. నిజానికి అది నేటి పరిస్థితికి ప్రత్యేకంగా వర్తిస్తుంది. ఎందుచేతనంటే ప్రజాస్వామ్య పద్ధతికింద బాధ్యత— అధికారం అన్నవి నిర్ణయించటం క్రమంగా కష్టమయిపోతూ వస్తోంది. సర్వాధికారంకల ప్రభుత్వం ఉన్నప్పుడు ఈ చిక్కు ఉండదు.

రాజధానిని ఢిల్లీకి మార్చినప్పుడు కలకత్తాలోని బ్రిటిషు వర్తకులు ఈ మార్పుని ఖండించారు. దానివల్ల తమ అధికారం సన్నగిల్లుతుందని వారికి తెలుసు.

రాజధానిని మార్చటంలో లార్డ్ హార్డింజ్ సరయిన పనే చేశారు. ఢిల్లీని వాషింగ్టన్, కాన్బెరాల పద్ధతిమీద నిర్మించేబదులు ఢిల్లీతో పంజాబు, ఉత్తర ప్రదేశాలలో నుంచి వందవయిగా గ్రామాలని చేర్చారు. అంతేకాదు, ఢిల్లీ వ్యవహారాలని కేంద్ర శాఖలద్వారా పరిపాలించటం మొదలు పెట్టారు. బ్రిటిషు ప్రభువులు ఉన్నంతకాలం ఇది బాగానే పనిచేసింది. తర్వాత— 1947 నుంచి — ఇది పూర్తిగా చెడిపోయింది.

**ఢిల్లీ ప్రత్యేకతలు**

ఢిల్లీ ప్రత్యేకతలు మరి రెండు ఉన్నాయి. ఒకటి, ఢిల్లీ రాజకీయ వాదులలో అధిక సంఖ్యాకులు బయటి ఊళ్ళవారే—హకీమ్ అజ్మల్ ఖాన్, అసఫాలి, చవుదరి బ్రహ్మప్రకాష్‌లు తప్ప అందరూ అక్కడికి జీవనోపాధికోసం వచ్చినవారే. రెండు, ఢిల్లీ రాజకీయాలలో లాయర్లు అంతగా ప్రముఖపాత్ర వహించలేదు. భారతదేశంలోని ఇతర ప్రాంతాలతో పోలిస్తే ఇది విచిత్రంగానే ఉంటుంది.

ఢిల్లీకి రాష్ట్రస్థాయి కావాలని ఉద్యమం లేవదీసినది లాలా దేశ్‌బంధుగుప్తా; సర్దార్ పటేల్ ఈ కోరిక ఏమాత్రం సబబు కాదన్నారు. ఢిల్లీ సమస్యలు పురపరిపాలనకి సంబంధించినవి కాని రాజకీయాలకి సంబంధించినవి కావని ఆయన అన్నారు.

**సర్దార్ చేసిన వాటిని మార్చడమే...**

సర్దార్ పటేల్ చేసినవాటిని మార్చటమే తమ ధ్యేయంగా పెట్టుకున్న శ్రీ నెహ్రూ, ఆయన మరణించగానే ఢిల్లీకి రాష్ట్రస్థాయి ఇప్పించారు. ఢిల్లీ మొదటి మంత్రివర్గం ప్రమాణ స్వీకారాన్ని ఒక పందిరి కింద చేసింది. ఆ సందర్భంలో అధ్యక్షత వహించిన పండిత కైలాసనాథ్ కట్జూ ఢిల్లీ మంత్రులకి 'రిజర్వ్‌డ్' విషయాలే ఉండవని హామీ ఇచ్చారు. ఇది ఆయన చేసిన ఎన్నో పొరపాట్లలో ఒకటి (అప్పుడు ఆయన ఆంతరంగిక వ్యవహారాల మంత్రి.)

సంవత్సరం తిరగకుండానే శ్రీ నెహ్రూకి తాము చేసిన పొరపాటు తెలియవచ్చింది. ఒక నెలదాకా రోజుకి గంట చొప్పున ఢిల్లీ మంత్రుల పేచీలు సర్దటంలో గడిపారు. ఈ కాలంలోనే ఒకవింత జరిగింది—ముఖ్యమంత్రి చవుదరీ బ్రహ్మప్రకాష్ సాధారణ మంత్రి అయ్యారు, ఢిల్లీ ఎసెంబ్లీ స్పీకరు ముఖ్యమంత్రి అయ్యారు, ఆరోగ్య శాఖమంత్రి డా. సుశీలానయ్యార్ స్పీకరు పదవిని అలంకరించారు!

**రాష్ట్రం రద్దు**

రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం ఢిల్లీ రాష్ట్రాన్ని రద్దు చెయ్యాలని సూచించింది. దేశం యొక్క కేంద్ర రాజధాని ప్రజలకి కొన్ని ప్రత్యేక వసతులు ఉంటాయని వారిని తక్కిన నగరాల ప్రజలతో పోల్చరాదనీ, (అమెరికా రాజధానికి సంబంధించిన కొలంబియా డిస్ట్రిక్టు ప్రజలకి వోట్లు లేవనీ) అక్కడి ప్రజలు కొన్ని 'హక్కుల'ని కోరనవసరంలేదని సంఘంవారు అన్నారు. మునిసిపాలిటీ వ్యవస్థ చాలునన్నారు.

ఈ సంఘం కొన్ని గ్రామాలని హిమాచల ప్రదేశానికి ఇచ్చేసింది. పంజాబు, ఉ. ప్ర. నికి కూడా తీసుకున్న గ్రామాలన్నిటినీ ఇచ్చేస్తే బాగుండేది.

**పండితపంత్ పొరపాటు**

రాష్ట్ర పునర్నిర్మాణం బిల్లుని పార్లమెంటులో నడుపుకువచ్చిన అప్పటి ఆంతరంగిక వ్యవహారాలమంత్రి పండిత గోవింద వల్లభపంత్ కూడా ఢిల్లీ విషయంలో పొరపాటు చేశారు. ఢిల్లీ కార్పొరేషన్‌లో గ్రామీణ ప్రాంతాలని కూడా కలిపి ఒక భయంకరమయిన సంస్థని తయారుచేశారు. ఫలితం ఏమిటంటే కార్పొరేషన్ సేవా సంస్థ కావటం బదులు రాజకీయ సంస్థ అయింది. వాగ్యుద్ధాలు, వాకవుట్‌లు పరిపాటి అయిపోయింది. లెఫ్టినెంటు గవర్నర్ ఏ. ఎన్. ఝా చెప్పినట్లు సభ్యులు కార్పొరేషన్

ఒక పార్లమెంటు అనుకుంటున్నట్లు తోస్తుంది. నగర సమస్యలని గురించి మాట్లాడటానికి బదులు ప్రపంచ పరిస్థితిని గురించి మాట్లాడటం అలవాటు పోయింది.

## దీపందగ్గిర నీడ

బడ్జెటు సరిపెట్టేందుకు కమిషనర్ కొన్ని పన్నులు ప్రతిపాదిస్తూ ఉంటారు. మునిసిపాలిటీ ఉద్యోగులు వీటిని వసూలు చెయ్యరు. పాతబాకీలే ఇంకా వసూలు కాలేదు. కొన్ని సంవత్సరాల నీటి బిల్లులు పంపటం కూడా జరగలేదు. ఒక వారంలో చేరే మురికి ఎంత ఉంటుందో ఈ విలేఖరి చెప్పగలడు. ఈ సంగతులని గురించి కొందరితో చెప్తే దీపందగ్గరే నీడ ఉంటుంది కదా అంటారు.

ఒక చిన్న యుద్ధం గురించి ఇప్పుడు చెప్పాలి. యుద్ధం చేసినవారిలో ఒకరు స్పష్టంగా ఆలోచించటం కూడదనే సిద్ధాంతంయొక్క ప్రధాన సూత్రకారులు లాలా గుల్జారీలాల్ నందా; రెండవవారు మాజీ ఢిల్లీ ముఖ్యమంత్రి చవుదరీ బ్రహ్మ ప్రకాష్. మధ్యవర్తిగా పేరుగడించుకుందామనుకున్న మాజీ వర్క్స్ మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా ఫ్రాంటియర్ ప్రాంతంలో పుట్టినవారు.

జ్యోతిష్కులు శ్రీ హవేలీ రామ్‌గారి శిష్యరికంవల్ల లాలాజీగారి ఆలోచనలు మట్టి నీరంత స్వచ్ఛంగా ఉన్నాయేమో మూడు అంచల పరిపాలనా పద్ధతిని ఏర్పాటు చేయించారు. మొదటి మెట్టు వారు పదవిలో ఉన్నప్పుడే అమలులోకి వచ్చింది. నేడు ఢిల్లీకి ఒక లెఫ్టినెంటు గవర్నరు ఉన్నారు. ఆయనకి అధికారం ఏమీలేదు. ఢిల్లీకి ఎక్సిక్యూటివ్ కవున్సిలర్లు ఉన్నారు. వారు మంత్రులతో సమానం అన్నట్లు ప్రవర్తిస్తారు. గవర్నరుగారు కవున్సిల్‌లో మేయరు ఉండాలన్నారు. ఆయనమాట ఎవరూ వినిపించుకోవటం లేదు.

ఢిల్లీ సమస్య ఒకటీ పరిష్కారం కాలేదు. పన్నులుకట్టే ప్రజలభారం మాత్రం అధికం అయింది.

## శ్రీ ఏ. ఎన్. ఝా

శ్రీ ఏ. ఎన్. ఝా వంటి పరిపాలకుడు 1962 నుంచి ఢిల్లీకి దక్కలేదు. 1947 నుంచి ఉంటున్న మురికివాడలని ఎన్నిటినో శుభ్రం చేయించారు. ఆయన ప్రయత్నాలని ప్రతిఘటించే కాంగ్రెసువారి సంఖ్య తక్కువ ఏమీ కాదు.

శ్రీ ఝా మూడు సూచనలు చేశారు— 1. మునిసిపల్ కార్పొరేషన్ బదులు 'సివిల్ బాడీ'లని ఏర్పరచాలన్నారు 2. లెఫ్టినెంట్ గవర్నరు అధికారాన్ని ఎక్కువ చెయ్యాలన్నారు. 3. ఢిల్లీ చుట్టుపక్కలనున్న గ్రామాలని ఉ. ప్ర. పంజాబులకి తిప్పి ఇచ్చేసెయ్యాలన్నారు.

పరిపాలనా సంస్కరణ సంఘం (ఎడ్మినిస్ట్రేటివ్ రిఫార్మ్స్ కమిషన్) వారు ఢిల్లీ సమస్యలని సరిగ్గా పరిశీలించినట్లు కనిపించదు. ఎందుకంటే ఈ సంఘం వారు ఈ కింది సూచనలు చేశారు.

## మెట్రోపాలిటన్ కవున్సిల్—

ఇది శాసన సభలతో సమానమయినది కాకపోయినా సభ్యులు ఎన్నిక అవుతారు కాబట్టి దీనికి శాసనసభ స్థాయి ఇవ్వాలి.

## పార్లమెంటు

ప్రజాస్వామ్య పద్ధతులని అనుసరించి మెట్రోపాలిటన్ కవున్సిల్ ప్రాముఖ్యాన్ని గుర్తించి, పార్లమెంటు ఆ కవున్సిల్‌కి సంబంధించిన విషయాలని చర్చించనవసరంలేదు. మంత్రిత్వపు శాఖలవారు అనవసరంగా వీటిలో కలగచేసుకోనవసరం లేదు.

అయితే సంఘంవారు 'కవున్సిల్‌లో మేయరు' అనవసరం అన్నారు.

పయిన అన్నట్లు సంఘంవారు ఢిల్లీ సమస్యలని బాగా అర్థం చేసుకున్నట్లు కనిపించదు వారి సంస్కరణలు పరిస్థితిని మెరుగు దిద్దేబదులు మరింత చెడగొట్టవచ్చు. పార్లమెంటు సభ్యులు ఢిల్లీ వ్యవహారాలలో కలుగచేసుకోరాదన్నారు. ఇది ఎలా సాధ్యం? ప్రస్తుతం కొందరు సభ్యులు అన్ని విషయాలని గురించీ పార్లమెంటులో మాట్లాడుతున్న సంగతి అందరికీ తెలుసు. పరిపాలన వివరాలలో కూడా వారు కలుగచేసుకుంటున్నారు; శాసనాల ప్రతిపాదన, అమలుపరచటం పరిపాలనకన్నా భిన్నం అని గ్రహించటం లేదు; రాష్ట్ర, కేంద్ర అధికారాలమధ్య విభేదాలని గుర్తించటం లేదు. ప్రయిమరీ టీచర్ల విషయం తీసుకోండి. ఇది జిల్లాబోర్డులకి సంబంధించినది. కాని పార్లమెంటు కలుగచేసుకుంటున్నది. ఆఖరుసారిగా సూచనలు చేసేముందు సంఘం (ఎ. ఆర్. సి.) వారు ఢిల్లీ సమస్యలని క్షుణ్ణంగా పరిశీలిస్తారని ఆశిద్దాము.



విదేశాలన్నిటిలోను కారవాన్లు కార్లకి తగిలించుకుని వెడుతూ ఉంటారు. ఈ బొమ్మలోని కారవాన నేలమీదనే కాక నీటిమీద కూడా వెడుతుంది దీనికి చక్రాలు అనవసరం; గాలిమీద తేలుతుంది (హావర్ క్రాఫ్ట్)




"ఒక ఊళ్ళో" అంటూ చంద్రావుతో చూడామణి యేదో చెబుతున్నాడు చిదంబరం వెళ్ళే సరికి.

'ఒక ఊళ్ళో కొంతమంది అద్వైతులు, మరి కొంతమంది విశిష్టాద్వైతులు ఉన్నారు. శంకరాచార్యుల యొక్క అద్వైతమతాన్ని అనుసరించే వారిని అద్వైతులు అని అంటారు. అలాగే రామానుజాచార్యుల యొక్క విశిష్టాద్వైతాన్ని అవలంబించిన వారిని విశిష్టాద్వైతులు అని అంటారు.

ఒక సంవత్సరం కార్తీక మాసంలో తమ గురువులను రప్పించి వారిచేత అద్వైతమత ప్రాశస్త్యాన్ని గురించి ఉపన్యాసాలు ఇప్పించుదామనుకొన్నారు అద్వైతులు. సరిగ్గా అదే సమయంలో విశిష్టాద్వైతులు కూడా తమ గురువుల్ని రప్పించి వారిచేత విశిష్టాద్వైతమత ప్రాశస్త్యాన్ని గురించి ఉపన్యాసాల్ని ఇప్పించుదామని అనుకొన్నారు.

ఇలాంటి సమావేశాలకు తగిన స్థలం ఆ ఊళ్ళో టవును హాలు ఒక్కటే. ఆ టవునుహాలు మ్యునిసిపాలిటీ యాజమాన్యంలో ఉంది. కార్తీకమాసం నెల్లాళ్ళ పాటు టవునుహాలును తమ సభల నిమిత్తం ఇప్పించవలసినదిగా కోరుతూ అద్వైతులు మ్యునిసిపాలిటీ వారికి అర్జీ దాఖలు చేశారు. విశిష్టాద్వైతులు కూడా అదే విధంగా అర్జీని దాఖలు చేశారు.

టవును హాలును ఒక పక్షంవారికి ఇచ్చివేస్తే రెండవవారికి ఇబ్బంది కలుగుతుంది. కాబట్టి పదిహేనురోజుల పాటు అద్వైతులు, పదిహేను రోజుల పాటు విశిష్టాద్వైతులు టవునుహాలును వాడుకోవచ్చునని మ్యునిసిపాలిటీవారు అనుమతిని ఇచ్చారు. పదిహేను రోజులు టవును హాలును ఒక పక్షంవారు వరుసనే వాడుకోకూడదనీ, రోజు విడిచి రోజు చొప్పున ఒక్కొక్కరు నెల్లాళ్ళ పాటు వాడుకోవాలని కూడా మున్సిపాలిటీవారు నియమాన్ని యేర్పాటు చేశారు. అంటే మొదటి రోజున అద్వైతులు, రెండవ రోజున విశిష్టాద్వైతులు మూడవరోజున మళ్ళా అద్వైతులు, నాలుగవ రోజున తిరిగి విశిష్టాద్వైతులు వాడుకోవాలన్న మాట. ఈ నియమానికి రెండు పక్షాలవారు కూడా అంగీకరించారు.

మొదటిరోజున అద్వైతుల సభ జరిగింది. ఆ సభకు వచ్చినవారిలో ఒకరు టవును హాలు గోడ మీద 'సోహం' అని వ్రాశారు. 'సోహం' అంటే జీవాత్మ, పరమాత్మ ఒక్కటే అని అర్థం. ఇది అద్వైత సిద్ధాంతాన్ని తెలియజెస్తుంది.

రెండవ రోజున విశిష్టాద్వైతుల సభ అక్కడే జరిగింది. ఆ సభకు వచ్చిన వారందరూ ఈ 'సోహం' అని అద్వైతులు వ్రాసిన దాన్ని చూశారు. అప్పుడు వారిలో ఒకరు ఈ 'సోహం' అనే అక్షరాలకు ముందు 'దా' అనే అక్షరాన్ని చేర్చారు. అప్పుడు అది 'దాసోహం' అయింది. దాసోహం అంటే నేను దాసుడను, విష్ణువు ప్రభువు అనే అర్థం వస్తుంది. ఇది విశిష్టాద్వైతాన్ని తెలియజేస్తుంది.

మూడవరోజున మళ్ళా అద్వైతుల సభ జరిగింది. అప్పుడు వారు 'దాసోహం' అనే అక్షరాలకు ముందు, ముందు 'స' అనే అక్షరాన్ని చేర్చారు. దానితో అది 'సదా సోహం' అయింది. 'సదాసోహం' అంటే యెల్లప్పుడూ 'సోహమే' అనే అర్థం వస్తుంది.

నాలుగవనాడు విశిష్టాద్వైతుల సభ జరిగింది. అప్పుడు 'సదా సోహం' అనే దానికి ముందుగా మళ్ళా 'దా' చేర్చారు. దానితో అది 'దాసదాసోహం' అయింది. అంటే 'దాసులకు దాసుడను' అనే అర్థం వస్తుంది.

అయిదవనాడు అద్వైతులు దానికి ఇంకొక 'స' చేర్చారు. దానితో అది 'సదాసదా సోహం'. అయింది. అంటే 'యెల్లప్పుడూ, యెల్లప్పుడూ సోహం' అన్నమాట.

ఆరవనాడు విశిష్టాద్వైతులు దానికి మళ్ళా 'దా' చేర్చారు. దానితో అది 'దాసదాస దాసోహం' అయింది. అంటే దాసుల యొక్క దాసులకు నేను దాసుడను అనే అర్థం వస్తుంది.

తరువాత అద్వైతుల సభ జరిగినప్పుడల్లా 'స' చేరుస్తుండే వారు. విశిష్టాద్వైతుల సభ జరిగినప్పుడు 'దా' చేరుస్తుండేవారు. మొత్తం నెల్లాళ్ళు పూర్తి అయ్యేసరికి అద్వైతులు, విశిష్టాద్వైతుల కలిసి టవునుహాలు గోడల నన్నింటినీ ఖరాబు చేసేశారు' అంటూ చూడామణి 'సోహం దాసోహం' కథను పూర్తి చేశాడు.

'శైవులు, వైష్ణవులు, శాక్తేయులు మొదలైన భేదాలు హిందూమతంలో ఇదివరకు చీలికలకు దారితీశాయి. ఇప్పుడా భేదాలను గురించి యెవరూ పట్టించుకోవడం లేదు. కాని వర్ణభేదం మాత్రం ఇంకా బలంగానే ఉంది.' అన్నాడు చిదంబరం.

'హిందూమతంలో గల వర్ణభేదాలు అంతరించి పోవడం సంతోషించవలసిన విషయమే కాని వర్ణ వ్యవస్థ ఇప్పటికీ నిలచి ఉండడం చాలా విచారించవలసిన విషయం. వర్ణభేదం లేని బలిష్ఠమైన హిందూ సమాజాన్ని రూపొందించడానికి ప్రయత్నించడం తక్షణ కర్తవ్యం' అన్నాడు చూడామణి.



'వర్ణవ్యవస్థ పోతే యెలాగ? వర్ణవ్యవస్థ హిందూ మతానికి పునాది వంటిది కదా! వర్ణరహితమైన హిందూ సమాజం యెలాగ సాధ్యపడుతుంది?' అంటూ తన సందేహాలను వెలిబుచ్చాడు చంచ్రలాపు.

'సంఘ జీవితం ఒడుదుడుకులు లేకుండా గడవడానికి ఒకప్పుడు వర్ణవ్యవస్థను యేర్పాటు చేశారు. దాని అవసరం చాలా కాలం క్రితమే తీరిపోయింది. వర్ణభేదం కట్టుదిట్టంగా అమలులోనికి రానప్పుడు కూడా హిందూమతం బలంగా ఉండేదనడానికి చాలా సాక్ష్యాలు ఉన్నాయి. అయినా కొన్ని శతాబ్దాల నుంచి యీ వర్ణ వ్యవస్థ వల్ల హిందూమతానికి చాలా నష్టం కలిగింది. ఎలకల బోనుకు సరిగ్గా వ్యతిరేకంగా ఉండే పరిస్థితి హిందూమతానికి యీ వర్ణవ్యవస్థ వల్లనే యేర్పడింది' అన్నాడు చూడామణి.

'ఎలకల బోను యేమిటి?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'ఎలకల బోను యొక్క ప్రత్యేకతను గురించి యెప్పుడైనా ఆలోచించారా? యెలుకల బోను




లోనికి వెళ్ళడానికి తప్ప బయటికి రావడానికి దారి ఉండదు. అదే దానిలోని ప్రత్యేకత' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'హిందూమతం సరిగ్గా దానికి వ్యతిరేకంగా ఉంది. హిందూమతంలో నుంచి బైటకు రావడానికి తప్ప లోనికి వెళ్ళడానికి దారి లేదు. ఇందుకు ముఖ్యకారణం వర్ణవ్యవస్థ అని చెప్పవచ్చును. ఇతర మతస్థులు కొంతమంది హిందూమతంలో చేరారనుకో. వారిని యే వర్ణస్థుడిగా భావించాలి? అనే ప్రశ్న వస్తుంది. అగ్రవర్ణాల్లో చేర్చుకొనడానికి ఆ వర్ణస్థులు అంగీకరించరు. దిగువ వర్ణాల్లో చేరడానికి చేరేవారు అంగీకరించరు. అందుచేత యితర మతస్థులు హిందూమతంలో చేరడానికి అవకాశం లేకుండాపోయింది!

జాతీయ విద్రోహశక్తులు తమ చర్యలను తీవ్రతరం చేస్తున్న యీ సమయంలో వర్ణరహితమూ, బలిష్ఠమూ అయిన హిందూ సమాజం యేర్పడడం చాలా అవసరం. దేశంలో అత్యధిక సంఖ్యాకులు హిందువులే కాబట్టి హిందువులు తమలోని విభేదాలను విస్మరించి సుసంఘటితం కావడం జాతీయ సమైక్యతకు మొదటి మెట్టు కాదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది' అంటూ చంచ్రలాపు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

# భరించలేని దారిద్ర్యం

దారిద్ర్యాన్ని భరించలేని ఒకవ్యక్తి విషం తెచ్చి "విరేచనాల మందు" అని, తనింత తాగి, భార్యకు, ఐదుగురు పిల్లలకు పట్టించాడట. మొత్తం ఏడుగురూ చనిపోయారట. ఇది అనకాపల్లి ప్రాంతంలో జరిగింది.

# అల్లుడ్ని అంతం చేసిన మామ, బావమరుదులు

తన ఇద్దరు కుమారుల సహాయంతో ఒకాయన అల్లుణ్ణి కాళ్ళూచేతులూ విరగ కట్టి, ఓ టాక్సీలో పడేసి, మూలపాడు సమీపంలో కారాపించి, అల్లుణ్ణి




క్రిందికి దింపి, నిర్దాక్షిణ్యంగా నరికి పారేసి, మళ్ళీ ఆ ముగురు కారెక్కి పోనియ్ అన్నారట. కానీ మా చక్క ధైర్యంతో ఆ టాక్సీ డ్రయివరు టాక్సీని పోలీసుస్టేషనుకు (విజయవాడ) చేర్చి వారిని చట్టానికి వప్పగించాడట.

# ఐదేళ్ళకి అసలు కారణం

పదహారేళ్ళ జేనెట్ యంగ్ అన్న అమ్మాయి (ఇడాహోలోని బోయ్‌సె) ఆస్మాతో బాధపడుతోందని ఆసుపత్రిలో చేర్చగా అయిదేళ్ళు చికిత్స చేసి, చివరికి ఆమె దగ్గుకు కారణం తెల్సారట. ఆమె అయిదేళ్ళ క్రితం ఒక ప్లాస్టిక్ పువ్వు మింగిందట. ఆ పువ్వు ఆమె గాలి గొట్టంలో అడ్డుపడడమే యీ దగ్గుకు కారణమని, ఆ పువ్వును ఆపరేషన్ చేసి (ఆపరేషన్ చెందింది పువ్వునుకాదు) తీసేశారట.

* * *




# ఇహలోకపు బాధ

వేమూరుకు చెందిన సత్తుపేటలో మేరీ అనే ఆమె తన ఇహలోకపు బాధలను భరించలేక, వంటి మీద కిరసనాయిలు పోసుకుని, నిప్పంటించుకు చనిపోయిందట. అంత ఘోరమైన చావునే కోరుకుందీ అంటే ఆమె అనుభవించిన బాధ ఎలాటిదో—ఏమో!

* * *

బికనీర్ దేవాలయంలో రోజుకు యాభై కిలో గ్రాముల మొక్కజొన్న ధాన్యాన్ని ఎలుకలకు నైవేద్యం పెడుతున్నారట. దేమునికి భక్తులు సమర్పించిన గోధుమలు మొదలైన వాటితో చేసిన ప్రసాదాలను కూడా యీ ఎలుకలకి పెడుతున్నారట. ఎలుకలకు దేవాలయంలో ఆహారాలు పెట్టి, పోషించడం వల్ల భారతదేశానికి ఆహార కొరత ఏర్పడుతున్నట్టు, ఏర్పడినట్టు పశ్చిమజర్మనీలో ఓ పత్రిక విమర్శించిందట. ఈ విషయం మీద శ్రీమతి ఇందిరాగాంధి సమాధనమిస్తూ మనుష్యులకే తిండి లేని యీకాలంలో యిలా ఎలుకలకూ వటికీ ఆహారాన్ని వేయడం చాలా గర్హనీయమని అన్నారట. అయ్యల్లారా—గొప్పవాళ్ళ యిళ్ళలో పోతులాంటి ఓ కుక్కని మేపడానికి నెలకు కనీసం మూడు వందలైనా అవుతుందట. పేదవాడు బ్రతకడానికి,ఓ యాభై చాలు. అంటే ఆ డబ్బులో ఆరుగురు పేదవాళ్ళు బ్రతకరూ! ఇవన్నీ ఏం మాటలు!! ఇదిలా వుండగా కేంద్ర వాణిజ్యశాఖ ఎలుకలను ఎగుమతి చేయడం ద్వారా విదేశీ మారకాన్ని ఎకువగా సంపాదించాలని తహతహలాడుతోందట—వాట్!

* * *

# విడిపోలేని ప్రేమికుడు

36 ఏళ్ళ శ్యాంప్రసాద్ అనే అతను 32 ఏళ్ళ ముత్తెమ్మ అనే ఆమెను ప్రేమించాడట. ఇద్దరూ ఒకే యింట్లో వుండేవారట కూడా. ముత్తెమ్మ తను పని చేస్తున్న యింటివారు తనని కలకత్తా తీసుకు వెడ్తారని, తనకు వెళ్ళాలని వుందని అందట. శ్యాంప్రసాద్ తర్ అన్నాడట. ఆమె అది పెడచెవిని పెట్టి, వారింటికి వెళ్ళిపోయిందట. శ్యాంప్రసాద్ ఆగ్రహావేశాలతో ఆమెను వెంబడించి, వారింటిలోనే ఆమెను కత్తితో పదకొండు పోట్లు పొడిచి, పారిపోయాడట. ఆనక విషం తాగి తనకు తానే పోలీసులకు లొంగిపోయి, లొంగిపోయిన కాస్సేపటికి చనిపోయాడట. ఇది మద్రాస్ బోగ్ రోడ్డుకు చెందిన విపరీతం.

# దొంగలు బంధిస్తే...

లండన్‌లో రాణిగారి గౌన్లు చేసేవాని యింట్లో దొంగలు పడి, 22 వేల పౌనులు (దాదాపు మూడు లక్షల డెబ్బయి వేలు) విలువ చేసే నగలూ, తదితర వస్తువులూ దొంగతనం చేశారట. ఇంటతన్ని, అతని భార్యనూ తాళ్ళతో కట్టేస్తుండగా దొంగ చేతిలో వున్న కత్తి ఇంటాయన భార్యకు తగిలి, రక్తం కారిందట. వెంటనే ఆ దొంగ ఆమె గాయానికి కట్టు కట్టి "టెలివిజను ఆన్ చేశారు. చక్కగా చూస్తూ, ఆనందిస్తూ వుండండి. మేం వెళ్ళి పోలీసులకు చెప్పి, వాళ్ళు వచ్చి మీ కట్లు విప్పి విడుదల చేస్తారు." అని చెప్పి, వాళ్ళని అలా బంధించినందుకు క్షమాపణలు చెప్పుకొని వెళ్ళారట. ఆనక వాళ్ళు భరోసా యిచ్చినట్టే పోలీసులు వచ్చి కట్లు విప్పారట—దొంగల్లో దొరలు!



వెళ్ళయపాలయంలో ఒక యిరట్లో రామస్వామి; అతనిభార్య అయ్యమాళ్, పసిపిల్ల మకుటేశ్వరి (2 ఏళ్ళు) చనిపోయి వున్నారట. పోలీసు సోధనలో దొరికిన ఒక వుత్తరంలో విషయం తెలిసింది. తనకున్న దీర్ఘవ్యాధితో బ్రతకడం అనవసరమని పించిందనీ, తను చనిపోయాక, తన కుటుంబాన్ని చూసేనాథు డెవడూ లేడనీ, కనుక తనతోపాటే తన భార్యాపిల్లల జీవితాలనూ తీసుకుపోడం న్యాయమని అలా చేశాననీ రామస్వామి వుత్తరంలో రాశాడట. బ్రతికి వుండిన సుఖములు బడయవచ్చు— అనే ముక్కను నమ్మి బ్రతకడం కష్టం కదా!

## టు ప్రిహాలు

భారత చలనచిత్ర నిర్మాతల సంఘం (బొంబాయి) అధ్యక్షుడు ఐ.యస్. జోహార్ చుంబన కళపై ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని తీస్తున్నారట. ఇది నిజమా కాదా అని లోక్‌సభలో చర్చకు వచ్చింది. అతనంతకు సమర్థుడే! ఆర్. ఆర్. మిశ్రో అనేవ్యక్తి పూనా ఫిల్మ్ ఇన్‌స్టిట్యూటులో పట్టభద్రుడు. ఈయన కామశాస్త్రం మీద ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని తీస్తున్నారట. ఇందులో వాత్స్యాయనునికామసూత్రాలు,ఖజురాహో, కోణార్క




శిల్పాలు—అంతేగాక నటీనటులు కూడా వుంటారట. ఛత్రపతి శివాజీ కత్తి కోసం భారత ప్రభుత్వం వెతుకుతుంది. ఇది లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలో కూడా లేదట— వెక్రిజిం?! పాట్నా వైద్యకళాశాల ఆసుపత్రికి చెందిన కార్యదర్శి కార్యాలయంలో ఒక లక్షాపదిహేను వేల రూపాయలు పోయాయట. అంత డబ్బు అక్కడెందుకుంది? సాధరణంగా వచ్చే జబ్బులలో 90 శాతం జబ్బులను తగ్గించడానికి ఓ మందు కనిపెట్టిన వైనాన్ని మెక్సికోలో ఒక డాక్టరు తెలియజేశారట. దగ్గు మొదలు కలరా వరకూ వున్న వ్యాధులకు ఒకే మందట! నిజమా! ●






















లాటరీ టికెట్లకోసం ఎగబడుతున్న జనం.

# జనవ్యామోహాన్ని రెచ్చగొడుతున్న లాటరీ

గత కొన్ని మాసాలుగా మద్రాసు ప్రజల జీవితం చాలా అలజడిగా సాగుతున్నది. ఇందుకు కారణం లాటరీలూ, రేసులూను.

'క్యూ' లో నిలబడవలసివచ్చే హోటళ్లు ఇప్పుడు ఖాళీగా వుంటున్నాయి. సినిమా హాళ్లదగ్గర జనం పలచబడి పోయారు. షాపింగ్ సెంటర్లలో రద్దీ తగ్గిపోయింది. పత్రికలుకూడా విరివిగా అమ్ముడుపోవడం లేదని తెలుస్తున్నది. ఇక, జనం పుష్కలంగా కనిపించేది ఎక్కడా అంటే — దేవాలయాల్లోనూ, జ్యోతిష్యుల దగ్గరాను!

ప్రజల్లో ఒక్కసారిగా ఇంతటి మార్పు ఎలా వచ్చింది ? అని ఆశ్చర్య పోనక్కరలేదు రాను రాను జనంలో లాటరీ పిచ్చి ప్రబలిపోతున్నది. ఎలాగో అలా, డబ్బు ఆదాచేసి లాటరీ టిక్కెట్లమీద ఖర్చు పెట్టేస్తున్నారు.

మొదటి 'డ్రా' ఏ అట్టహాసమూ లేకుండా సాఫీగా జరిగిపోయింది. పదిమంది లక్షాధికారు లయ్యారు. రెండో 'డ్రా'కి మరో పదిమంది లక్షాధికారు లయ్యారు. కొంతమంది మరికొన్ని లక్షల్ని వేలుగాను వందలుగాను పంచుకున్నారు. ఇప్పుడు మద్రాసులో ఈ లాటరీపిచ్చి బాగా ముదిరి మయింది. అదుపులో పెట్టలేనంతగా పిచ్చి పెరిగిపోయింది.

టిక్కెట్లు ముందుగా టోకన్లు ఇస్తున్నారు. విడుదల కాగానే వాటి స్థానంలో టిక్కెట్లను ఇస్తున్నారు. చాలాచోట్ల ఇలా 'అడ్వాన్సు బుకింగు' జరిగిపోతున్నది. టిక్కెట్లు అమ్మే చోట మైళ్లపొడవున 'క్యూ' లుంటున్నాయి. ఆడా మగా పిల్లా పీచూ అంతా ఆ వరుసల్లో పడిగాపులు పడివుంటున్నారు. వర్షంలో తడుస్తున్నారు, ఎండలో మాడుతున్నారు. టిక్కెట్లు హఠాత్తుగా అయిపోయినప్పుడు జనం ఉద్రేకానికి తట్టుకోలేక ఏజెంట్లు ఒకోసారి పోలీసు స్టేషన్లో తలదాచుకో వలసి వస్తున్నది!

'టిక్కెట్లు విడుదలయినట్టు తెలియకుండానే అవి అమ్ముడు పోతున్నాయి. 'బ్లాక్'వ్యాపారం ఎక్కువయింది. రాష్ట్రం దరిదాపు ప్రాంతాల్లో ఇది మరీ ఎక్కువగా వున్నది. ఈ విధంగా వివిధ రాష్ట్రాల సొమ్ము ఒకచోట స్థిరపడడానికి అవకాశ మేర్పడుతున్నది! ఇక్కడ ఆలోచించ వలసిన విషయం మరొకటున్నది: లాటరీ టిక్కెట్లకి ఇంతటి ప్రచార మున్నదికదా! రూపాయనోట్లనే దొంగతనంగా ముద్రిస్తున్నప్పుడు — ఈ టిక్కెట్లు అలా రావని ఎలా చెప్పగలం ?

సాధారణంగా 'శ్రమ తక్కువ ఫలితం ఎక్కువ' సిద్ధాంతాన్ని అందరూ కోరుకుంటూనే వుంటారు. ఈ బలహీనతని అర్థం చేసుకునే కదా, లాటరీలు ప్రవేశ పెట్టింది!

బస్టాపుల్లో, మార్కెట్లో, ఆఫీసుల్లో—ఎక్కడవిన్నా లాటరీ గొడవే. ఆఫీసుల్లో ఇలాంటి చర్చలవల్ల పని సరిగ్గా జరగడంలేదు. ఎప్పుడూ—'కలిసొచ్చే లక్ష' మీదే దృష్టి వుంచుకోవడం వల్ల పనిమీద ఉత్సాహం సన్నగిలుతున్నది. ఏ పూట కాపూట భోజనానికి లాటరీ కొట్టేవాడు కూడా కడుపు మాడ్చుకుని ఆర్జనంతా లాటరీలమీద వినియోగించేస్తున్నాడు!

లాటరీలవల్ల ప్రజలు ఉపకారం పొందుతున్నారని భ్రమపడవచ్చు. కాని, అది అనేక దుష్ఫలితాలకి దారి తీస్తున్నదని చెప్పడానికి దృష్టాంతాలు చాలా వున్నాయి. లాటరీ వ్యామోహంపై ప్రజలు భక్తశిఖామణులై పోతున్నారు. దేవాలయాల్లో భక్తుల సంఖ్య హెచ్చింది. పూజా పునస్కారాలు ఎక్కువయ్యాయి. ఇది ఒకవిధంగా మేలయిన విషయమే. అనుకోవచ్చు. దైవకార్యం మాట దేవుడెరుగుగాని, ఈవిధంగాకూడా సొమ్ము వృధా అయిపోతున్నది. ఇన్ని ఆశలూ పెట్టుకుని, ఇంతా ఖర్చుపెట్టి తీరా లాటరీ తగలకపోతే అతని అవస్థ వర్ణనాతీతం. ఒకటి రెండు అంకెల్లో అదృష్టంతప్పిన వాళ్ళ బాధ అపరిమితం. ఈ పరిస్థితిలో ప్రజలు అంతులేని మనోవ్యధకి గురవుతున్నారు.

లాటరీగెల్చిన ఒక్కొక్కరి చిరునవ్వు వెనకా కొన్ని లక్షలమంది 'బాధ' వుందని వేరే చెప్పక్కరలేదు!

ప్రజల్లో ధన వ్యామోహాన్ని రెచ్చ గొట్టటంవల్ల చాలా కష్టనష్టాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. ప్రజల్లో ఈ వ్యామోహం రాను రాను ఎలాంటి పరిణామాలకి దారితీస్తుందో ఊహించరానిదేమీకాదు. సాటివాడు చూస్తూ చూస్తుండగానే లక్షాధికారి అయినపుడు ఈర్ష్యా ద్వేషాలకి స్థానం వుండితీరుతుంది. అంతేకాక, పులినిచూసి నక్కవాత పెట్టుకున్నట్టు, దొంగతనాలుకూడా ఈ విధంగా ప్రబలిపోడానికి అవకాశాలున్నాయి. డబ్బంతా దుర్వినియోగపరచి భంగపడిన ప్రజల



శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి.

వివేకం వెర్రితలలని వేయవచ్చు. ఎక్కువ జీతాలు కావాలని ఆందోళనలు లేవవొచ్చు. అలజడి రావొచ్చు. అప్పుడు, కొరివితో తల గోక్కున్నట్టే అవుతుంది!

ప్రయోజనాన్ని - ఆశించి ఏపనిచేసినా తప్పులేదు. కాని, ఆపని ప్రజల్ని వక్ర మార్గాల్లో నడిపించడానికి ఎలాంటి అవకాశమూ ఇవ్వకూడదు. ప్రజలపరంగా ఆలోచించి ఈ లాటరీ విధానంలో మార్పులు తీసుకురావాలి. అప్పుడుగాని ప్రజాజీవితంలో మామూలు శాంతి నెలకొనదు.

ప్రజల్ని ఈ బారినుండి రక్షించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ సందర్భంలో ప్రశంసించితీరాలి!

ఆటలు

# రంజీ ట్రోఫీలో జయసింహ



డిసెంబరు 14 నుంచి జరిగిన రంజీ ట్రాఫీ క్రికెట్ మాచ్‌లో జయసింహ 11 వికెట్లు పడగొట్టాడు, మొదటి ఇన్నింగులోనే 54 పరుగులు తీశాడు. హైదరాబాదు జట్టు సవుత్ జోన్‌లో ప్రథమ స్థానం ఆక్రమించటానికి ముఖ్యకారకుడు అయ్యాడు. హైదరాబాదుకి 29 పాయింట్లు వచ్చాయి. మదరాసుని 6 వికెట్లతో గెలిచారు.

హైదరాబాదు జట్టుకి ఒక పెద్ద ఆటగాడు ఆడాడు. అతనెవరో కాదు, అంతర్జాతీయంగా పేరుపొందిన పాటవుడీ నవాబు. జయసింహ తనమీద కాప్టెన్‌గా ఉన్నందుకు తను అభ్యంతరం చెప్పలేదు. ఇది నిజమయిన ఆటగానితనం. ఈ రోజుల్లో ప్రతి చిన్న విషయానికీ రాద్ధాంతం చెయ్యటం అలవాటయి పోయింది. ఇతని సహృదయాన్ని మెచ్చుకోవాలి.

మదరాసు ఏమాత్రం బాగా ఆడలేదు. బాటింగ్ చేసేవారు బెదురుగా ఆడారు. రెండవ ఇన్నింగ్స్‌లో మరీను. ఎక్కడ గెలుస్తాములే అన్నట్లు ఆడారు. మొదటి ఇన్నింగ్స్‌లో 5 వికెట్లు ముందుగా ఉన్నప్పటికీ ఆట 'డ్రా' అయితే మదరాసు ప్రథమ శ్రేణిలో ఉండేది. కొందరు బాట్స్‌మన్ మొదటి ఇన్నింగ్స్‌కన్నా కనాకష్టంగా ఆడారు—సత్యేందరసింగ్ (78), కె. ఆర్. రాజగోపాల్ (27) అని మినహాయిస్తే.

హైదరాబాదు జట్టువారు కూడా అతిజాగ్రత్తగా ఆడారు. అబిద్ ఆలీ 76 కి అవుట్ అవగానే—ఇతను పెద్ద ఆటగాడు, విదేశయాత్రలలో చాలా బాగా ఆడాడు — జయసింహతోబాటు మిగిలిన వారందరూ మరీ భద్రంగా ఆడారు. అందుకనే హైదరాబాదుకి బోనస్ పాయింట్లు రాలేదు.

ఈ సందర్భంలో మదరాసు స్పిన్నింగ్ బవులర్ వి. వి. కుమార్ తన జట్టుకి బాగా సాయం చేశాడు. సి. కె. బెల్లియప్ప రాలేకపోవడంతో తనే కాప్టెన్‌గా ఉన్నాడు. (బెల్లియప్ప లేకపోవటం బాటింగ్ బలాన్ని తగ్గించింది.)

కుమారేకాక ఎస్. వెంకటరాఘవన్ కూడా బాగా ఆడాడు. కుమార్ 36 ఓవర్లు చేసి 4 వికెట్లు వేస్తే, వెంకటరాఘవన్ 43.4 ఓవర్లకి 3 వికెట్లు తీశాడు. మదరాసు జట్టువారు కొన్ని మంచి కాచ్‌లని వదిలి వేశారు...

ఇక హైదరాబాదు వయిపున గోవిందరాజ్ ఒక్కొక్క ఇన్నింగ్స్‌లోనూ 4 వికెట్లు పడగొట్టాడు. రెండవ ఇన్నింగ్స్‌లో మదరాసు ఆటగాడు సత్యేందర్‌సింగ్ ఉజ్వలంగా ఆడుతున్నప్పుడు గోవిందరాజ్‌ని బవులు వెయ్యమనటం జయసింహ చక్కటి ఉపాయాలలో ఒకటి. గోవిందరాజ్ ముందు సత్యేందర్‌సింగ్ వికెట్ నిలవలేదు. మదరాసు 144 కి ఆల్‌అవుట్ అయిపోయింది. హైదరాబాదు 6 వికెట్ల తేడాతో గెలిచింది.

* * •

సుమంత మిశ్రా కొడుకు గౌరాంగ మిశ్రా తిరుపతిలోజరిగిన అన్ని టెన్నిస్ పోటీలూ గెలిచి కలకత్తా మదరాసుని 3—1 చొప్పున ఓడించటానికి కారకుడయ్యాడు. పోటీలు ఇంటర్ యూనివర్సిటీ పోటీలు ...

—కె. ఎస్. నరసింహన్

# 1969లో మీ రాశిఫలం!

## ధనుస్సు

ప్రతి సంవత్సరం నవంబరు 22 వ తేదీ నుంచి డిశంబరు 21 వ తేదీవరకు సాయన సూర్యుడు ధనూరాశి యందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను పుట్టిన వారు ధనూరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు.

ధనూరాశి యందు జన్మించిన వారికి యీ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సంవత్సరం ప్రారంభంలో కంటే సంవత్సరం ఆఖరులో బాగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి.

ఉద్యోగాన్వేషకుల ఉద్యోగ ప్రయత్నాలు శ్రమ మీద ఫలిస్తాయి. అవివాహితుల వివాహ ప్రయత్నాల్లో బంధువుల సహకారం లభిస్తుంది. విద్యార్థులు శ్రమ మీద కృతార్థులు కావచ్చును.

**జనవరి**

ఈ నెలలో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించ గలరు. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**ఫిబ్రవరి**

ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి గాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగు తుంది. వృత్తిలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించ గలరు. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేస్తారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అలంకార వస్తువులు కొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మార్చి**

కొన్ని వ్యవహారాల్లో మీ-మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల మున్ముందు ఆర్థికంగా యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో కొంత మంది వ్యక్తులు మీ యెదుట పొగడుతూ చాటున దూషిస్తుంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**ఏప్రిల్**

వృత్తి వ్యాపారాల్లో యిదివరకు ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు. మీకు మున్ముందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి.

**మే**

కొన్ని వ్యవహారాల్లో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా ప్రవర్తించవలసి వస్తుంది. ప్రయాణాల్లో ప్రయాస కలుగుతుంది. మీరు యిదివరకు జరిపిన వ్యవహారాల వల్ల యిప్పుడు యిబ్బంది కలుగు తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. సంతానానికి అనారోగ్యం చేస్తుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**జూన్**

ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు అందక పోయినా, యేదో ఒక విధంగా అన్ని వ్యవహారాలను సరిపుచ్చుకొన గలరు. ఉద్యోగంలో మీరు మొగమాటాలకు లొంగి పోవడం వలన శ్రమకు గురి కాగలరు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

**జూలై**

వృత్తిలో కొంత మంది వ్యక్తులు మీమీద దుష్ప్రచారం చేయగల ప్రమాదం ఉంది. కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని రెచ్చగొట్టి తమ పనులను నెరవేర్చుకొనడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో మీరు యిదివరకు చేసిన నిర్ణయాల వల్ల యిప్పుడు యిబ్బంది కలుగు తుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును.

**ఆగస్టు**

మీరు యిదివరకు సాధ్యం కావనుకొన్న వ్యవహారాలు కూడా యిప్పుడు సానుకూల పడగలవు. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు రాణించ గలవు.

**సెప్టెంబరు**

వృత్తి వ్యాపారాల్లో మొగమాటాలకు లొంగి పోవడం తగదు. కొన్ని వ్యవహారాల్లో మీరు ఆదర్శప్రాయంగా ప్రవర్తించడం వలన శ్రమకు గురి కాగలరు. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరుతాయి. ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**అక్టోబరు**

వృత్తిలో యిదివరకు చేజారిపోయిన అవకాశాలు తిరిగి లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**నవంబరు**

ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం అనుకోని వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో ఆకస్మికంగా వ్యతిరేక పరిస్థితి యేర్పడు తుంది. కోర్టు వ్యవహారాల్లో ముఖ్యమైన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది.

**డిసెంబరు**

ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతూనే ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది.

## మకరం

ప్రతి సంవత్సరం డిశంబరు 22 వ తేది నుంచి జనవరి 20 వ తేదీ వరకు సాయన సూర్యుడు మకరరాశి యందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను పుట్టిన వారు మకరరాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు.

మకరరాశి యందు జన్మించిన వారికి యీ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించ గలరు. ఉద్యోగంలో విశేషమైన అనుకూలతను ఆశించడానికి యిది సమయం కాదు.

ఉద్యోగాన్వేషకులకు తాత్కాలికోద్యోగాలు లభిస్తాయి. అవివాహితుల వివాహ ప్రయత్నాలు సంవత్సరం మధ్యలో ఫలించ గలవు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

**జనవరి**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు యిదివరకటి కంటే బాగా ఉంటాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధు మిత్రులను కల్సు కొంటారు.

### ఫిబ్రవరి

కొన్ని పనులు సులువుగా నెరవేరినా, మరి కొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వృత్తిలో మీ యెదుట పొగడుతూ చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించ వలసి వస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి.

### మార్చి

మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లోను అభివృద్ధిని సాధించ గలదు. కొన్ని వ్యవహారాల్లో మీరు మొగమాటాలకు లొంగిపోవడం వలన కార్యభారం పెరుగుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

### ఏప్రిల్

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయిగాని ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతుంటుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

### మే

భవిష్యత్తులో మీకు ఉపయోగించగల వ్యవహారాల్లో చొరవ చూపించ వలసిన సమయం. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. వృత్తిలో యిదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

### జూన్

వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించక పోవచ్చును. మీ ఆలోచనలు యితరులకు సలహా రూపంలో బాగా ఉపకరిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో కొంతమంది వ్యక్తులు మీమీద దుష్ప్రచారం చేయగల ప్రమాదం ఉంది.

### జూలై

ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. వ్యాపారంలో మీ యెదుట పొగడుతూ చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. ప్రయాణాలు ప్రోత్సాహకర్షగా ఉంటాయి. ఉద్యోగంలో సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. బంధు మిత్రులను కల్సు కొంటారు.

### ఆగస్టు

వృత్తి వ్యాపారాల్లో అవస్థ మీది అనుభవం మరొకరిది కాగల పరిస్థితి యేర్పడుతుంది. మీకు సహాయం చేస్తామన్న వారు సమయానికి తప్పుకొనే ప్రమాదం ఉంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆందోళన కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

### సెప్టెంబరు

ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల ముమ్ముందు కూడా ఉపయోగం ఉంటుంది. వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. కొన్ని వ్యవహారాల్లో మిత్రుల సలహాలను త్రోసి పుచ్చడం తగదు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. నూతన విషయాలను తెల్సు కొంటారు.

### అక్టోబరు

వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఇదివరకు మీ యెడల ముభావంగా ఉన్నవారు కూడా యిప్పుడు మీ అభిప్రాయాలను గౌరవిస్తారు. సాంఘిక వ్యవహారాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. బంధువులకు సహాయం చేస్తారు. పుణ్య కార్యాలు చేస్తారు.

### నవంబరు

ఇదివరకు కొన్ని వ్యవహారాల్లో మీకు యేర్పడిన సందేహాలు తొలగి పోతాయి. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంత వరకు లాభించగలవు.

### డిసెంబరు

ఏ వ్యవహారంలోను సాహసించడానికి వీలులేని సమయం. వృత్తి వ్యాపారాల్లో యిదివరకు మీ వల్ల ఉపకారం పొందిన వ్యక్తులే యిప్పుడు మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

—మహేష్




**జరిగిన కథ**

లలితకి మోహన్‌తో పరిచయమవుతుంది. అది ప్రేమగా పరిణమిస్తుంది. పెళ్ళికూడా చేసుకోవాలనుకుంటారు. ఆస్తికోసమే మోహన్ తనని పెళ్ళిచేసుకోదలిచాడని తెలుసుకున్న లలిత అతనితో తెగతెంపులు చేసుకుంటుంది. లలితకి పెద్ద దిక్కయిన అత్తయ్య చనిపోతుంది. లాయరు సమ్మతిన ఆమె బలరామ్ [illegible] గార్డియన్ ఇంటికి వెళ్తుంది. అక్కడ అతని మేనత్త సరస్వతమ్మ, కూతురు సరళ వుంటారు. వారికి లలితంటే గిట్టదు. బలరాం లలితమీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ వుంటాడు. ఒక పార్టీలో మోహన్‌ని చూసి లలిత ఆశ్చర్యపోతుంది.

## 6

ఓ నిముషంపాటు అక్కడ నిశ్శబ్దం తాండవించింది. మోహన్ ముఖం చిరునవ్వుతో వెలిగిపోతూంది. అదే క్షణంలో లలిత గుండెలు త్వరితగతిని కొట్టుకొని పాత జ్ఞాపకాల కోతలు పెట్టుతున్నాయి. తను మూయాలని ప్రయత్నిస్తున్న తలుపుని ఎవరో బలవంతాన తెరచినట్టు అనిపించింది లలితకి. మరుక్షణంలో ఊహల ఉచ్చులు సడలిపోయి ఎన్నడూ తెలియనంత కోపం ముంచుకొచ్చింది లలితకి. తన మనసులో అంత కోపానికి చోటుందని ఊహించనైనా లేదు లలిత.

'మళ్ళీ తారసపడ్డావే — గమ్మత్తుగా లేదు!' అంది. పౌరుషంకల మగవాడికి పెట్టు చాలనుకుంది.

'ఈ ప్రపంచం చాలా చిన్నదన్న దానికిది నిదర్శనంకాదూ?' అంటు వెర్రిగా నవ్వాడు మోహన్—అతని ముఖంలో కళ తప్పింది—కాని నటన అమోఘంగానే ఉంది. తరువాత అసలతనికేసి చూడలేదు లలిత. భోజనంచేశారో మాటలే తిన్నారో తెలియకుండా ముగించారు—అప్పటికే రెండున్నర దాటుతోంది అంతా లేచారు. అందరూ దాటి వెళ్ళేదాకా ఆగి లలితని ఓ క్షణం నిలవేసి అడిగాడు మోహన్.

'నన్ను అసహ్యించుకుంటున్నావా లలితా?' అంటూ నెమ్మదిగా అడిగాడు.

లలిత ముఖంలో రంగులు మారలేదు. ఆమె కళ్ళు కోపంగానూ లేవు. బాధగానూ లేదు. ఆశ్చర్యం మటుకు స్పష్టంగా ప్రకటిస్తున్నాయి. అతని బతిమాలుతున్న ధోరణికి ఆశ్చర్యపడుతూ,

'ఎందుకూ అసహ్యించుకోడం?' అడిగింది.

'నీకు నేను కృతజ్ఞత తెల్పాలేగాని అసహ్యించుకోవడం ఎందుకు?' అనేసి అతని బదులుకోసం ఆగకుండా వచ్చి కారు ఎక్కింది.

అసలిక్కడ మోహన్ తారసపడ్డమే ఆశ్చర్యం. కాని అంతకుమించిన ఆశ్చర్యం —తన కదేమంత బాధగా ఉండకపోవడం.

దారిలో దింపుతామంటూ మోహన్‌ని సరళ కారు ఎక్కమంది.

'లలిత కారు కొనుక్కుంటోంది. అందుకే అంత సరదాగా ఉందీవేళ' అంది మాటల ధోరణిలో.

'అందుకే కాబోలు నన్ను మరిచిపోయింది' అన్నాడు మోహన్ నిర్లిప్తంగా. 'మేం ఇది వరకు చాలాసార్లు కలుసుకున్నాం. ఆమె అత్తయ్యకూడా ఇక్కడే ఉన్నారా?'

'అరే, ఆమె హఠాత్తుగా పోయింది తెలియదా నీకు? అయితే లలిత ఇక్కడికొచ్చేసింది. ఆమె మేనమామకూడా పోయాడు. ఇద్దరి ఆస్తికీ వారసురాలైంది లలిత. బలరాం ఆమెకి ట్రస్టీ...' వివరాలు చెప్పింది సరళ.

'ఏం డబ్బు? ఎంతడబ్బు?' అన్న ప్రశ్న మోహన్ నోట్లోనే ఉండిపోయింది ... తొందర పడకూడదనుకున్నాడో — గమ్యం వచ్చిందని దిగిపోవలసి వచ్చిందో!

కారు దిగిపోయినాకూడా మోహన్ మొద్దుబారిన మెదడు పనిచేయడం మొదలెట్టలేదు.

ముందు సీటుమీదకి వంగుతూ 'లలితా మోహన్ తెలుసుననేనా చెప్పలేదేం?' అని అడిగింది సరళ. 'చాలా పేరున్నవాడు తెలుసా?'

'అలాగా? నా కతనంత బాగా తెలియదు. చాలామందిని చూస్తూంటాం కదా?' నెమ్మదిగా అంది లలిత.

'అమ్మా, మోహన్ రచయిత. ఇప్పుడే దర్శకత్వం ఛాన్సుకూడా వచ్చిందిట. మన పక్క భూపతిగారి బంగళా వాడుకుంటారట — అందుకూ ఇటువైపులకి వస్తే' అంటూ తల్లికి వివరించింది.

సరళకి చాలా సూక్ష్మదృష్టి. అందుకే లలితకి మోహన్ బాగానే తెలుసునని గ్రహించింది. అతన్ని మొదట చూసినప్పుడు, అతన్ని పలకరించినప్పుడు—అంతా గమనించింది. ఇప్పుడు పిడికిళ్ళు బిగించి ఒడిలో చేతులు పెట్టుకుని కూర్చున్న లలితని చూస్తూంటే సరళకి కుతూహలం హెచ్చింది.

దీన్లో ఏదో ఉంది. అదేమిటో తెలుసుకోవాలి — అనుకుంది. 'వాళ్లంతా ఓ పదిపదిహేను రోజు లుంటారుట. బలరాం ఓ రోజు మన బంగళాకి పిలుద్దామా: అసలు మన బంగళా ఎందుకు వాడుకోనివ్వకూడదు?' అంది సరళ.

బలరాం కూడా మౌనంగా కారు తోలుతున్నాడు. భోజనందగ్గర తారసపడ్డ ఆ వ్యక్తి పానకంలో పుడకలాగా తోచాడు. ఆ పోజు గట్రా చూస్తే లోపల డొల్లే అని గ్రహించడానికి బలరాంకి ఆట్టే టైము పట్టలేదు? అందుకే సరళ మాటలు వినిపించుకోలేదు. ఇప్పుడు సరళ ప్రశ్నకి ఓ నవ్వు నవ్వేసి ఊరుకున్నాడు.

'అవును బలరాం పిలుద్దాం, మనకు సరదాగా ఉంటుంది.'

'వా కను సరళా, సిల్లీగా మాట్లాడకు' అంటూ సీరియస్‌గా రోడ్డు చూడ్డం ప్రారంభించాడు బలరాం.

ఎంతో ఆనందంగా ప్రారంభం అయిన ఆరోజు కాస్త మోహన్ రాకతో నిరుత్సాహంగా అయిపోయిందనిపించింది లలితకి. ఇదింతటితో ఆగదేమో అన్న అనుమానం కూడా తలెత్తింది లలితకి. ఇప్పుడసలు తనంటె ఆపేక్షగాని ఆదరణగాని తనకి లేకపోవచ్చు. కాని పూర్వంలో అతనే లోకం అనుకుంది అతని విలువ ఇప్పుడు అసలు లేకపోయినా, అతని ఉనికికి ఉన్న న్యూసెన్సు వాల్యూ ఎక్కువగానే ఉండొచ్చుననిపించింది. ఈ చుట్టుపక్కలే ఉన్నట్టయితే మళ్లీ తారసపడతాడు. అదామె కసలు యిష్టం లేదు. సర్దుకుంటున్న తన జీవితం మీద విధి ఎదురుదెబ్బ తీయదు కదా అన్న అనుమానం మనసులో ఏర్పడింది లలితకి. తనలాగే అతగాడూ మరిచిపోయి నిశ్చింతగా ఉంటే బాగుండేది. కాని అతనలా ఊరుకునేలా తోచలేదు 'నన్ను అసహ్యించుకుంటున్నావా లలితా' అన్న అతని ప్రశ్నే చెప్తోందా సంగతి.

'పాపం మోహన్ చాలా సరదా అయినవాడు. అందరి నటులలాగా భేషజాలు లేవు. నువ్వతన్ని గుర్తించకపోతే ఎంత చిన్నబుచ్చుకొని పోయాడో చూశావా? అయినా అదేమిటి లలితా? అతన్నలా మరిచిపోయావు?' వెనక సీటులో జేరబడి కూర్చుంటూ అంది సరళ.

ఎలా సమాధానం చెప్పాలి? సమాధానం చెప్పితీరాలా? అన్న సంశయంతో సతమతమయిపోతూన్న లలితని బలరాం రక్షించాడు.

'ఏం దారితప్పిన దూరపుబంధువునిలాగా పల్కరించాలా?'

కొంచెం తీవ్రంగానే అన్నాడు బలరాం.

'అలాంటివాళ్లని నేనెరుగుదును'—

'ఏం తెలిసినవాళ్లని గుర్తించడంకూడా తప్పా?' నవ్వుతూనే అడిగింది సరళ.

'సరళా, నీ స్నేహితుడో చుట్టమో, ఆ వ్యక్తిని అతని పనేదో చేసుకోనియ్యి...



# ప్రేమించు ప్రేమకై

సినిమాకి రానుకుంటాడో ఖాదీపోలు పెంచుకు తిరుగుతాడో వదిలేయి' అని సంభాషణ ముగించు అన్నంతగా అన్నాడు బలరాం.

'ఓ, బలరాం, మోహన్ కొంచెం అత్యా ధునికుడనుకో. అంతమాత్రంచేత అలా అనుకోవాలా ఏం?'

నిశ్శబ్దంగా కూర్చున్న లలితని చూస్తూ 'లలితా, నువ్వెవరి సైడో చెప్పు?' అన్నాడు బలరాం—ఏదో మాట్లాడించాలని.

'చాలామటుకు నీ ప్రక్కనే బలరాం.' అంది.

'థాంక్స్' అంటూ నిశ్శబ్దంగా కారు తోలడం ప్రారంభించాడు.

అడపా తడపా సరళా సరస్వతమ్మా మాటలు తప్పించి—అంతా ఏం మాట్లాడకుండానే ఇల్లు చేరారు.

బలరాం కారుదిగి తలుపుతీశాడు లలిత కోసం. అతన్ని, బలమైన అతని భుజాలను ఓ క్షణం పరీక్షగా చూసింది లలిత ఎందుకో మనస్సుని అలముకొన్న మగత కొంచెం తొలగినట్టనిపించింది.

'ఎప్పుడో ఒకప్పుడు మోహన్ గురించి చెప్తాను బలరాంకి మేం ఇంకా దగ్గర స్నేహితులం అవాలి. అప్పుడు కాని కుదరదు' అనుకుంటూ ఇంట్లోకి నడిచింది లలిత.

రాత్రి పడుకుందన్నమాటేగాని సరళకి రకరకాల ఊహాలు ఆలోచనలు మనస్సుని చుట్టుముట్టాయి నంగనాచి వంగముల్లా అన్నట్టు ఈ లలిత పైకి కనిపించేంత అమాయకురాలు కాదని గ్రహించింది. కాని ఆ కప్పిపెట్టే సంగతేమిటో అంతు చిక్కడం లేదు.

బలరాంని అల్లుడిగా సరస్వతమ్మ ఎప్పుడూ ఊహించుకోలేదు — కారణం బలరాం "అసలు పెళ్ళిచేసుకోడన్న గుడ్డి నమ్మకం పడిపోయిందావిడ మనస్సులో. అందుకే ఎంతసేపూ తమ చుట్టుపక్కల వాళ్ళలో సరళకి తగిన వరుడు దొరుకుతాడేమోననే తాపత్రయం పడుతోందావిడ గారు. కాని సరళ ఊహాలందుకు తల్లి కిందులు. అందుకే ఆమె ఎవరితో స్నేహంగా ఉన్నా ఎక్కువ సీరియస్‌గా తీసుకోలేదు. బలరాంతో చనువుగా ఉంటూ అతని ఇంట్లో ఒకతెగా అతనికి తెలియకుండానే బలపడిపోతే — తరవాత చూసుకోవచ్చునని ఆమె అభిప్రాయపడింది. అందుకే తలలో నాలికగా మసులుతూనే ప్రవేశించి అతనిపై శ్రద్ధ కనపడ నివ్వలేదు...ఇంత రహస్యపథకం వేసుకుంది కనకనే లలిత వస్తుందంటేనే ఇష్టంలేక పోయింది. అందుకే ప్రత్యేకంగా పై వ్యక్తి వస్తే ఇంట్లో ఎంత విసుగ్గా ఉంటుందో, ఇబ్బందిగా ఉంటుందో పదేపదే చెప్పి రాబోయే లలిత ఓ బెడద అన్న ఉద్దేశ్యం బలరాంలో కలిగించ కల్గింది. వచ్చినా ఆమెని ఎంత త్వరగా పంపించాలా అని ఆలోచనలు చేసింది.

అందుకే లలితని చూసినప్పుడు అంతా అంతగా ఆశ్చర్యపడ్డారు. ఏదో మ్యాగ్జీన్ బోర్డింగులో పడేయడానికి తగి ఉంటుందని ఊహించిన పిల్ల — చక్కని యువతి అవగానే బలరాం ఆశ్చర్యానికి అంతులేదు. ఏదో మనుష్యులమధ్య జంతువులా పెంచబడిన లలిత ఇంత నాజూకుగా హుందాగా ఉంటుందని సరళా ఊహించలేదు...బలరాం వివాహ ప్రసక్తి తలపెట్టినా యుక్తాయుక్తాలు తెలియని అమ్మాయిని చేసుకుంటాడని తలపెట్టని సరళకి తన అంచనాలు తప్పు అవుతాయేమోనని భయం వేస్తుంది. బలరాం, లలిత విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపించడం ప్రారంభించే సరికి మొలకెత్తిన భయం బలపడ సాగింది ... లలితకి త్వరలోనే తగిన వరుణ్ణి వెతుకుతాడు బలరాం అని ఊహించసాగింది సరళ...కాని సరస్వతమ్మగారికిది సరైనదిగా తోచలేదు. ఇంకా సరళకే తను తొందరపడ్డం లేదే అనుకుంది. అమ్మమ్మగారు లలితపట్ల ప్రత్యేకశ్రద్ధ కనపరచడం, బలరాంమీద ఆవిడ కెనలేని లభిమానంతోపాటు లొంగించే అధికారంకూడా ఉండడంతో సరస్వతమ్మగారి ఆలోచనలకి కదలిక వచ్చింది ఈ నాటి విశేషాలు ఆ తల్లీ కూతుళ్ళలో అలజడి రేకెత్తించాయి. ఆందోళన కల్గించాయి. చూసి చూడనట్టు బలరాం లలితకేసి చూడ్డం, ఆమెని చూసినప్పుడతని ముఖం వింతగా వెలగడం ఎంత కూడదనుకున్నా సరళ కళ్ళకింకా కన్పిస్తూనే ఉండడంతో ఆశ్చర్యం లేదు. అందుకే ఇప్పుడే మోహన్‌ని పావులా ఉపయోగించాలని నిశ్చయించుకుంది. లలిత కనిపించేటంత నెమ్మదైనది, నిర్మలమైనది కాదని బలరాంకి తెలియాలన్నదే సరళ కోరిక. అదే జరిగితే—కోటలో పాగా వేసినట్టే ననుకుంది...సరళ మనస్సులోని ఆలోచనలతో ముఖం కళ మారి వల్లబడింది.

కూతురుపక్కనే పడుకున్న సరస్వతమ్మగారు 'ఏమిటే ఆలోచిస్తున్నావు' అన్నారు.

అంతరాంతరాలలో బద్దకించిన పాముల లాగా కదలాడుతున్న ఆలోచనలు, అమాయకులు ఎలా చెప్తుంది?

'చాలా ఉందమ్మా, నీ కెందుకు నువ్వె చూస్తూ ఉండు. ఈ లలిత ఎలాంటిదో



నే తేలుస్తాను' అంటూ బెడ్‌లైటు ఆర్పి పడుకుంది సరళ.

పడుకుందన్నమాటేగాని ఓ పట్టాన నిద్రపోలేదు సరళ.

లలితమటుకు— సమయం వచ్చినప్పుడు బలరాంకి అన్నీ చెప్తాను అనుకుని నిశ్చింతగా పడుకుంది. బలరాం నమ్మడేమో అన్న అనుమానమేనా రాలేదు లలితకి. అతనిపై అంత నమ్మకం, గౌరవం ఏర్పడింది...

ఎప్పుడు తెల్లవారుతుందా అన్న ఆత్రంతో పడుకుంది సరళ.

ఎప్పుడు తెల్లవారిందో తెలియనంత గాఢంగా నిద్రపోయింది లలిత.

మనుష్యుల లోపలి ఊహలలా చేస్తాయి కాబోలు.

* * *

ఉదయం లలిత లేచేసరికే అంతా కాఫీలు ముగించినట్టుంది. ఎండ బాగా వచ్చేసింది. ఎండా నీడల్లో చెట్ల ఆకులు నల్లగానూ పచ్చగానూ కనపడుతున్నాయి. వరండాలోకి వచ్చి పిట్ట గోడమీద కూర్చుంది లలిత, గాలికి కదలాడుతున్న ఆకులనీ పూల గుత్తులనీ చూస్తూ. రాధామనోహరం తీగ పూల బరువుతో వంగిపోయింది. ఆ గుత్తుల నిండా హడావిడిగా తిరుగుతున్నాయి తేనెటీగలు. వాటి కదలికను తిలకిస్తూంది లలిత. బలరాం రావడంకూడా గుర్తించలేదు. వస్తూనే అతను ఓ ఉత్తరం అందించి పక్కనే నిలబడ్డాడు. లలిత లేచి సరిగా కూర్చుందుకుకూడా లేకపోయింది. చెదరిన ముంగురులు నుదుటిమీద పడి ఉన్నాయి. ఓ మెలికలు తిరిగిన కొస ఎడం కంటిమీదపడి కప్పుతోంది.

'అప్పుడే ఉత్తరాలుకూడా వచ్చాయి?' అంటూ అందుకుంది బలరాం అందించిన లేఖ.

'చదువు. వెంకట్రామయ్యర్ టైపు కూడా మాని చేతివ్రాత రాసి నా ప్రాణం తోడాడు. అరగంట తల బాదుకున్నా ఆ మాట తెలియలేదు. ఏమై ఉంటుందంటావు?' అంటూ చూపుడు వేలితో ఓ మాటని సూచించాడు. లలిత అతని వేలు వంకా మాటవంకా చూస్తూంది. మొన తేరిని అతనివేలు బలంగా అందంగా కళాకారుని ముద్రకి తగినట్టుగా ఉందనిపించింది. ఏమై ఉంటుంది చెప్మా?

అన్నట్టు తలతిప్పి బలరాం ముఖంలోకి చూసింది లలిత. అతను తననే చూస్తూండడం గమనించి—ఉత్తరం మీదికి దృష్టి పోగించింది.

'వెదర్ అయుంటుందా ?'

'బెటర్ అయివుంటుందనిపిస్తూంది' అంది నవ్వుతూ లలిత.

'అంతే అయి ఉంటుంది—' అంటూ ఇద్దరూ కలిపి నవ్వేశారు. ఈ సన్నిహిత దృశ్యం అప్పుడే వరండాలోకి రాబోయిన సరళ కంటపడింది. లలితచేతుల్లో ఉత్తరం ఆమె చెంపకి తగిలేంత దగ్గరగా వంగివున్న బలరాం తల—అతని ముఖంలో కనిపించిన మెరుపులాంటి ఉత్సాహం ... మింగుడు పడని కషాయంగా కన్పించాయి సరళకి. ఎంత వంగనాచి! ఎలాగేనా బలరాంని దగ్గరకి తీసుకోవాలని ఎంత బాగా నటిస్తోంది! అనుకుని పళ్ళు కొరుక్కుంది. ఆక్షణంలో ఏం మాట్లాడినా తన ధోరణి బయటపడి పోతుందని వచ్చినట్టే తెలియకుండా లోపలికి వెళ్ళిపోయింది. ఇదేమీ గుర్తించని బలరాం లలితతో హుషారుగా అంటున్నాడు—

'లలితా గట్టిదానివే — బ్రహ్మ లిపి కూడా తుణ్ణంగా చదవ కల్గావంటే ... అయినా ఈ రాతెందుకో ముసలాయనకి ?' అన్నాడు.

'అర్జెంటుగా రాయాలని తోచి ఉంటుంది—గుమస్తా కోసం కూర్చోమన్నా వేమిటి ? రాసి పారేశారు. అది సయం కదూ ?'

'ఓ సారి వచ్చి వెళ్ళమంటున్నారు. వెడతావా ?' అడిగాడు బలరాం.

'కొన్నాళ్ళాగి వెడతాను. నా కెక్కడికీ కదలాలని లేదు' అంది లలిత—ఆమె సమాధానం అతనికెంతో తృప్తి నిచ్చిందన్న దానికి అతనిముఖమే నిదర్శన.

'నీయిష్టం...ఈ వారంలో అమ్మమ్మ గారింట్లో చాలా హడావిడి. నీకు తెలును కదూ! వస్తున్నట్టేనా ?'

'సరళ గాంగంతా వస్తారా?' భయంగా నెమ్మదిగా అడిగింది.

'ఎందుకు రారు ? వాళ్ళలో అమ్మమ్మ గారి మేనల్లుళ్ళూ, మనవలూ మనవరాళ్ళూ ఎందరున్నారో తెలిస్తే ఆశ్చర్య పోతావు నువ్వు !' నవ్వుతూ అన్నాడు బలరాం.

# ప్రవహించు ప్రేమకై

'ఆమె అంత గంభీరంగా హుందాగా ఉంటారు కదా. వీళ్ళంతా ఇలా ఉన్నా రేమిటి ?' కుతూహలం అణచుకోలేక అడిగింది లలిత.

'గొప్పవాళ్ళ పిల్లలు అలాగే ఉంటారు లలితా. ఆ మాత్రం ఊహించలేవా?' వేళాకోళం చేశాడు.

'నేనా వర్గంతో ఎక్కువగా మసలలేదు బలరాం. అలా నిర్లక్ష్యంగా ఉంటె నా కేమిటోలా ఉంటుంది.'

'అందుకే నువ్వింకా మామూలు అమ్మాయిలాగా ఆలోచించకల్గుతున్నావు. అదే నీకు ఆస్తి ఉండి, అంతస్తు ఉందని తెలిసి, చిన్నప్పటినుండీ డబ్బు ఎంత సులభంగా కావలసినవన్నీ సమకూర్చి పెట్టకలదో తెలిస్తే—నీ ధోరణి వేరుగా ఉండేది. వెనకటి కోసారి సరళే ఏం చేసిందో తెలుసా? ఎవరో పిల్లాడిమీదికి కారు తోలేసింది. ఆపి వాడికేం దెబ్బ తగిలిందో చూళ్ళేదుట. పర్సులోంచి ఓ వందకాగితం తీసి పక్కనున్న పెద్దవాళ్ళ కిచ్చేసి, అవసరం అయితే కర్చు చేయండి అంటూ ఏం జరగనట్టే వెళ్ళిపోయిందిట...'

'ఓహ్!' అంది నమ్మలేనట్టు లలిత.

'అందుకే చెప్తే నమ్మలేవు. నీలాంటి జీవితం సాగించిన మనిషికిది దారుణంగా కన్పిస్తుంది. డబ్బున్నవాళ్ళలో సహృదయులుండరని కాదు...కాని యిలాంటి కుర్రకారుకి బాధ్యత అసలు తెలియదని...'

'ఇప్పుడు అమ్మమ్మగారి మనవరాలుకూడా అంతేనా?...ఆవిడ...'

'మై గాడ్, అమ్మమ్మగారి పెద్ద కోడలిని చూడలేదు నువ్వు. ఇలా డబ్బు పారేస్తే రానిదేమీ ఉండదనుకుంటుందావిడ...'

'పోనిలే, నాకీ సంగతులు చెప్పకు. నాకేదో బెంగగా ఉంటుంది...'

బలరాం నవ్వుతూ జేబులోంచి సిగరెట్టు పేకటు తీశాడు. ఒక సిగరెట్టు తీసి అంటించి పొగ వదులుతూ ఎటో చూస్తున్నాడు.

లలితమటుకు బలరాం చెప్పిన విషయాలు గ్రహిస్తూ అతనికేసే తెలియకుండానే కన్నార్పక చూస్తూంది...చటుక్కున తిరిగి చూసిన బలరాంకి లలితకళ్ళు వింతగా మెరుస్తూ కనిపించాయి. నవ్వుకుంటూ అటునుంచి నడిచాడు.

'ఇంకా ఐదారురోజులుంది కదా, ఎలాగో తప్పించుకోవచ్చు.'

నే వాళ్ళతో కలవలేను. కలిసినా సరదాగా ఉండలేను' అనుకుంది లలిత.

కొత్తకారు వచ్చేలోగా వాడుకోమని చిన్న తెల్ల కారొకటి తీసుకువచ్చారు సుబ్బారావు గారు. ఇద్దరే ఇద్దరు కూర్చుందుకు వీలున్న ఆకారు ముచ్చటగా ఉంది. లలిత చుట్టు ప్రక్కల రోడ్లవెంట తోలి అలవాటు చేసుకుందుకు బాగుంటుందని బలరాంకూడా ఒప్పుకున్నాడు. ఉట్టినే ఉన్నప్పుడల్లా లలిత కారుతీసి నడుపుతూంది. మనస్సు ఆలోచనలతో నిలవనీయనపుడు ఇదెంతో బాగుంది లలితకి. అవకాశం వచ్చినప్పుడల్లా మోహన్ ప్రసక్తి తెస్తూనే ఉంది సరళ.

'ఈ సరళకి కూడా మోహన్ గురించి చెప్పాలి.' అనుకుంది లలిత.

ఆరోజు ఉదయం కాఫీలు ముగియగానే కారు బయిటకి తీసింది లలిత. తోటవాడు ఆత్రంగా పరుగెత్తి వెళ్ళి గేట్లు బార్లా తీశాడు. చిన్నకారు ముందుకి దూసుకు పోయింది.

ఆ సమయంలోనూ, సాధారణంగా ఒక్క రాత్రిపూటల తప్పించి చుట్టుప్రక్కల రోడ్లు రద్దీగా ఉండవు...వెళ్లినరోడ్డంటే వెడుతూ మళ్ళీన మళుపే మళ్ళుతూ, స్వేచ్ఛగా రెక్కలు సాచిన పక్షిలాగా తిరుగుతోంది లలిత. ఇంకా తిన్నని రోడ్డంట కొంతదూరం వెడదామని కారుతిప్పి పోనిచ్చింది...ఐదారు ఫర్లాంగులు వెళ్ళేసరికి

ముందుభాగం పక్కకి తిప్పుకుని రోడ్డుకి కొంచెం పక్కగానే ఓ కారు కనిపించింది. ప్రమాదం జరిగింది కాబోలు, అని అదిరి పోయింది లలిత. కారు పక్కగా ఆపి దిగింది ... రోడ్డువార మైలురాయిమీద తలచేత్తో పట్టుకుని కూర్చుని ఉన్నాడు మోహన్. అదిరిపడింది లలిత. కారటు తిప్పి బయిలు దేరినందుకు తనని తనే తిట్టుకుంది.

'నా కళ్ళని నేనే నమ్మలేకుండా ఉన్నానే? అపద్బాంధవి'? అంటూ నాటకంలోలాగా అన్నాడు మోహన్ నవ్వుతూ.

'ఎవడో ఢీకొట్టబోయి, తప్పంతా వాదే నని తిట్టి మరీ వెళ్ళిపోయాడు లలితా. ఎవరేనా ఇటు రాకపోతారా అని కూర్చుని తపస్సు చేస్తున్నాను.'

'కారసలు నడవదా?' మాటిలోంచి వస్తున్నట్టుంది లలిత కంఠం. ఎదురు చూడని ఈ సంఘటనకి అదిరిపడింది లలితగుండె. కారెందుకు తోలడం నేర్చు కున్నాను? అంటూ తిట్టుకుంది.

'లాభంలేదు. లాక్కెళ్ళవలసిందే ... డిక్కీలో తాడుంది — ప్లీజ్ నన్ను కనికరించు' అన్నాడు ప్రాధేయపడుతూ.

'నోనో నిన్నెక్కడ దింపమంటావో దింపుతాను తరవాత కారు తీసుకెళ్ళే ఏర్పాట్లు చేసుకో' అంది.

మారు మాట్లాడక ఎక్కి కూర్చు న్నాడు మోహన్. వెంటనే బొంబాయివైపు కారు పోనిచ్చింది లలిత.

'నాతో మాట్లాడ్డంకూడా ఇష్టం లేదా లలితా? నన్ను క్షమించలేవా?'

'మాట్లాడ్డానికేం? కాని ఏముంది మాట్లాడ్డానికి?'

'మనం ఎన్నో పగంటలు కూర్చుని మాట్లాడుకునే వాళ్ళం? అంతా మరిచి పోయావా?'

ఎంతో నీరసం అనిపించింది లలితకి. కాలూనుకుంటున్న సమయంలో ఇదేమిటి? అని బెంగపడింది.

తెలిసినవాళ్ళ ఇళ్ళు ఒక్కొక్కటే వస్తు న్నాయి. లలిత మనస్సు దడ దడ లాడు తోంది. ఈ వ్యక్తితో తనని ఎవరేనా చూస్తే ఎన్నేనా కల్పిస్తారు. నేను బల రాంకి అన్నీ చెప్పేముందే అతని మనసులో తప్పుడూహాలు తలెత్త నివ్వకూడదు అను కుంది. కనపడని దైవాలకి మొక్కుకుంది.

# ప్రేమించు ప్రేమకై

'ఎక్కడ దింపాలో చెప్పు ?' అంది.

'అదిగో ఆ ఎడమవైపు గేటుదగ్గర ఆపు. మా కంపెనీవాళ్ళంతా అక్కడే దిగాం.' అన్నాడు మోహన్. కొంచెం పక్కగా కారాపింది లలిత. తలుపు తెరచి పట్టుకు నిలబడ్డాడు మోహన్—ఓసారి దిగి లోపలకి వస్తావా? నా ఆతిథ్యం ఇంత విషమైపోయిందని కలలోకూడా అనుకోలేదు లలితా' అన్నాడు.

'నే వెళ్ళాలి. అసలింత దూరం వద్దామనే అనుకోలేదు' అంది కారు స్టార్టు చేస్తూ. కారు మళ్ళించేలోగా ఇంకో కారు దూసుకుంటూ వస్తోంది. కొంచెం ఆగింది లలిత. మోహన్ ముఖం ఆనందంతో విడగా ఆ కారులోని ఎవరికో చేయి ఊపాడు. ఎవరన్నది చూడలేదు లలిత—కారు రోడ్డుమీదే అడ్డంగా తిప్పి ఇంటిముఖం పట్టించే తపత్రయంలో ఉంది... 'మళ్ళీ కన్పిస్తావు కదూ' అంటున్న మోహన్‌కి సమాధానమేనా చెప్పకుండా...కొత్త డ్రయివింగన్న జ్ఞాపకం కూడా లేకుండా స్పీడుగా కారు పోనిచ్చింది.. ఆమె ఊహలంత వేగంగానూ కారు సాగుతూంది.

పది నిముషాల్లో ఇల్లు చేరుకుంది. గేటు పక్కగా నిలబడి ఆత్రంగా రత్తి తోటవాడూ చూస్తున్నారు.

'వచ్చారా? మీ రెటెళ్ళారో తెలియ లేదమ్మా, అయ్య కోపం చేసుకున్నారు' అంటూ కారు లోపలికి రానిచ్చి గేటు మూశాడు తోటమాలి.

'అమ్మగారొచ్చేసిన్రారు. మీరెల్లండమ్మా' అంటూ రత్తి హెచ్చరించింది. 'ఎవరు, అమ్మమ్మగారొచ్చారా?' అనుకుంటూ పోర్టికోలో కారాపి దిగింది లలిత.

పై మెట్లమీద నిలబడి ఉంది సరస్వతమ్మ. వరండాలో కుర్చీలో కూర్చుని సిగరెట్టు కాలుస్తున్నాడు బలరాం. పక్కనే విలాసంగా జేరబడ కూర్చుని ఉంది సరళ. అర్థం కాని పిరికితనం ఆవరించింది లలితని.

'చెప్పి పెట్టకుండా ఎక్కడికెళ్ళావు తల్లీ!' అంది సరస్వతమ్మగారు పలకరింపుగా. ఆ కంఠస్వరంలో పలకరింపుమటుకు లేదు!

'అంతదూరం వెడదామనుకోలేదండీ', అంటూ కుంటిసాకు చెప్పి మెట్లన్నీ గబగబ ఎక్కింది లలిత.

'కారు బాగుందా. ట్రబుల్ లేదుకదూ?' అడిగాడు బలరాం.

'మంచివాడివే లలితేం పసిపిల్లా?... నే వస్తూ చూశానుగా—ఎవరినో ఎక్కించుకుని లిఫ్టుకూడా యిస్తోంది' అంది ఉరమని పిడుగులాగా సరళ.

'ఏమి టేమిటీ' అని సాగతీస్తూ లలిత వెనకనే పైకి వచ్చారు సరస్వతమ్మ.

నోటమాట రాక నిలబడిపోయింది లలిత. మోహన్ చేయి ఊపినది ఆమెగారి కన్న మాట! అన్న ఆలోచన ఆమె మెదడుని దొల్చేయడం ప్రారంభించింది.

'లేదు బలరాం, దారిలో నన్ను చూపిన మోహన్ ఏక్సిడెంటయి కన్పించాడు. దింపేయమంటే సరేనన్నాను.' అన్న సింపుల్ నిజం చెప్పాలని ఎంతో ప్రయత్నించింది. కాని ఆ వాతావరణం సరస్వతమ్మ ముసిముసి నవ్వులు, సరళ బలరాంకేసి 'చూశావా' అంటున్నట్టు చూడ్డం—అంతా కలిసి పిరికిదాన్నీ, మొండిదాన్నీ కూడా చేశాయి లలితని. తొలిసారే బలరాంకి చెప్పి ఉండవలసింది...అని ఒకటికి లక్షసార్లనుకునీ ప్రయోజనం ఏమిటి? ఇప్పుడెంత చెప్పినా—లేట్.

'ఏం ఎవరికీ లిఫ్టివ్వకూడదా?' మొండిగా తల ఎగరేసి అడిగింది లలిత.

అదిరిపడ్డట్టు తలెత్తి చూసినా, మళ్ళీ తన ఆలోచనలలోకి మళ్ళిపోయినట్టు ముఖం తిప్పుకున్నాడు బలరాం.

గబగబ మెట్లకేసి నడిచి వెళ్ళిపోయింది లలిత. ఏం చేస్తుంది? అంతా నేరస్తుర్ణి చూసినట్టు ముళ్ళలాగా అలా చూస్తుంటే 'బలరాం నువ్వా నన్నెందుకలా చూస్తున్నావు?' అనుకుంది...రెండు మెట్లెక్కిందో లేదో పరుగున వచ్చి మోచేతి



మీద చేయివేస్తూ ఆపింది సరళ.

'సారీ లలితా, నే నవసరంగా తొందరపడ్డాను. ఏమీ అనుకోకు. నువ్వు మోహన్‌ని చూడ్డానికి వెళ్తున్నట్టు ఒక్కమాట చెప్పి ఉంటె కప్పిఉంచే దాన్నికదా?' అంది రహస్యంగా లాలోచిగా.

'ఏమిటి నువ్వనేది ? నేను మోహన్‌ని కలుసుకుందుకు వెళ్ళానా ? ఎవరు చెప్పారు నీకు ? మతిపోయిందా నీకు ?' అనవసరంగా ఆవేశం తెచ్చుకుంది లలిత.

'ఏంలేదు లలితా. నేనలా నిన్ను బయటపెట్టకపోతే ఏ గొడవా ఉండేది కాదుకదా, నా కంత తోచలేదు ... అయినా నువ్వేం తక్కువదానివా, నిముషంలో అందరినోరూ మూయించావు !' అంది నవ్వుతూ.

'మైగాడ్, నువ్వెంత ఊహించుకుంటున్నావు !' అనేసి ఇక నిలబడలేక మెట్లన్నీ పరుగున ఎక్కేసింది...

సరళ చిన్నపోయినట్టు ముఖం పెట్టుకుని మెట్లు దిగేసింది. తన కళ్ళని తానే నమ్మలేనట్టు చూశాడిదంతా బలరాం. ఒక్క మాటకుడా మాట్లాడలేదు. కాని తన రూములోకి వెళ్ళిపోయాడు.

సరళ అర్థవంతంగా సరస్వతమ్మకేసి చూసింది !

'బాగుంది బాగుంది. సంగతేమిటో చెప్పు ?' అంటూ బలరాం ఖాళీ చేసిన కుర్చీలో కూలబడ్డా రావిడ.

నవ్వుతూ తనూ కూర్చుంది సరళ — ఆమెగారికి విందుభోజనం చేసినంత ఆనందంగా ఉంది. తను తిరిగి వస్తుంటే టౌను అవతల లలిత మోహన్‌ని దింపి కారు మళ్ళిస్తోందనీ అతను తనకి చేయి వూపాడనీ చెప్పింది.

'అయితే లలిత కతను బాగా తెలుసంటావా ?' నమ్మలేకపోతూ అడిగారావిడ.

'బాగా తెలిసుండాలమ్మా, ఏదో జరిగుండాలి కూడా. లేకపోతే ఎందుకీ దొంగతనం ? బలరాంకి తెలిస్తే యిబ్బందని—ఎంతనాటకం ఆడుతోందో చూశావా ?' ముక్కుమీద వేలేసుకుని కూర్చుని ఉండిపోయా రావిడ. ఆ క్షణంలో తనకూతురి భవిష్యత్తుకి అడ్డు వైదొలగిపోతూన్నట్టు సాక్షాత్కరించింది—సరస్వతమ్మగారికి!—ఇన్నాళ్ళనుంచి లలిత దేవతేమోనని యిబ్బంది పడుతుంది.

(ఇంకా ఉంది)

# మనుష్యులు నీటిని పీల్చగలరా?

*[చేపలు నీటిలో కరిగిఉన్న గాలిని పీల్చగలవు. ఇతర జంతువులుకూడా ఈ పని చెయ్యగలవని పరిశోధనలు తెలుపుతున్నాయి. మనుష్యులుకూడా చేపలలాగే నీటిలో బతకగలరా?]*

ఏయి తొడుగులు, సాధనాలు లేకుండా మనుష్యులు సముద్రంలో 3000 అడుగుల లోతుకి దిగి నూనె బావులలో, మాంగనీస్ గనులలో, చేపల 'సావిళ్ల'లో పని చేస్తే! గురువు (గోళం) మీదనుంచి అంతరిక్ష నావికులు సునాయాసంగా పెద్ద వేగాలతో వెళ్లి పోగలిగితే! ఎంత బాగుండును అనిపిస్తుంది; కాని, ఇది ఉత్తి ఊహాగానం కాదు! అందుబాటులో ఉన్న అవకాశాలలో కొన్ని...

కొందరు వ్యక్తుల ఊపిరి తిత్తులని నీటితో కొంత నింపి చూశారు ఆసుపత్రులలో. వారు తను స్పృహ కోల్పోలేదు. ఏమీ బాధని అప్పుడుగాని, తర్వాతగాని అనుభవించలేదు. ఇది ఎలా జరిగిందంటే, కొందరి ఊపిరి తిత్తులని శుభ్రం చెయ్యవలసివచ్చి డిసిన్‌ఫెక్టంటు ద్రావకంతో కడగబోయారు. ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉండటంచేత ఒక సముద్రం డయివర్ తన ఊపిరితిత్తులని పూర్తిగా నీటితో నింపమని కోరాడుట. అతని ఊపిరి తిత్తులలో ఒకదానిని మాత్రం పూర్తిగా ద్రావకంతో నింపారు. అతనికి రెండువయిపులా భేదం ఏమీ కనిపించలేదుట!

ఒక కుక్కకి రెండు ఊపిరి తిత్తులనీ నీటితో నింపారు. అది 24 నిముషాలు బాధలేకుండా నీటిలోని గాలినే పీల్చుకొనగలిగింది. దానిని ఇప్పుడు రాయల్ నెదర్లాండ్స్ నేవీశాఖ సబ్మెరయిన్ రక్షణ నావవారు ముద్దుగా పెంచుకుంటున్నారు.

కొన్ని ఎలుకలని నీటికింద ముంచగా కొన్ని గంటలు నీటినే 'పీలుస్తూ' బతికాయిట. కాని, ఏ జంతువూ కేవలం నీటినే పీల్చి అధిక కాలం జీవించలేదు. దీనికి ముఖ్యంగా రెండు కారణాలు: ఒకటి, నీటిలోకన్నా గాలిలో ఎక్కువ ప్రాణవాయువు ఉంటుంది; రెండు, నీరు రక్తనాళాలలోకి ప్రవేశించి హాని కలిగిస్తుంది. ఉప్పు నీరయితే రక్తంలోని నీరు తగ్గిపోతుంది. రక్తం చిక్కబడి దేహం దెబ్బతింటుంది.

## ప్రత్యేక ద్రావకం

అందుకనే పరిశోధకులు రక్తానికి సరిపోయే ప్రత్యేక ద్రావకం ఒకటి (నెత్తురు ప్లాస్మాని పోలినది) తయారుచేసి ఎలుకల ఊపిరి తిత్తులని నింపారు. కొంత మెరుగుగా ఉన్నా దీనివల్ల కూడా ప్రాణం పోయేది. బొగ్గుపులుసువాయువు వదలటానికి నీరు అడ్డు పడుతుంది. ఇది ఊపిరి తిత్తులకి హాని కలిగిస్తుంది.

అయితే, తక్కువకాలంపాటు నీటిలో ఉండవలసిన అవసరం అయితే (2, 3 గంటలు) పెద్ద చిక్కు ఉండదు.

ఈ సందర్భంలో మరొక సంగతి గురించి చెప్పాలి. డయివింగ్ సూట్లు లేకుండా మునిగితే బయటి నీటి పీడనం వల్ల ఊపిరి తిత్తులలోని వాయువు రక్తంలో కరిగి కొన్ని రకాల బాధలు (నిషా కూడా!) కలగవచ్చు. అంతేకాక, డయివర్లు త్వరగా నీటిలోపలినుంచి బయటికివస్తే రక్తంలో కరిగి ఉన్న వాయువులు బయటికివచ్చి, రక్తనాళాలలో బుడగలు ఏర్పడి విపరీతమయిన బాధ కలగవచ్చు. ఈ బాధని ఇంగ్లీషులో 'బెండ్స్' (bends) అంటారు.

పయిన చెప్పిన పరిస్థితి 'గాలి'ని పీలిస్తే ఏర్పడుతుంది. కాని 'నీటి'ని పీలిస్తే! మామూలు డయివర్లకి వచ్చే బాధలు రావుట. పరిశోధనలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి.

## అంతరిక్షయానం

ఒక అంతరిక్ష నావికుడి ఊపిరి తిత్తులని ద్రావకంతో నింపి, అతన్ని (లేక ఆమెని) పూర్తిగా సరయిన ద్రావకం ఉన్న పాత్రలో పెట్టి అమాంతంగా వేగం హెచ్చిస్తే మామూలుగా గాలి పీల్చేవారు పడే ఇబ్బందులు పడటం ఉండదుట. (సున్నానుంచి సెకండుకి కొన్ని మైళ్ల వేగం హెచ్చినప్పుడు అంతరిక్ష నావికులు చాలా బాధపడ్డారు.)

మరొక పద్ధతికూడా ఉంది. చేపలకి 'గిల్స్' అనే అంగాలు ఉంటాయి. వీటి సాయంతో అవి నీటిలోని గాలిని పీలుస్తాయి. గిల్స్ లాగ పనిచేసే వస్తువుతో చేసిన తొడుగులతో నీటిలోకి దిగిన డయివర్ల ఊపిరితిత్తులలోకి సరయిన ద్రావకమే వెళ్లేట్లు చెయ్యవచ్చు; అంటే, రక్తానికి హాని చెయ్యని ద్రావకం అన్నమాట. సిలికాన్ — రబ్బర్ మిశ్రమం అయిన ఇటువంటి తొడుగులని ఇప్పటికే కొంతదాకా తయారు చేస్తున్నారు.

—జాన్ న్యూయెల్ (ఫో.వ.ఫీ.) ●






గోపాలస్వామి పడక కుర్చీలో చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు. అతని చూపంతా యింట్లో అటూ యిటూ గెంతుతూ అక్కడ పడివున్న వడ్లగింజల్ని తమాషాగా పొట్టు ఒలిచి తింటున్న పిచికలపైనే వుంది.

కనకమ్మ వంటగది గుమ్మంలో కత్తిపీట ముందుకు లాక్కుని బీరకాయలచెక్కు తీస్తూవుంది.

'కనకం! ఆ పిచికల్నిచూడు—యింట్లో గెంతుతూంటే—ఎంత ముచ్చటగా తిన్నాయో!' అన్నాడు గోపాలస్వామి.

కనకమ్మ మూతి విరిచింది నిరసనగా.

ఆమె పలకకపోవడంవలన ఆమెవైపు విచిత్రంగా చూసిన గోపాలస్వామి కళ్ళు క్షణంలో ఎరుపెక్కాయి. 'బీరకాయలకు అంతా మందంగానా చెక్కుతీసేది? వూరికినే వస్తున్నాయనుకున్నావా యేం? కేజీ రూపాయిన్నర అమ్ముతున్నారు తెలుసా!' అన్నాడు కోపంగా.

'ఎంతచెడ్డామీ పెళ్ళాన్నైగా! ఆచెక్కులు వూరకే పారబోయనులెండి. వాటితో పచ్చడి చేస్తా' అంది కనకమ్మ.

ప్రసన్నుడై పోయాడు గోపాలస్వామి క్షణంలో.

'పెదనాన్నా! పెదనాన్నా! బడికెళ్తాను కానీ యియ్యవూ?' అంటూ జారిపోతున్న లాగును పైకి లాక్కుంటూ ఒక్కదూకున గోపాలస్వామి ఒళ్లోకి గెంతాడు తమ్ముడు నారాయణస్వామి కొడుకు బాచిగాడు.

'ఒరే వెధవాయ్! వేలెడున్నావు అప్పుడే నీకు జేబుఖర్చుకు డబ్బులు కూడానా! జానెడు లేవు వెధవ్వి—అన్నీ తండ్రిబుద్ధులే. మీనాన్నా యిలా తగలేసే ఆస్తంతా పాడు చేశాడు' అన్నాడు నవ్వుతూనే గోపాలస్వామి బాచిగాడ్ని పట్టుకోబోతూ.

'సూరుపెద్దీ! పెద్దనాన్న కానీ యియ్యనంటున్నాడు' అంటూ అక్కడనుండి తప్పించుకుని కనకమ్మ వీపుమీద పడ్డాడు వాడు.

'ఆయనంతేరా నాయనా! నేను కుడుమ్ముక్క పెడతాకాని తినిపో' అంటూ కనకమ్మ బాచిగాడ్ని వెనుకనుండి చేతులుచాపి అందుకొని ఒళ్లోకి లాక్కుంటూ తన్మయత్వంతో వాడిబుగ్గల్ని గాఢంగా ముద్దు పెట్టుకుంది.

'నాకొద్దుఫో— నాకు కానీయే కావాల' అని మారాంచేశాడు వాడు.

'ఇందరా' అంటూ రెండుపైసల బిళ్ల వాడిమీదకు విసిరాడు గోపాలస్వామి. దాన్ని అటూ యిటూ తిప్పిచూసి 'యిదికాదు— నాకు పెద్దకానీ కావాల' అంటూ కాళ్ళు నేలకేసి బాదుతూ దాన్ని ఓమూలకు విసిరి కొట్టాడు.

'ఆఁ! ఆఁ! ఎంతపొగర్రా నీకు—లక్ష్మి నలా విసురుకుంటారా—అలా చెయ్యబట్టే మీనాన్న అలా తిండికి తిప్పలు పడుతున్నాడు' అంటూనే ఆరెండు పైసల కోసం టేబిల్ క్రిందకు దూరాడు గోపాల

'ఏమిటండీ మీరు మరీనూ! ప్రతిదానికీ చంటివెధవ దగ్గర వాళ్లనాన్నను తిట్టడం ఎందుకూ? ఇష్టం వుంటే యిచ్చి పంపించండి కానీ—' అంది కనకమ్మ.

'ఓయబ్బ! నీమాత్రం నాకు తెలియదే మరి!—నామాటలు వాడికర్థమవుతాయా ఏమన్నానా? క్షుద్ర సన్నాసికి అప్పుడే డబ్బు ఖర్చులు నేర్పితే పాడయిపోతాడని కానీ—నాకుమాత్రం వాడంటే ప్రేమలేదూ!' అంటూ టేబిల్ క్రింద దొరికిన రెండు పైసల్ని చిక్కంలోవేసి' ఒక అయిదు పైసల బిళ్లతీసి బాబిగాడి కందించాడు గోపాలస్వామి.

'మాటలు అర్థం కావడానికి కాకపోతే అనడం దేనికీ?' అనుకుంది కనకమ్మ.

'ఇదీ చిన్నకానీయే' అని గునిశాడు బాబిగాడు.

'ఓహో—పెద్ద కానీ అంటే పదిపైసలా? నీకు రోజుకు పదిపైసలంటే నెలకు మూడు రూపాయలన్నమాట. అబ్బో జానెడు వెధవ్వి నీకంత ఖర్చే యిప్పటినుండీ!' అని ముక్కున వేలేసుకున్నాడు గోపాలస్వామి.

ఇంకొక్కక్షణం అక్కడే వుంటే ఆ ఇచ్చిన దెక్కడ లాక్కుంటాడో అనుకున్న బాబి ఒక్కపరుగున బయటపడ్డాడు.

'ఇప్పుడే యిలా అంటున్నారే — వాడ్ని మనం పెంచుకుందామనుకున్నాం కదా—వాళ్లు యివ్వక పోబట్టి సరిపోయింది కాని లేకపోతే యిలానే చూసేవారా?' అడిగింది కనకమ్మ.

'నువ్వున్నావుగా బాగా చూసుకోవటానికీ' చిరాకుపడుతూ కుర్చీలో కూలబడ్డాడు గోపాలస్వామి. అతనికి తమ్ముడిపై చెప్పలేనంత కోపం వచ్చేంది.

'గాడిద కనడం నేర్చిందికానీ పెంచడం నేర్వలేదన్నట్టు—అర్థణా సంపాదన లేక పోయినా అరడజనుమంది పిల్లలు. వాళ్లు చూడు ఎలా వున్నారో—చీమిడిముక్కులూ, చింపిరి జుట్లూను. అయినా పౌరుషానికి మాత్రం లోపం లేదు. ఏం చూసుకొనో అమిడిసిపాటు' తనలోనే గొణుక్కున్నట్టు పైకే అన్నాడు గోపాలస్వామి.

'దేవుడిచ్చినదానికి వాళ్లేం చేస్తారండీ! మనకింతవుంది— అయితే ఏం లాభం! అనుభవించడాని కెవరున్నారని?' స్వామి కోపంగా. 'అందుకనేగా బరువు తగ్గించడానికి వాడ్ని పెంపకం యిమ్మన్నాం. మొహమాటం లేకుండా యివ్వనని ఖచ్చితంగా చెప్పేశాడే! మింగడానికి మెతుకు లేకపోయినా అంత పంతం ఎందుకో?' చుట్ట కొస కసుక్కున కొరికి వూశాడు గోపాలస్వామి.

'పంతంకాదండీ! ఎంతమంది వుంటే మాత్రం ఏతల్లీ తనబిడ్డను యింకో అమ్మచేతిలో పెట్టడానికి యిష్టపడదు తెలుసా!' అంది కనకమ్మ.

'ఉహూ! నీకూ తెలుసునే కన్నకడుపు తీపి!' ఎగతాళిగా అన్నాడు గోపాలస్వామి. గుండెల్లో ముల్లు గుచ్చుకున్నట్టయి చురుక్కున చూసింది కనకమ్మ.

'కడుపునిండా తిండి పెట్టలేనివాళ్లు కూడా గంపెడు మందిని కనడం ఎందుకో!' అదే ధోరణిలో మాట్లాడుతున్న గోపాలస్వామినిచూస్తే కనకమ్మకు అసహ్యం అనిపించింది. ఇలాంటి మూర్ఖులతో వాదించడం నాదే బుద్ధితక్కువ అనుకొని వూరుకుందామె.

ఇంటి దూలానికీ వాసాలకూ మధ్యనున్న ఖాళీలో పిచికలగూడు వుంది. అందులోనుండి ఒకటిరెండు రోజుల వయసున్న పిచికపిల్లలు తిండికోసం గోలగా అరుస్తున్నాయి. ఆడ పిచిక బియ్యం గింజల్ని ఏరి తెచ్చి పిల్లల నోటికందిస్తూ మళ్లీ క్రిందికి దిగుతూ ఎగురుతూ వుంది. మగపిచిక చీపురుకట్ట లోనిపుల్లల్ని ముక్కుతోలాగి గూట్లోపెట్టి మళ్లీ పుల్లలకోసం వస్తూనే వుంది. ఈ లోగా ఆ పుల్లలు, యింకా గూట్లోని మెత్తని పక్షి యీకలూ, గడ్డీ పడి యిల్లంతా చెత్తగా తయారైంది.

కనకమ్మ అదిచూసి విసుక్కుంది. 'దిక్కుమాలిన పిచికలు—యిల్లంతా చెత్త పోస్తున్నాయి. యీపిల్లలగోల ఒకటీ తల నొప్పికితోడు అంటూ చీపురుకట్టతో పిచికల్ని అదలించబోయింది. అవి తుర్రున ఎగిరి గూట్లో దూరిపోయాయి.

'ఆఁ! ఆఁ! వాటిని వెళ్లగొట్టకు. మన యింటి నాశ్రయించుకున్న నోరులేని ఆపక్షుల్ని వెళ్లగొడితే యింటలక్ష్మి నిలవదు' అన్నాడు గోపాలస్వామి గూటివంకేచూస్తూ.

'మీకూ జాలి వుందే' అనుకోబోతున్న కనకమ్మ—'అదీ అసలు సంగతి' అనుకుంది

'చూడు—అంత చిన్నపక్షులైనా వాటి తెలివితేటలు చూడు. తల్లిపిచిక ముందు తనకడుపు కట్టుకొని పిల్లలకెలా పెడుతూ వుందో! ఆ మగపిచిక—ఎంత తెలివిగా సంసారాన్ని, యింటినీ కాపాడుకుంటూందో!—వాటికున్న బుద్ధిలో నూరోవంతువున్నా మా తమ్ముడు బాగుపడిపోను' అన్నాడు గోపాలస్వామి.

'మనయింటి నాశ్రయించుకున్న ఆ పిచికలపై మీకుండే జాలిలో—మీ రక్తం పంచుకుపుట్టిన తమ్ముడిపై నూరోవంతు జాలి మీ కుంటే అతను నిజంగానే బాగుపడి పోను' అంది కనకమ్మ.

'నోర్ముయ్! నువ్వు నాకేం చెప్పక్కర్లే' విసుక్కున్నాడు గోపాలస్వామి.

'అన్నయ్యా!' అన్నాడు అప్పుడే అక్కడకు వచ్చిన నారాయణస్వామి.

కనకమ్మ లోపలకు వెళ్లిపోయింది.

'ఏంరా! యిలా వచ్చావేం?' అనుమానంగానే అడిగాడు గోపాలస్వామి, చుట్ట వెలిగించుకుంటూ తమ్ముడివైపైనా చూడకుండా.

'అన్నయ్యా! చంటిబాబుకి బొత్తిగా బాగులేదు. డాక్టరు ఏవో యింజక్షన్లు కొనుక్కోమంటున్నాడు. ఓ పాతికుంటే...' అంటూ నసిగాడు నారాయణస్వామి.

గోపాలస్వామికి చిర్రెత్తుకొచ్చింది. 'అవున్నా! యిలాంటి అవసరాలకే అన్నయ్య కన్పిస్తాడు నీకు. నీలాగే నాకూ యిలాంటి విషయాల్లో మొహమాటం పనికిరాదని నీకు తెలుసుగా. నన్నింకెప్పుడూ డబ్బు విషయంలో బాధపెట్టకు -- ఆఁ మర్చిపోయా ఆ యింటి తనఖా విషయం ఏం చేశావ్? కేసు డిక్రీ అయింది. ఇవాళో రేపో కోర్టువాళ్లు వస్తే మీరంతా వీధిలో నిలబడాలి — అది ఆలోచించుకున్నావా ముందు?' అన్నాడు ఎంతో జాలిపడు తున్నట్టు.

'హఠాత్తుగా అంత సొమ్ము ఎక్కడ నుండి తెచ్చి కట్టగలను? ఎంత బతిమ లాడినా మరొక్క నెల గడువుకూడా యివ్వ లేక పోయావు. చేతులారా చేసుకున్నందుకు అనుభవించాలి మరి! ఇప్పుడా విషయం కాదు ముఖ్యం — చంటిబాబు చావు బతుకుల్లో వున్నాడు. వాణ్ణి ముందు కాపాడుకోవాలి.

నీకొళ్ళ్ల పెట్టుకుంటాను: ఎక్కువైతే రూపాయలు యిచ్చావంటే నీ ఋణం జన్మజన్మలకూ తీర్చుకోలేను' పొంగివస్తున్న దుఃఖాన్ని అదుపులో పెట్టుకుంటూ అన్నాడు నారాయణ.

'జన్మజన్మలకూ తీర్చలేని వాడికి అప్పెవరిస్తార్రా?' పకపక నవ్వాడు గోపాలస్వామి. 'ఒరే నారాయణా! కడుపునిండా తిండికూడా కరువైనప్పుడు నీకెందుకురా అంతమంది పిల్లలు? పైగా వాళ్ళకోసం ఈ వైద్యపు ఖర్చులెందుకు చెప్పు! ఇప్పటికే పీకలదాకా అప్పుల్లో మునిగి వున్నావ్. పోతే పోనీయ్— ఒంటిపిల్లడేగా! మిగిలున్నవాళ్ళు చాలదూ నీ ప్రాణాలు కొస్తూ కొరుక్కుతినడానికి!' ఆవేశాన్ని కూడా తేలిగ్గా సరిపోయిస్తున్నట్టు.

లోపలినుండి వింటున్న కనకమ్మ నోరు నొక్కుకుంది.

చర్రున లేచిపోయాడు నారాయణస్వామి. 'ఛీ! నీదింత కటికగుండె అనుకోలేదు. నా బిడ్డ చావుకోరతావా! నువ్వు రాక్షసుడివి - నీచుడివి - పరమ లుచ్ఛావి.

'నువ్వు డబ్బుకు గడ్డితినేవాడివని చిన్నప్పటినుండీ ఎరుగుదును ఇంత తుచ్ఛుడవని యిప్పుడే తెలిసింది.

'నిన్ను వంచకంలో — అప్పుకంటె లప్ప ఎక్కువ చూపించి, అంతా నువ్వే భరిస్తున్నట్టు నటిస్తూ నాకా ఒక్క కొలపతో కన్నీళ్ళు తుడిచి మిగిలిన బంగారం

# ఊర పిచ్చుకలు

పగదూ స్వాహా చేసిననాడూ నిన్ను క్షమించాను.

'నా పరిస్థితులు విషమించి డబ్బు కోసం యిబ్బంది పడుతూ యిల్లు అమ్మకానికి పెడితే—ఆపదలో అడ్డుపడి అప్పు యిచ్చినట్లు నాటకం ఆడి వడ్డీకి చక్రవడ్డీలు కట్టి ఆఖరికి యిల్లు తనఖా వ్రాయించుకొన్ననాడూ క్షమించగలిగాను.

'నా కొడుకును పెంపకానికి యివ్వనన్నానని పగబట్టి కోర్టులో కేసుపెట్టి డిక్రీ పొంది యింటిల్లపాదినీ రోడ్డెక్కించటానికి ప్రయత్నిస్తున్నా నిన్ను సహించాను.

ఈ వేళ నా బిడ్డ చావుబ్రతుకుల్లో వుండి సహాయం కోసం వస్తే యివ్వకపోయినా సహించగలను. కాని ఒక్కమాట— నా బిడ్డ చావు కోరావు. వాడికే నిజంగా ఏమైనా జరిగిందా—నీ అంతు చూస్తాను' చలిజ్వరం వచ్చిన వాడిలా ఒణికి పోయాడు నారాయణస్వామి.

'చూద్దాం వెళ్ళరా—నేను తల్చుకుంటే క్షణంలో జైల్లో వుంటావు' అన్నాడు గోపాలస్వామి పైకి గంభీరంగా కాని ఏనాడూ చూడని తమ్ముడి రౌద్ర స్వరూపాన్ని చూసి నిజంగా చంపుతాడేమో అని ఆ క్షణంలో భయపడ్డాడు కూడా.

'నీరక్తం కళ్ళ జూసిన తర్వాత నేనెక్కడకు వెళ్ళినా బెంగలేదు. నాకోసం ఏడ్చేవాళ్ళయినా వున్నారు కాని గొడ్డుబోతువి—ఛస్తే తలకొరివి కూడా పెట్టే వాళ్ళు లేని నికృష్టపు బ్రతుకునీది — థూ!' అంటూ మరో క్షణం నిలబడకుండా వెళ్ళిపోయాడు నారాయణస్వామి.

'చచ్చిం తర్వాత తలకొరివి పెట్టకపోయినా, తవ్వి పాతకపోయినా ఎవడు చూస్తాడ్రా? బతికుండగానే బలుపొకు మాత్రం తినకుండా చూసుకో!' కోపంగా పళ్ళు పటపటలాడించాడు గోపాలస్వామి.

* * *

ఎక్కడినుండో ఓ ఆడపిచిక గూట్లోకి ఎగిరి వచ్చింది. దాన్ని ఆ గూట్లోని ఆడపిచిక దాంతో కలబడింది. రెండూ ముక్కులతో పొడుచుకుంటూ కాళ్ళతో రక్కుకుంటూ, కలబడి క్రిందపడి మళ్ళీ పైకెగిరి మళ్ళీ పోట్లాడుకుంటూ యిల్లంతా ఒక కొలిక్కి తీసుకువచ్చాయి.

మగపిచిక మాత్రం నిమ్మకు నీరెత్తినట్టు ఆరెంటి తగవూ ఓ ఫోటో మీద కూర్చుని చూస్తూ వుంది.

గోపాలస్వామికా సంఘటన ఎంతో ముచ్చట కలిగించింది. వంటగదిలో ఏదో పనిలో వున్న కనకమ్మను పిలిచి పక్షి చూపించి అంతా వివరించాడు.

ఆడపిచికల ముక్కుల్లోనుండి రక్తం వస్తున్నా అవి తగవు మానలేదు. ఆఖరుకు బయటి నుండి వచ్చిన ఆడపిచిక పారిపోయింది.

'చూశావా కనకం! మీ ఆడవాళ్ళల్లో ఎంత యీర్ష్య వుంటుందో' అంటూ నవ్వాడు గోపాలస్వామి.

'కడుపు నిండా పిల్లలు, భర్త కోసం ప్రాణానికి తెగించి పోట్లాడగలిగిన ధైర్యం —పిచికకైతేనేం దాని బ్రతుకే ధన్యం. ఈ రాజ్యంలో మనిషి జన్మ ఎత్తిన ఆడదానికి అంతపాటి స్వతంత్రం కూడానా! మొగుడెంతమంది ముండలతో తిరిగినా పల్లెత్తు మాట అనటానిక్కూడా నోచుకోలేని ఆడవాళ్ళం—మా ఖర్మ అంతే' అంది కనకమ్మ బియ్యం చేట తెచ్చుకొని నడవలో కూర్చుంటూ.

'ఎందుకొచ్చిన ఎత్తిపొడుపులే లవి — నీకేం కొరత చేశానని? కావాల్సిన తిండీ, బట్టా, కోరిన నగలూ — నీకేం మహా



రాణివి—నీ అంత ధైర్యంగా నేనే వుండ లేను' అన్నాడు గోపాలస్వామి సగర్వంగా.

'ఏం వుంటే ఏం లాభం పిల్లామేకా లేకపోయిన తర్వాత! అందరి నోళ్లూ కొట్టి సంపాదించినదంతా ఏ దారిన పోయే దాని బిడ్డకో దక్కుతుంది. ఆఖరికి మీకు నాకూ ఏముంది మట్టిగడ్డ' అంది కనకమ్మ విసిష్పూరంగా.

'నోరుమ్మయ్!' హఠాత్తుగా కనకమ్మ చెంప చెళ్లుమంది. 'నా యిష్టం! మగ వాణ్ని కనుక చెల్లినంత మందిని వుంచు కుంటాను. నువ్వెవతెవే అడగడానికి? మళ్లీ రంగమ్మ నింకోసారి ఏమన్నా అన్నావా పీక పిసుకుతా జాగ్రత్త—దానికి పిల్లలు పుడతారేమో అని భయమైతే మువ్వే కను ఎవరొద్దన్నారు' అంటూ మళ్లీ కుర్చీలో కూలబడ్డాడు గోపాలస్వామి.

'నాకే పిల్లలుంటే మీ రిలా అనగలిగే వారా! ఎన్ని మాటలన్నా సహించానింత వరకూ. యీ రోజున చెయ్యికూడా చేసు కున్నారు. నేను వున్నా లేకపోయినా, మీ కొకటే. ఆ రంగినే తీసుకొచ్చి నెత్తిమీద పెట్టుకోండి. నేను మా యింటికి పోతా' బియ్యం ఒలికిపోయేలా చేటనంతా దూరంగా విసిరి లేచి లోపలకు వెళ్లింది కనకమ్మ కళ్లొత్తుకుంటూ.

'ఎంత పొగరే నీకు! తిని తిని కొవ్వెక్కావు — పోతే పో! యీ సారి నిజంగా రంగమ్మనే తెచ్చి యింట్లో పెడతా. గొడ్రాలివి మువ్వెలాగూ కనేదీలేదు పెట్టేదీ లేదు. దాని కడుపునైనా ఓ కాయకాస్తే—నీ గర్వం పూర్తిగా అణాగుతుందిలే' ధుమ ధుమ లాడుతూ బయటకు వెళ్లిపోయాడు గోపాలస్వామి.

'నిజంగా నేను గొడ్రాలినా?...!' గతాన్ని గుర్తుకు తెచ్చుకుంది కనకమ్మ. 'పెళ్లికి ముందుమాట అది. అశుభం శుభం తెలియని వయసది. పట్నంనుండి పక్కింటికి చుట్టపు చూపుగా వచ్చిన ఎర్రగా బుర్రగా వుంగరాల జుట్టబ్బాయి దొంగ చూపులో లొంగదీసు కున్నాడు.

పదిరోజులుండి అతగాడు పట్నం వెళ్లిపోయినా ఆ ఫలితం — నెల తప్పించింది. అమ్మా నాన్నా నెత్తీ నోరూ బాదుకొని ఏదో తినిపించి మరుసటి నెలలోనే యీ రెండో పెళ్లివాడి కంటగట్టారు.

అప్పుడు వద్దనుకుంటే అంటుకున్నది —యిప్పుడు కావాలనుకుంటే కరువైంది. ఏమిటో మాయదారి బతుకు — మన చేతుల్లో ఏముంది!' నిట్టూర్చింది కనకమ్మ.

'తప్పు యితగాడిలో వుంచుకొని నన్నంటాడేం యీ మనిషి సిగ్గులేక' అని భర్తను అసహ్యించు కుంటూనే రెండు బట్టలు సంచిలో సర్దుకుంది.

* * *

కోర్టుకు సంబంధించిన కాగితాలన్నీ తీసుకొని అర్జంటుగా బయల్దేరి రమ్మనీ, ఒక కేసు డిక్రీఅవుతుందనీ వ్రాసిన ప్లీడరు గారి వుత్తరం చూసుకొని తలుపులన్నీ బిడాయించి తాళాలు వేసి వెళ్లిపోయినగోపాలస్వామికి—అప్పు తీసుకున్న ఆసామీ కొంప ముంచి, కొంప నుండి వెళ్లగొట్టి, వేలంలో

అందరినోళ్ళా కట్టి తక్కువ ధరకి ఆ కొంపను తనే కొనేసి విజయగర్వంతో యిల్లు చేరడానికి మూడురోజులు పట్టింది.

తలుపులు తెరిచి చూసిన గోపాలస్వామి విభ్రాంతుడై పోయాడు,

పిచికపిల్లలు నాలుగూ నేలమీద చచ్చి పడి వున్నాయి. తలుపులు తెరిచిన తక్షణం లోపలకు వచ్చిన పెద్ద పిచికలు రెండూ ఆ చచ్చిన పిల్లలచుట్టూ తిరుగుతూ గెంతుతూ గోల గోలచేసి పారేస్తున్నాయి.

# ఊర పిచ్చుకలు

మానవత్వం మర్చిపోయిన గోపాలస్వామి మనస్సుకూడా ఆ క్షణంలో—ఆ దృశ్యానికి చలించిపోయింది. 'అయ్యో పాపం! నేను చూసుకోకుండా యీ పెద్దపిచికలు బయటకు వెళ్ళినప్పుడు తలుపులు బిగించి వెళ్ళి పోయి వుంటాను. ఈ మూడురోజుల్లోనూ తిండిలేక యీ పిల్లలు చచ్చిపోయాయి. పిల్లలకోసం యీ పెద్దవి, వీటికోసం ఆ పిల్లలూ ఎంతగా తల్లడిల్లిపోయాయో కదా!' అని పూరికే తనకు తెలియక చేసిన పొరపాటుకు కూడా ఎంతో నొచ్చుకున్నాడు గోపాలస్వామి.

అతని దృష్టి గోడమీది దేవునిపటంపై పడింది. 'తండ్రీ! ఏనాడు చేసుకున్న పాపమో యీ జన్మలో నాకు పిల్లలు లేకుండా చేశావు. మళ్ళీ ఎందుకు నాచే యీపాపం చేయించావు? యింతటితో నాకు విముక్తి లేదా?' అంటూ జీవితంలో మొదటిసారిగా దేవునిముందు తన తప్పు ఒప్పుకున్నాడు గోపాలస్వామి చేతులు జోడిస్తూ. మరుక్షణం అతనికి తనతమ్ముడు గుర్తుకు వచ్చాడు.

వెంటనే చెప్పుల్లో కాళ్ళు తియ్యకుండానే యింటికి తాళంవేసి బయల్దేరబోతున్న గోపాలస్వామికి కోర్టు బంట్రోతు ఎదురు వచ్చాడు.

'మీరే బయల్దేరారా! కోర్టు అమీనాగారు మిమ్మల్ని అర్జంటుగా తమ్ముడిగారింటికి రమ్మన్నారు' అన్నాడు బంట్రోతు.

ఇద్దరూ అక్కడికి చేరేసరికి నారాయణస్వామి భార్యచంటి కుర్రవాడి శవాన్ని ఒళ్ళోపెట్టుకొని భోరున ఏడుస్తూ వుంది. తల్లిని చూసి పిల్లలు మరీ గోలగా ఏడుస్తున్నారు. నారాయణస్వామి కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వెలుగుతూ గోపాలస్వామి దిక్కుగా చూస్తున్నాయి.

ఆచూపును ఎదుర్కొలేని గోపాలస్వామికి అక్కడి దృశ్యం గుండెల్ని బరువెక్కించింది. అప్పుడే పెదనాన్నా అంటూ ఏడుస్తూ వచ్చిన బాచిగాడ్ని ఎత్తుకొని గుండెల కదుముకుంటూ నోటమాటరాక చేతితో అవినాభావెయ్యి పట్టుకొని బయటకు వచ్చేశాడు గోపాలస్వామి.

రెండు పూరపిచ్చుకలు అప్పుడే అలా ఎగిరి పోతున్నాయి—గూటికో—కూటికో!!!

# డాక్టర్ విక్రం. ఎ. శారభాయి



అణుశక్తి కమీషన్ చైర్మన్, భారతప్రభుత్వపు అణుశక్తిశాఖ కార్యదర్శి అయిన డా. విక్రం శారభాయి అంతర్జాతీయ ఖ్యాతి గడించిన భౌతిక శాస్త్రవేత్త. వారి పరిశోధనలు అనేక ఆధునిక రంగాల్లో వున్నాయి. అణుశక్తి, కాస్మిక్ కిరణ ప్రసరణాలు, అంతరిక్షం — వీటన్నిటిలో డా. శారభాయికి ఆసక్తి వుంది. అణ్వస్త్రాల వుపయోగం వల్ల కలగనున్న ప్రభావాల గురించి వివిధ దేశాలు ఎక్కువగా అణ్వస్త్రాలు సేకరించడంలో ఆర్థిక, రక్షణ సంబంధమైన ప్రమాదాలను గురించి ఐక్యరాజ్యసమితి వున్నత కార్యదర్శికి సలహాలిచ్చే నిపుణుల సంఘంలో ఆయన పనిచేశారు. అంతరిక్షాన్ని శాంతియుత ప్రయోజనలకు వినియోగించుకోడానికి ఐక్యరాజ్యసమితి వారు ఏర్పాటు చేసిన సమావేశానికి, నిపుణుల సంఘానికి చైర్మన్‌గా కూడా పని చేసారు.

డా. శారభాయి జననం 1919లో. అహమ్మదాబాద్‌లో గుజరాత్ కాలేజీలో చదువుకున్నారు. తరువాత బెంగుళూరులో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో సర్ సి. వి. రామన్ వద్ద పరిశోధనలు జరిపారు. 1947లో కేంబ్రిడ్జి యూనివర్శిటీలో పి. హెచ్. డి. తీసుకున్నారు.

డా. శారభాయి అహమ్మదాబాద్‌లోని భౌతిక శాస్త్రపరిశోధనా సంస్థకి, తుంబాలోని అంతరిక్ష పరిశోధనా కేంద్రానికి కూడా డైరెక్టర్‌గా వున్నారు. గత 10 సంవత్సరాల్లోను అమెరికాలోని మెసాచుసెట్స్ యిన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (యం. ఐ. టి.) ని అనేకసార్లు దర్శించి అక్కడ అంతరిక్షానికి సంబంధించిన పరిశోధనలు చేసారు.

డా. శారభాయి భారత జాతీయ అంతరిక్ష పరిశోధనా సంఘానికి, యిండియన్ ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్‌కి చైర్మన్. నిరాయుధీకరణగురించి అనేక అంతర్జాతీయసమావేశాల్లో పాల్గొన్నారు. అంతర్జాతీయ వైజ్ఞానిక సంఘాల సమితిలోను, సూర్యగ్రహానికి సంబంధించిన భౌతిక శాస్త్ర యింటర్ యూనియన్ కమీషన్‌లోను సభ్యులు.

1947—55లలో అహమ్మదాబాద్ నేత పరిశ్రమ పరిశోధనాసంస్థకు గౌరవ డైరక్టరుగా పనిచేశారు. 1962—65 లలో ఇండియన్ యిన్‌స్టిట్యూట్ ఆఫ్ మానేజిమెంట్‌కి (అహమ్మదాబాద్) కూడా గౌరవ డైరక్టర్. 1956లో జపాన్ దర్శించిన భారత ఉత్పత్తి ప్రతినిధి వర్గానికి నాయకులు.

మనదేశంలోను, విదేశాల్లోను అనేక వైజ్ఞానిక సంస్థల్లో సభ్యులు. అంతర్జాతీయ వైజ్ఞానిక పత్రికల్లో అనేక వ్యాసాలు ప్రచురించారు. వీరి భౌతిక శాస్త్ర పరిశోధనలకి 1962లో శాంతి స్వరూప భట్నాగర్ అవార్డు లభించింది. 1966లో పద్మభూషణ బిరుదు వచ్చింది.

— డా॥ ఆర్.ఎల్.ఎన్. శాస్త్రి

# సామాన్య అమెరికన్ కుటుంబాలు సంసారాలు దిద్దుకొనే తీరు

[ప్రస్తుతం మారకం రేటు ప్రకారం ఒక డాలరుకి రు. 7-50 విలువ ఉంది. ఈ వ్యాసంలో కొన్నిచోట్ల డాలర్లకి ఉజ్జాయింపుగా రూపాయల విలువ ఇవ్వటం జరిగింది. అమెరికాలో ఒక డాలరుకి ఎంత విలువ ఉందో ఖర్చులనిబట్టి ఊహించవచ్చు !]

సాధారణ అమెరికన్ కుటుంబీకులు తమ రాబడితో సంసారాలు ఎట్లా దిద్దుకుంటారు? ఈ వ్యాసంలో చర్చించిన మూడు నమూనా అమెరికన్ కుటుంబాలను గురించిన సమాచారం ఈ ప్రశ్నకు జవాబు ఇస్తుంది.

అమెరికాలో నేడు సగటు కుటుంబ వార్షిక ఆదాయం 7,989 డాలర్లు (రు. 59000) ఈ వ్యాసంలో చర్చించిన కుటుంబాల రాబడి 8000 డాలర్లకు కొంచెం అటు ఇటుగా ఉంటుంది.

## రెండు ప్లిమత్ కార్లు

హెరల్డ్, క్లాడెట్ యాడమ్స్, లూయీవిల్ (కెంటకీ)—ఈమూడు కుటుంబాలలో బాగా వచ్చగా ఉన్నది యాడమ్స్ కుటుంబం. ఒక ఫ్యాక్టరీలో కార్మికుడుగా పనిచేసేవారు ఇంత సౌఖ్యప్రదంగా జీవించగల్గటం ఆశ్చర్యంగా కనుపిస్తుంది. యాడమ్స్‌కి గంటకు 3.94 డాలర్ల (రు. 30) వేతనం. చదివింది హైస్కూలు వరకే. 'డబ్బు సంపాదన గురించి చాలా ఆలస్యంగా తెలుసుకొన్నాను' అని అంటారాయన. అయినా యాడమ్స్ ఇప్పటికే ప్రభుత్వ బాండ్ల రూపంలో 8000 డాలర్లదాకా వెనక వేయగల్గాడు. 9000 డాలర్లు రీదు చేసే మూడు పడక గదులు గల ఇల్లు వాయిదా పద్ధతిలో కొన్నాడు. (దీనికి నెలనెలా 95 డాలర్లు చెల్లిస్తుంటాడు) ఈ కుటుంబానికి రెండు ప్లిమత్ కార్లు ఉన్నాయి. ఒకటి 1957 మోడల్‌ది. రెండవది 1963 మోడల్‌ది. రొఖ్ఖం పెట్టి వీటిని కొన్నారు.

ఈ దంపతులిద్దరూ కెంటకీలో పెరిగినవారే. ఇద్దరూ ఒకే సెకండరీస్కూలులో చదువుకొన్నారు. ఆ స్కూలులో హెరల్డ్ బాస్కెట్‌బాల్ ఆటగాడు. క్లాడెట్ ఇతని అభిమాని. వీరు వివాహం చేసుకొన్నప్పుడు హెరల్డ్ వయస్సు 21 సంవత్సరాలు. క్లాడెట్ వయసు 18. అప్పటికి హెరల్డ్ నౌకా దళంలో ఉన్నాడు. మిలిటరీ నుంచి విడుదలైన తరువాత అతను జనరల్ మిల్స్ (పెద్ద ఆహార ప్రాసెసింగ్ కంపెనీ)లో నైపుణ్యంతో పనిలేని మెయింటెనెన్సు కార్మికుడుగా చేరాడు. ఇప్పటికీ ఇతను ఈ కంపెనీలో అదే ఉద్యోగం చేస్తున్నాడు. భార్య ఇక్కడి (లూయీవిల్) కలప కంపెనీలో కార్యదర్శిగా పని చేస్తుండేది ఆమెకు జీతం వారానికి 60 డాలర్లు.

వివాహమైన తరువాత తొలి సంవత్సరాలలో సంతానం కోసమని వీరు డాక్టర్లకు బోలెడంత డబ్బు ఖర్చు పెట్టారు. తరువాత అయిదేళ్ళకు సంతానం కలుగుతుందన్న ఆశ వదలుకొని పిల్లల్ని దత్తు చేసుకోవాలన్నారు. అప్పట్లోనే ఇప్పుడు వీరుంటున్న ఇల్లు కొనుక్కున్నారు. మొదట ఈ ఇంటికి 2200 డాలర్లు చెల్లించారు. పిల్లల్ని దత్తు చేసుకోటానికి సంబంధించిన తతంగానికి, దత్తు స్వీకార పత్రాలకు మరొక వెయ్యి డాలర్లు ఖర్చు చేశారు. ఇదంతా ఈ దంపతులు అంతకుముందు ఆరేళ్ళుగా పని చేసి కూడబెట్టుకొన్న డబ్బు. హాంక్, హెదర్ అనే ఇద్దరు పిల్లల్ని దత్తు తీసుకొన్నారు. ఇప్పుడు హాంకీ వయసు అయిదేళ్ళు. హెదర్ వయసు మూడు. క్లాడెట్ ఇప్పుడు ఉద్యోగం చేయటం లేదు.



హెరల్డ్, క్లాడెత్ యాడమ్స్—వారి పిల్లలు హాంక్, హెదర్.

జనరల్ మిల్స్ తన ఉద్యోగులకు అనేక సదుపాయాలు చేస్తుంది. ఉద్యోగులకు ఉచిత భీమా సౌకర్యం ఉచితవైద్య భీమా వంటివి ఈ సౌకర్యాలలో ఉన్నవి. యాడమ్స్‌కి 5500 జీవిత భీమా పాలసీ ఉన్నది. ఉద్యోగులు కంపెనీ ఖర్చులతో బయట కోర్సులు చదువుకోవచ్చు. ఆ విధంగా నైపుణ్యాలు అభివృద్ధి పరచుకోవచ్చు. హెరల్డ్ రెండున్నర సంవత్సరాలపాటు ఒక రాత్రి పాఠశాలలో చదవుకొన్నాడు. విద్యుచ్ఛక్తి ప్రాథమిక సూత్రాలు, మెషిన్ షాపుపని, వెల్డింగు నేర్చుకొన్నాడు. సొంత ఖర్చుతో ఈ పనులు నేర్చుకోవాలంటే వెయ్యి డాలర్లు ఖర్చయ్యేవి. ఇట్లా కొత్త నైపుణ్యాలు సంపాదించటంలో అతని వార్షిక వేతనం, 5000 డాలర్లు నుంచి 8200 డాలర్లకు పెరిగింది.

## ఇంట్లోనే కుట్టుపని

క్లాడెట్ తన దుస్తులను తానే కుట్టుకొంటుంది. హెదర్‌కి కూడా దుస్తులు తయారు చేస్తుంది. వాయిదాల పద్ధతిమీదగానీ, అరువు పద్ధతిమీదగానీ వీరు వస్తువులు కొనరు. అందువల్ల వీరు అదనంగా సంవత్సరానికి 100 డాలర్లు పొదుపు చేయగల్గుతుంటారు. సినిమాలకు కూడా తరచుగా పోరు. సెలవులలో సాధారణంగా తలిదండ్రుల దగ్గరకే వెళ్ళుతుంటారు. అందువల్ల పిక్నిక్కులు, యాత్రలు వంటి ఖర్చులు వీరికి అట్టే ఉండవు.

## మూడు పడకగదుల ఇల్లు

విలియమ్ హెజల్ హింటన్—లింకన్ హైట్స్ (ఒహాయో) — హింటన్స్ దంపతులకు మూడు పడకగదుల ఇల్లు ఉన్నది. ఇంతకుముందు వీరు తమ నల్గురు బిడ్డలతో మూడు గదుల పోర్షనులో ఉంటుండేవారు. అది ఇరుకుగా ఉండేది. గవ్ హింటన్ వయసు 42. జనరల్ ఎలెక్ట్రికల్ కంపెనీలో ప్రాసెసింగు డిపార్టుమెంటులో గుమాస్తా. 'అయితే ఆ ఇంటి అద్దె 30 డాలర్లు మాత్రమే. అందుకే ఆ ఇంట్లో చాలాకాలం ఉన్నాము. హెజల్, నేను లివింగు రూములో నిద్రపోవలసి వచ్చేది'' అన్నాడు హింటన్.

1965 లో హింటన్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. అప్పుడు 600 డాలర్ల ఉద్యోగ విరమణ కాలధనం (సెవరెన్సు పే)వచ్చింది. దానితో 14,500

# అమెరికన్ కుటుంబాలు

డాలర్లు ఇల్లు కొనటానికి సాహసించారు.

తరువాత రన్‌కి వారానికి 83 డాలర్ల జీతంతో ఫౌండ్రీలో ఉద్యోగం దొరికింది. అంతకుముందు ఉద్యోగంలో అతని జీతం వారానికి 135 డాలర్లు. మొత్తం మీద ఖర్చులు తగ్గించుకొని ఎలాగో గడుపుతూ వచ్చారు. తరువాత 16 మాసాలకు తిరిగి జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీలో చేరాడు. ప్రొసెస్ సూపర్వైజర్‌గా వచ్చే పోయే సామాన్లను తనిఖీ చేస్తూ సాయంత్రం మూడున్నర గంటలు మొదలు అర్ధరాత్రి వరకు పని చేయవలసి ఉన్నది. వగటి భోజనానికి సాయంత్రం 7 గంటలకు వెళ్లేవాడు. హోవర్ టైమ్ వచ్చినరోజు కలుపుకొని గంటకు మూడు డాలర్ల దాకా సంపాదించేవాడు. (హోవర్ టైమ్ జీతం అసలు జీతానికి ఒకటిన్నర రెట్లు ఉంటుంది) అవిధంగా తన రాబడి గంటకు 3.15(రూ. 23.50) డాలర్ల దాకా పెంచుకోగల్గాడు.

హింటన్ దంపతులు వీలైనప్పుడల్లా కొత్త కొత్త ఫర్నిచరు కొంటుంటారు. పోయిన సంవత్సరం కారుకొన్న అప్పు తీరిపోయింది. అది 1960 ఓల్డ్స్ మొబిల్ స్టేషను వాగను. ఫర్నిచరు అప్పు కూడా త్వరలోనే తీరిపోతుంది. "అప్పుడు మేము డబ్బు వెనక వెనకోవటం మొదలు పెట్టవచ్చు" అంటుంది హెజెల్. తమ బిడ్డల్లో ఇద్దరికైనా కాలేజీ చదువులు చెప్పించాలని వారు అనుకొంటున్నారు. వీరుకూడా ఆరోగ్యబీమా పథకం ద్వారా లాభిస్తున్నారు. హింటన్ సాధారణంగా సెలవు తీసుకోడు. సెలవుల్లో అదనంగా పని చేసి డబ్బు సంపాదిస్తుంటాడు. హింటన్ సెలవుల్లో స్నేహితుని లారీ తోలి డబ్బు సంపాదిస్తాడు. వీరు ఎపిస్కోపల్ చర్చికి సంబంధించినవారు. చర్చికి సంవత్సరానికి 30 డాలర్లు విరాళం ఇస్తారు.

అయితే పొదుపు పేరుతో సరదాలను త్యాగం చేసే రకం కాదు. వీరికి సిగరెట్లకు, బీరుకి సంవత్సరానికి 650 డాలర్లు ఖర్చు అవుతుంది. వీరు జాజ్ రికార్డులకు 300 డాలర్లు ఖర్చు పెట్టారు. వీరిద్దరూ జాజ్ ప్రియులే.

**కారు లేదు**

లూయీ మేరియన్ స్టేఫెనెల్లి, నార్త్ లిండెన్ హర్స్ట్ (లాంగ్ఐలెండ్) న్యూయార్క్—సిటీ గ్రేటర్ న్యూయార్క్ కమ్యూనిటీ కౌన్సిల్ నగర ప్రాంతంలో నల్గురు సభ్యులు గల కుటుంబానికి ఎంత ఖర్చవుతుందో అంచనాలు ప్రకటిస్తుంటుంది. 1966లో ఈ అంచనా గరిష్ఠస్థాయి— 7281 డాలర్లు— అందుకొన్నది. అద్దె కంట్రోలు ఇంటి వాటాలో నివసించే ఈ కుటుంబం నెలకు 88 డాలర్లు చెల్లిస్తున్నారనీ, వారికి కారు లేదనీ, పిల్లల్ని కాలేజీలో చదివించటం లేదనీ ఈ లెక్కలు తెలిపాయి.



విలియం హేజెల్ హింటన్‌లు వారిపిల్లలు బొమ్మలోని ఇల్లు వారి స్వంతం.

లూయీ స్టేఫెనెల్లి వయస్సు 50 సంవత్సరాలు. భార్య మేరియన్ వయస్సు 46. న్యూయార్క్ శివారులోని 7 గదుల ఇంటి వాటాకి నెలకు 95 డాలర్లు చెల్లిస్తున్నారు. కారు ఉన్నది. దాని క్రింద సంవత్సరానికి 750 డాలర్లు ఖర్చవుతుంది. సంవత్సరానికి 450 డాలర్లుదాకా పెన్షను ఫండుకి చెల్లిస్తారు. కూతురు కాలేజీలో చదువుతున్నది. వీరికి ఇంకా అర్గురు బిడ్డలున్నారు. మొత్తం సంవత్సరానికి 8,200 డాలర్లు ఖర్చవుతుంది. "వారానికి ఒకసారి మాత్రమే పిండివంట చేసుకొంటాము" అని మేరియన్ చెప్పింది.

లూయీ స్టేఫెనెల్లి 1949 నుంచి బస్సు డ్రైవరుగా పనిచేస్తున్నాడు. 60 మంది ప్రయాణికుల బస్సును న్యూయార్క్ ట్రాన్సిట్ అథారిటీ తరఫున ఈయన బ్రూక్లిన్‌లో నడుపుతున్నాడు. ఈయన జీతం సంవత్సరానికి 7,200 (రు. 39000) డాలర్లు. అయితే మరొక 1000 డాలర్లు హోవర్ టైమ్ వస్తుంది.

సంసారం పొదుపుగా జరుపుకు పోవటంలో ఘనత అంతా అతని భార్య మేరియన్‌దే. ఈమె సెకండరీ స్కూలులో రెండేళ్లు మాత్రమే చదివింది.

అంతేకాకుండా పత్రికలు కొనటానికి వీరు ఖర్చు పెట్టినంత డబ్బు నేను చూచిన కుటుంబాలలో మరెవ్వరూ పెట్టటం లేదు. సంవత్సరానికి 80 డాలర్లు ఇందుకు వెచ్చిస్తారు. లూయీకి పత్రికలు చదవడం ఎంతో ఇష్టం. ఈయన చదివింది సెకండరీ స్కూలువరకే.

1945లో లూయీ సైన్యం నుంచి విడుదలైనప్పుడు ప్రభుత్వ సహాయంతో కాలేజీలో చదుదామనుకొన్నాడు. జి. ఐ. శాసనం క్రింద సైన్యంలో పనిచేసి వచ్చినవారు కాలేజీలో చదవటానికి ప్రభుత్వ సహాయం లభిస్తుంది. అయితే అప్పటికే భార్య ఇద్దరు బిడ్డలు ఉండటంవల్ల అతను అట్టే ఆలోచనకు స్వస్తి చెప్పాడు. మేరియన్ ఇష్టం భర్త కాలేజీలో చదవాలనే. "అది నిజంగా నేను చేసిన తప్పు. తిరిగి నా బిడ్డలు అదే తప్పుచేయకూడదు" అంటాడాయన.

1954లో వీరికి హవుసింగ్ ప్రాజెక్టు క్రింద మూడు పడకగదుల పోర్షన్లు 39 డాలర్ల అద్దెకు దొరికింది. అప్పుడే ఒక పాతకారు కొన్నారు. ఆ కారులోనే వీరు ఆది, శనివారాలలో గృహాన్వేషణకు లాంగ్ ఐలెండ్ అంతా తిరుగుతుండేవారు. అప్పట్లో లూయీ రాబడి సంవత్సరానికి 5000 డాలర్లు. 1955లో వీరు తమ ఇప్పటి ఇల్లు కొన్నారు. 11,500 డాలర్లకు వాయిదాల పద్ధతిపై దీన్ని కొన్నారు. మొదటి పేమెంటు 650 డాలర్లు.

"కొత్త ఇంటికి మారిన తరువాత మొదటి సంవత్సరాలలో చాలా కష్టం అనిపించింది. రాత్రులందు కూడా బస్సు నడుపటానికి వెళ్లేవాణ్ణి. అనేక సందర్భాలలో బ్రూక్లిన్ డిపోలోనే నిద్రపోయేవాణ్ణి. అట్లా ఇంటికి డిపోకీ తిరగటానికి అయ్యే చార్జీలు కూడా పొదుపు చేశాను. ఒక్కొక్కసారి ఇంటిని వదలివేయాలన్నంత విసుగు పుట్టేది" అని చెప్పాడు లూయిస్.

వేతనాల పెంపుకు యూనియన్ జరిపిన కృషి విజయవంతం కావటంతో అతని కష్టాలు చాలావరకు



లూయిస్ మారియన్ స్టిఫెనెల్లీలు వారి ఏడుగురి పిల్లలలో అయిదుగురు. ఎడమ వయిపు చివ్వరి అమ్మాయి కాథీ న్యూయార్క్‌-క్వీన్స్ కాలేజీలో చదువుకుంటున్నది. శ్రీ సెఫెనెల్లి ఇస్ ప్రయివరు

తీరాయి. 1957లో ఆ యింటికి మరొక పెద్ద కిచన్—డైనింగ్ రూము నిర్మాణం ప్రారంభించారు. అంతకుముందున్న వంట గదిని పడకగదిగా ఉపయోగించుకోవాలనుకొన్నారు. ఇందుకు సంబంధించిన పని స్వయంగా తనే చేశాడు. "పది డాలర్ల కలప కొన్నాను. 8 డాలర్ల పెయింటు కొన్నాను" అని చెప్పాడు లూయిస్. రెండేళ్లలో 600 డాలర్ల ఖర్చుతో దీని నిర్మాణం పూర్తయింది. మామూలుగా అయితే దీని నిర్మాణానికి 3000 డాలర్లు ఖర్చయ్యేది. ఇప్పుడు ఈ యింటి విలువ 19000 డాలర్లకు పెరిగింది. ఇంకా ఈ ఇంటిమీద 8000 డాలర్ల అప్పు తీర్చవలసి ఉన్నది.

## చదువంటే అభిమానం

తమ పిల్లలందరూ కాలేజీలలో చదవాలని ఈ దంపతుల కోరిక. కేతి క్వీన్స్ కాలేజీలో చదువుతున్నది. ఆమె ట్యూషను ఫీజు 70 డాలర్లు— మాత్రమే. ఎందుకంటే ఆమె ఉపాధ్యాయ శిక్షణ పొందుతున్నది. అయితే, పుస్తకాలు, తదితర ఖర్చులకు మరొక 150 డాలర్లు అవుతుంది. ఆమె వారానికి మూడు రాత్రులు ఉద్యోగం చేస్తుంది. శనివారాలలో సూపర్ మార్కెట్‌లో చెకర్‌గా పని చేస్తుంది. ఆ విధంగా ఆమె ఖర్చులకు ఆమె సంపాదించుకొంటుంది.

పెద్దకొడుకు లూయీ (22 సంవత్సరాలు) విమానదళంలో ఉన్నాడు. అయితే అతని డ్యూటీ త్వరలోనే పూర్తి కానున్నది. అతన్ని కూడా జి. ఐ. నిబంధనల క్రింద ప్రభుత్వ సహాయంతో కాలేజీలో చేర్పించాలని తండ్రి ఆలోచిస్తున్నాడు. కొడుకు

ఇంకా ఏ సంగతీ తేల్చి చెప్పలేదు. రెండవ కొడుకు ఫిలిప్ (20 సంవత్సరాలు) ఇటీవలనే విమానదళంలో చేరాడు.

సాధారణంగా మేరియన్ వారానికి 50 డాలర్లు చిల్లర సరకులకు ఖర్చు చేస్తుంది. కావాలనుకొంటే ఆ ఖర్చు 28 డాలర్లకు తగ్గించగలదు. "నా ఖర్చు వారం అవసరాలపై ఆధారపడి ఉంటుంది. పిల్లలకు ఒకటి రెండు జీతాలు బూట్లు కొనాలి. కనుక ఆ వారం మాంసం ఖర్చు తగ్గించాలి." అని అంటుందామె.

ఈ మూడు కుటుంబాలలోనూ లూయీ ఒక్కడే త్వరగా రిటైరు కావాలని ఆరాట పడుతున్నాడు. పూర్తి పెన్షన్‌కి అర్హత సంపాదించటానికి 55 సంవత్సరాలు నిండాలి. రియల్ ఎస్టేటు (స్థిరాస్థి) విషయాలు గురించి తెలుసుకోవాలను కొంటున్నాడు. స్థిరాస్తుల క్రయవిక్రయం వ్యాపారంలో ప్రవేశించాలని ఆయన కోరిక.

— మరే వి. బ్లూమ్

(కాపిరైటు — మెక్‌కాల్ కార్పొరేషన్) ●

డాక్టర్ కబుర్లు

## నోట్లో వేళ్లు పెట్టుకునే పిల్లలు...

నోట్లో వేళ్ళు పెట్టుకునే పిల్లలకి పళ్ళజబ్బులు తక్కువగా ఉంటాయని పరిశోధకులు చెప్తున్నారు. ఏదయినా చప్పరిస్తే ఉమ్మి ఉత్పత్తి అధికంగా ఉంటుంది కదా! ఉమ్మి పళ్లని కాపాడుతుందన్న మాట.

అందుకనే అమెరికాలో 'చూయింగ్ గమ్' నమిలేవారి పళ్ళు గట్టిగా ఉంటాయట.

కేవలం ఉమ్మివల్లనే కాదు. ఈ గమ్ నమలటంవల్ల పళ్లకి అంటుకుని ఉన్న చిన్న చిన్న ఆహారపు కణాలు గమ్‌కే అంటుకుని పళ్లకి సంభవించే ప్రమాదాన్ని తగ్గిస్తాయి.

చక్కెర పళ్లకి హానికరం అని ఎందరో అంటారు. ఆధునిక వైద్యులు ఈ అభిప్రాయాన్ని ఖండిస్తున్నారు...



పళ్ళమధ్య సందులు ఉండే వారి పళ్ళు దగ్గరగా ఉండేవారి పళ్లకన్నా ఆరోగ్యకరంగా ఉంటాయట!

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్

(కాపీరయిటు)


"లాటరీ"
Jayadev


అతనికి లక్ష రూపాయల ప్రయిజు వచ్చిన సంగతి అతని బంధువులకు తెలిసినట్టుంది!!


ముష్టాడికి కట్నం కింద లక్ష రూపాయ లన్నాను - ఈ లాటరీ టికెట్టు పుచ్చుకోండి బావగారూ!!


నాదగ్గర తొంభై పైస లున్నాయి - ఓ పది పైసలు ధర్మం చెయ్యండి బాబూ - లాటరీ టికెట్టు కొనాలి!


ఈ రోజుల్లో ఎవడో జేబులు కొట్టినా పర్సుల్లో లాటరీ టికెట్లు తప్ప రూపాయి నోట్లు ఒకటి కూడా అగుపించడం లేదు గురూ!!


లక్ష రూపాయల బహుమతి ఒక్క నంబరులో తప్పిందని తెలియగానే......


లాటరీ లో ప్రయిజు కొట్టాడు లాగుంది!!




ఉన్న ఆ ఒక్క రూపాయీ తగలేసి ఆ లాటరీ టికెటు కొన్నారా!


ప్రయిజు గెలిచాక :-




# 2

తన ఆశలన్నీ అలా దూదిపింజెల్లా ఎగిరి పోబోతున్నాయని గ్రహించుకుని నీళ్ళు కారి పోయినట్టు కుర్చీలో జారగిలబడి చెంపని చెయ్యి ఆనించుకుని కూర్చుని, భార్య ఉప న్యాసంలాంటి ధోరణి అంతా విన్న ఉమా మహేశ్వరంగారికి చటుక్కున గుర్తు వచ్చింది.

'అది సరే కాని, కోడలు నలుపయితే కులం అంతా నలుపని శాస్త్రమే వుంది— రత్నంలాంటి పిల్లాడికి ఆ నల్లపిల్లని కడతానంటావేమిటి? అయినా వాడు ఒప్పు కుంటాడనేనా?' అన్నాడు. ఇంత సేపటికి తనకి ఓ పాయింటు దొరికిందన్న ధీమాతో.

'సురేఖని కాదులెండి— ఉమని చేసు కుందాం—దానికంటె ఇది రెండేళ్లో ఎంతో చిన్న' అంది రుక్మిణమ్మగారు.

'పెద్ద పిల్లని వదిలి చిన్నపిల్లని చేసుకుంటామంటే వాళ్ళేమయినా అను కోరా?' ఏ అభ్యంతరం లేవదీస్తూ, రపంత ఆశగా భార్య కళ్ళల్లోకి చూశారాయన — విూ అన్నయ్య మన తాహతుకి తూగరేడు, అందుచేత నాకు ఇష్టంలేదు అని చెప్పగల సాహసంలేకపోయిందాయనకి. అందుకే ఆవిడ కోరిక సమంజసంకాదని ఏదోవిధంగా ఆవిడ చేతే ఒప్పించి నెపం తనవిూదలేకుండా చేసు కోవాలని ఆయన తాపత్రయం.

'నా ఉద్దేశ్యం చెప్పాను మిగిలిన విష యాలన్నీ వాళ్ళే ఆలోచించుకుంటారు— అయినా కోరిచేసుకుంటామంటూంటే చేదా ఏమిటి?' అంది రుక్మిణమ్మ ధీమాగా— మొగపిల్లవాడి తల్లి మరి.

'సరే, అందరికీ అంగీకారం అయితే నా అభ్యంతరం ఏం లేదు' అనక తప్ప లేదాయనకి.

ఆ తరువాత కొడుకు అభిప్రాయంకూడ తెలుసుకునే అవకాశంకోసం చూస్తూ కూర్చుంది ఆవిడ — వేసంగి శలవలు ఎప్పుడు వస్తాయా అని రోజులు లెఖ్ఖ పెట్టుకుంటున్న ఆవిడకి, నాలుగురోజులు శలవలు కలిసివచ్చాయని కొడుకు ఇంటికి రావటం శుభసూచకమే అనిపించింది— ఆసాయంకాలం చల్లగాలికి ఆరు బయట మంచం వాల్చుకుని కూర్చుని కొడుకుని పిలిచింది—అదీ ఇదీ మాట్లాడి చివరికి అసలు సంగతి బయటపెట్టింది. అది వింటున్న రామకృష్ణ మొహంలో రంగులు ఇట్టే మారిపోయాయి.

'ఈ మధ్యంటే కాస్త తగ్గింది కాని చిన్నతనంలో ప్రతి ఏడూ వేసంగి శలవలకి తామంతా అమ్మమ్మగారి వూరుకెళ్ళేవారు. నాన్నగారికి ఎప్పుడైనా వీలుకాకపోయినా అమ్మ తమూమాత్రం ప్రయాణం మానే వారుకాదు—ఆ చిన్నవయస్సులో ఆడా మొగా అనే భేదంలేకుండా పిల్లలంతా కలిసి దాగుడుమూతలూ, ఎండవేళయితే కేరమ్సూ పేకా ఆడుతూండేవారు— అదేం చిత్రమో కాని సురేఖకీ తనకీ అసలు ఒక్కక్షణం అయినా పడేదికాదు.

ఆ రోజుల్లో మామయ్యగారింట్లో ఓ నల్లావు వుండేది — అది ఇంట పుట్టిన దూడ,

'ఇదిగో, అసలు ఆవులు తెల్లగా వుంటాయికాదూ, మీ నల్లావుని గురించి నేనో కథ చెప్పనా' అన్నాడు తను ఒక నాడు, సురేఖ వంక ఓరగా చూస్తూ.

అతని మాటల్లో వ్యంగ్యం వెంటనే స్ఫురించలేదు అక్కడున్న పిల్లలకి 'ఏమి టది చెప్పు,' అన్నారు.

'ఓస్— ఇంత మాత్రం తెలియదా — అది పుట్టినప్పుడు తెల్లగానే వుండేదిట మా అమ్మ చెప్పింది— తెల్లగా బొద్దుగా ముద్దొస్తున్న ఆ బుల్లి తువ్వాయి మీద మన సురేఖ ఒక్కసారి అలా చెయ్యివేసి నిమిరిందిట—అంతే, మంత్రం వేసినట్టు మరుక్షణంలో అది నల్లటి దూడగా మారి పోయిందిట...' తెరలు తెరలుగా వస్తున్న నవ్వు ఆపుకుంటూ అతను చెప్తుంటే కొంతమంది ఆ నవ్వులో శృతి కలిపారు— మరి కొంతమంది నవ్వటానికి ధైర్యం లేకనో లేకపోతే సురేఖ పట్ల జాలివల్లనో బొమ్మల్లా మూతులు బిగించుకుని ఆ పిల్ల ఏం చేస్తుందో చూద్దాం అన్నట్టు రెప్పవాల్చకుండా అటే చూస్తూ కూర్చు న్నారు—

బావ అలా తనని వెక్కిరిస్తుంటే సురేఖ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి — అవ మాన భారంతో తల ఒరిగిపోయింది ఒక్క క్షణం— అంతే, మరుక్షణం రెట్టించిన పౌరుషంతోనూ ఉడుకు మోత్తనంతోనూ గొంతు పెంచుకుంది 'చూడ కళ్ళూ లేవు నారాయణా అన్నట్టు నీకసలు కళ్ళే కనిపించవుగా... మా ఆవు రంగు పోల్చుకో గలగటం చిత్రంగానే వుంది — అసలు నీ కళ్ళకి ప్రపంచం అంతా నల్లగానే కని పిస్తుందేమో' అంటూ.

తరుచు తలనొప్పి వస్తూండటం వల్ల పదేళ్ళ వయస్సులోనే కళ్ళజోడు పెట్టు కోవలసిన అవసరం కలిగింది రామకృష్ణకి —తన అవకరాన్ని అలా నిస్సంకోచంగా ఆ పిల్ల వెక్కిరించటంతో అతనికి కోపం వచ్చింది—దానికేదో సమాధానం చెప్పాడు. ఆ పిల్ల వూరుకోలేదు, మాటకి మాట అంటించినదాకా — ఏం చెయ్యాలో తెలి యక మిగిలిన వాళ్ళంతా తమకేమీ పట్ట నట్టు కేవలం ప్రేక్షకులుగా కూర్చుండి పోతే తామిద్దరూ కాస్సేపు పోట్లాడుకుని

చివరికి చెరోమూలా ఏడుస్తూ కూర్చు న్నారు—అలాగే ఆ వూరు వెళ్ళినప్పుడల్లా ఎందుకో అందుకు ఆ పిల్ల వెక్కిరించటం మళ్ళీ నాలుగనిపించుకోటం తనకి అల వాటయిపోయింది — ఇప్పుడు దాదాపు మూడేళ్ళు అవుతోంది తను మామయ్య గారింటికి వెళ్ళి — ఈ మూడేళ్ళల్లో ఎంత మార్పు వచ్చినా సురేఖ రంభలా రూపు దిద్దుకుని వుంటుంది అనుకోటానికి అతని మనస్సు ఒప్పుకోటం లేదు — ఆ అమ్మాయిని తన ప్రక్కన భార్యగా వూహించుకోటానికే అతని కెలాగో వుంది—

తన ప్రశ్నకి సమాధానం చెప్పకుండా మొహం ముడుచుకుని మల్లె పందిరివంకా మందార చెట్టువంకా చూస్తూ కూర్చున్న కొడుకు ఆలోచనలని పసిగట్టగలిగిన రుక్మిణమ్మ ముసిముసిగా నవ్వుతూ అంది.

'ఉమకేం తక్కువరా, బంగారపు బొమ్మకదూ— చదువులో అయినా అంత మరీ తెలివితక్కువదేం కాదు — పరీక్షల ముందు జ్వరం రావటంవల్ల ఆ మ్యాక్కులు ఫైనలు పోయింది. ఆ తరువాత మరి చదవనూ అంటూ అదే మానేసింది, వాళ్ళూ శ్రద్ధ పట్టలేదు...'

ఆవిడ మాట్లాడటం మొదలుపెట్టిన మరు క్షణంలోనే అతని ఎదలో మల్లెలు విరిశాయి — ఇంక ఆ తరువాత అతనేం వినలేదు — తను చివరిసారిగా చూసిన ఉమ రూపం మనస్సులో మెదిలింది — మోకాలిపైదు కుచ్చెళ్ళ పరికిణీ, కొత్తగా వేసు కోటంవల్ల అలవాటులేక భుజంమీద నిలవ కుండా జారి జారి పోతున్నవోణీ — పసి తనం స్ఫూర్తిగా వదలక ఎప్పటిలాగే చెంగుచెంగున గంతులేస్తూ ఆటలాడే ఉమ — రెండుజడలు, చెవులకి బంగాళీ రింగులు, టూత్ పేస్టు ఎడ్వర్టయిజిమెంటువాళ్ళ ఫోటోలోలా తెల్లగా మెరిసే చక్కటి పలు వరుస. బుల్లినోరు, నవ్వితే సొట్టలుపడే మన్నటి బుగ్గలు—ఆ ఉమ ఇవాళ ఎలా వుంటుందో వూహించుకోబోయాడు—ఎంత దాచుకుందామన్నా దాగని అనురాగం ఆ చిరునవ్వులో బయటపడనే పడిపోయింది.

మురిపెంగా కొడుకు మొహంలోకి చూస్తూ, 'కావాలంటే మళ్ళీ చదివించ మని చెప్తాం...ఏం, మామయ్యతో చెప్పనా దాన్ని మళ్ళీ పరీక్షకి కట్టించమని' అని ఆవిడ అడిగినదానికి 'నీ ఇష్టం—' అంటూ తప్పుకున్నాడతను.

ఉగాది పండుగపేరుతో పనిగట్టుకుని వచ్చిన అత్తయ్య మధ్యాహ్నం తీరుబడిగా పెళ్ళి ముచ్చట్లు మొదలుపెట్టేసరికి, ప్రక్కగదిలో కూర్చుని చదువుకుంటున్న సురేఖ చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. ఆ పిల్లకి తెలియకుండానే — గుండె ఝల్లుమన్న ట్లయింది — 'ఎలాగయినా అత్తయ్యకి నేనంటే అభిమానం — చిన్నప్పటినుంచీ నా చదువు చూసి నాకువచ్చిన మార్కులు చూసి మురిసిపోయేది.' అనుకుంటూ తియ్యటి వూహలలో తేలిపోతున్న సురేఖకి అత్తయ్య ఏమందో వినిపించలేదు కాని



# సురేఖాపరిణయం

'పెద్దదాన్ని వదిలి, ఉమని చేసుకుంటాననటం న్యాయంకాదు—సురేఖ అయినా మీ అబ్బాయికి ఈడే'. అంటున్న తల్లిమాటలు చెవుల్లో పడగానే వులిక్కిపడినట్లయి ఏమిటిది ఏమయింది అనుకుంది. మనస్సు గిలగిల్లాడి పోయింది — తేనెసోనలు కురుస్తాయని తహతహ లాడిపోతున్న శ్రవణేంద్రియాలలో వాడి శూలాలు గుచ్చుకున్నట్లయింది.

'లేదు వదినా—నేనలా మాట యివ్వలేను—లేనిపోని ఆశలు మీకు కల్పించటం ఎందుకు? ఆ తరువాత రుక్మిణి అన్నమాట నిలబెట్టుకోలేక పోయింది అని మీ చేత అనిపించుకోటం ఎందుకు? ఉమని చేసుకోటాని కయితే అబ్బాయి కెలాంటి అభ్యంతరమూ లేదు. మీరూ ఆలోచించుకోండి—అయితే నేను ఒక్కటి మాత్రం చెప్పగలను—సురేఖ పెళ్లి అయేదాకా ఉమ పెళ్లి చేసెయ్యమని మిమ్మల్ని తొందర పెట్టను' అందావిడ పెద్ద ఉపకారం చేస్తున్న దానిలా.

'ఎంత ఔదార్యం కనబరుస్తోంది అత్తయ్య' అనుకుంది సురేఖ కసిగా. అత్తయ్య యిన్నాళ్లూ తనపై చూపించినదంతా పైపై అభిమానమే ననీ, కోడలిగా ఎన్నిక చేసుకోవలసిన సమయం వచ్చే సరికి ఆవిడ మోజు తనమీద కాస్తయినా లేకపోయిందనీ గ్రహించుకున్న ఆ పిల్ల హృదయం మూగగా ఎంత కన్నీరు ఓడ్చిందో ఆ భగవంతుడికి ఒక్కడికే తెలుసు—అంతటి బాధలోనూ అశాంతిలోనూ చిన్న ఆశాకిరణం, ఏదో భ్రమ మినుకు మినుకు మంటూ ఆమె అంతరంగంలో ఓ మూల అలా నిలిచిపోయింది. 'అత్తయ్యకి ఆడపిల్లలు లేరు. వాళ్ల ఆశలూ ఆలోచనలూ ఎలా సాగుతాయో, సరదాగా ఆనందంగా సాగిపోతున్న జీవితంలో ఎంత చిన్న దెబ్బ తగిలినా ఆ పసి హృదయాలు ఎంత చిన్నబుచ్చుకుంటాయో ఆవిడికి అర్థం కాదు — కాని అమ్మా నాన్నగారూ అలా మాట యివ్వలేరు' అనే ఆశతో చెవులు రిక్కించుకుని కూర్చున్న సురేఖకి తండ్రి మరేమీ వాద ప్రతివాదాలు చెయ్యకుండా, సంతోషంగా సంతృప్తిగా 'సరేలే—ఒకటి కలిసివచ్చినా వచ్చినట్టే—సురేఖకి పై సంబంధమే చూస్తాను. రెండు పెళ్లిళ్లూ ఒక్కసారే చేస్తే కాస్త ఖర్చు కలిసివస్తుంది' అనడం—

'అదీ నిజమేలెండి' అంటూ తల్లి వంత పాడటంతో సురేఖ మనస్సు పాతాళానికి కృంగిపోయినట్లయింది.

ఛ, ఎలాగయినా అమ్మా వాళ్లకి ఉమ అంటేనే అభిమానం ఎక్కువ అనుకుంది ఉడుకు మోత్తనంగా — చిన్నతనం నుండీ తనకి జరిగిన అన్యాయాలూ తల్లీ తండ్రీ ఉమని ఎక్కువ చేసి తనని చులకన చేసిన సందర్భాలు గుర్తుకు రావటం మొదలు పెట్టాయి — అందులోనూ ముఖ్యంగా ఓ సారి తన పుట్టినరోజు పండగ నాటి సంఘటన తనెప్పుడూ మరిచిపోలేదు—

అప్పటికి వర్ధనమ్మగారిని పూర్వ కాలపు చాదస్తం ఇంకా పూర్తిగా వదల్లేదు—బట్టల షాపుకి వెళ్లటం కావలసిన చీరలూ అవీ ఏరుకోటం ఆవిడకేమిటో చచ్చే మొహమాటంగా వుండేది. అవసరం వచ్చినప్పుడు దుకాణానికి కబురు పంపిస్తే వాళ్లే ఇన్ని చీరలు జాకెట్టు బట్టలూ అవీ మూటకట్టి కుర్రాడిచేత పంపించేవారు.

సురేఖకి ఉమకి వయస్సులో తేడా మహా వుంటే రెండున్నర సంవత్సరాలు, సురేఖ చీరలు కట్టుకోటం ప్రారంభించే సరికి ఉమ ఓణీలు వేసుకోటం మొదలు పెట్టింది. కాస్త మంచి చీర, కంటికి నదురుగా కనిపించింది సురేఖ ఏరుకునే సరికి ఉమ కూడ అదే కావాలని కూర్చునేది—ఆవేళా అల్లాగే జరిగింది.

'ఇప్పట్నుంచీ చీరలెందుకు నీకు—నువ్వు కట్టుకునేసరికి ఇంకా మంచిరకాలు వస్తాయి. ఇది నేనే తీసుకుంటాను.' అంటూ చెల్లెలితో తగూకి దిగింది సురేఖ.

'ఇంతకన్న మంచిచీరలు నాకేం అక్కర్లేదు ఇదే కావాలి—ఎప్పుడైనా సరదాకి కట్టుకుంటాను—నువ్వు మరోటి తీసుకో' అంటూ ఆ కాశ్మీరు సిల్కుచీర ఒడిలో పెట్టుకు కూర్చుంది ఉమ.

'పనిలేకపోతే సరి. ఇప్పుడు నీకు చీరెందుకు.' అంటూ అప్పుడప్పుడు చిన్న కూతుర్ని మందలించే వర్ధనమ్మగారు కూడ ఆవేళ,

'పోనీలే సరదా పడుతోంది—తీసుకోనీ—నువ్వింకేదయినా ఏంచుకో.' అంటూ

సురేఖకే నచ్చచెప్పబోయింది.

'అసలు నాకేమీ అఖ్కర్లేదు' అంటూ కోపగించుకుని లేచి వెళ్ళిపోయింది సురేఖ.

'అచ్చంగా అలాంటి ప్రింటుదే మరోచీర షాపులోకూడ లేద'ని ఆ అబ్బాయి చెప్పటం వల్ల ఆవిడ తనకి నచ్చిన చీరేదో తీసుకుని మిగిలినవి షాపుకి పంపించేసింది.

పుట్టినరోజు నాడు మూతి ముడుచుకుని కూర్చున్న మనవరాలిని బతిమాలి ఎలాగో తలంటి నీళ్ళుపోసుకునేలా చేసింది కామాక్షమ్మగారు—ఆ తరువాత ఎవరు చెప్పినా సురేఖ తన పట్టు విడవలేదు తల్లికొన్న కొత్తచీర కట్టుకోలేదు. ముసలావిడ ప్రాణం వుసూరుమనిపించి.

'పోనీ, పెద్దది, సరదావడింది—దాన్నే తీసుకోనివ్వకపోయావా ?' అనటం, దాంతో ఉమ భోరుమని ఏడుస్తూ,

నాకేం అఖ్కర్లేదు ఇంతోటి చీర—దాన్నే తీసుకోమనండి,' అంటూ పెట్టె తెరచి చీర బైట గిరవాటు పెట్టటం అంతా ఓ గొడవ అయింది—ఆ రాద్ధాంతం అంతా విని అసలుసంగతి ఏమిటి అని అడిగి తెలుసుకున్న రమణమూర్తిగారు,

'నీకు బోలెడు చీరలున్నాయిగా, చెల్లాయి సరదాపడి తీసుకుంటే ఇంత గొడవ చెయ్యాలా — యినా ఉమ పచ్చగా వుంటుంది కనక ఆ రంగు, ప్రింటు దానివంటికి బాగుంటుంది—నీకు అమ్మ తీసిన లేతరంగు చీరే బాగుంటుంది.' అంటూ తననే మందలించటంతో సురేఖకి పుట్టెడుదుఃఖం ముంచుకు వచ్చింది.

'నువ్వు అందంగా వుండవు-నీ మొహానికి ఈ చీర చాల్లే' అని ఈసడించి పారేసినట్లే అనిపించింది ఆ పిల్ల ప్రాణానికి. అందంగా ఆకర్షణీయంగా వుండే సంతానం అంటే తలిదండ్రులకి ప్రేమాభిమానాలు ఓపాలు ఎక్కువగానే వుంటాయి అనిపించింది.'

అదంతా తలుచుకుంటూ ఆలోచిస్తూ పడుకున్న సురేఖకి అంత దిగులులోనూ కాస్త ఓదార్పు కలిగినట్లయింది. 'పోనీలే—ఇదీ మంచిదే—అమ్మా నాన్నగారు పట్టుదలగా నన్నే చేసుకోమనటం చివరికి బావ నాటంటే నా కక్కర్లేదు అనిపించుకోటం మరీ ఘోరంగా వుండేది.' అనుకుంది.

అయినా బావకి నాకూ ఒకప్పుడు

# సురేఖాపరిణయం

మాత్రం సరిపడిందా—ఎప్పుడూ ఎందుకో అందుకు తగూలాడుకోటం తోనే సరిపో యేది—తనకింకా బాగా జ్ఞాపకం, తన కప్పుడు పన్నెండేళ్లుంటాయేమో—పిల్లలంతా కూర్చుని సరదాగా ఖబుర్లు చెప్పుకుంటూండగా ఏంతోచిందో 'సురేఖా, నువ్వు కొబ్బరి పీచుపెట్టి ఒళ్లు రుద్దుకోరాదు కాస్త తెల్లబడతావేమో.' అన్నాడు బావ నవ్వుతూ. పిల్లలంతా ఫక్కుమని నవ్వటంతో తను లేచి వెళ్లిపోయి ఏడుస్తూ పడుకుంది.

'బావ సరదాకేదో అంటే ఏడుస్తావా' అంటూ అత్తయ్య తనని ఓదార్చబోయింది.

'అసలదేమిటో. మా ఇంట్లో వాళ్లందరికీ హాస్యాలు చెయ్యటం అలవాటు — మీ మామయ్యా అంతేగా.' అంటూ గొప్పగా చెప్పుకుంది తమ ఇంట్లోనే ఈ హాస్యరసం అవేది పుట్టింది అన్నట్లు.

'హాస్యంట—హాస్యం'. ఆ సంఘటనని తలుచుకుంటూ అప్పుడు కూడ పళ్లు పట పట లాడించుకుంది సురేఖ.

హాస్యం అంటే మల్లెపూల సౌరభంలా, మంచి గంధపు పరిమళంలా హృదయానికి మృదువుగా తాకి మనస్సుని ఆహ్లాద పరచాలి కాని ఇలా మనస్సులు నలిగిపోయి అంతరంగం విలవిల్లాడి పోయేలా చేసేది హాస్యం అనిపించు కుంటుందా? హాస్యం పేరుతో ఎదుటిమనిషి మనస్సు నొప్పించే మాటలు అని తను సంబరపడ గలగటమే ఓ ఘనకార్యమా — అయినా అదేమిటో అంతటి హాస్యప్రియుడు ఎదుటివాడు మళ్లీ తిరిగి తనని ఒకమాటఅంటే భరించ లేడు. బావా అంతే, మామయ్యా అంతే. వచ్చినప్పుడల్లా నాన్నగారిని ఏదో ఒకటే అంటూనే వుంటాడు మామయ్య — అని, తన హాస్యానికి తనే మురిసిపోతూ ఫెళ్లున నవ్వేస్తూంటాడు—నాన్నగారు మళ్లీ నవ్వుతూనే ఏదైనా అనేసరికి మాత్రం మూతి ముడిచేసుకుని రుస రుస లాడిపోతూ ఆ కోపంఅంతా అత్తయ్యమీద చూపించేస్తాడు అలా అల్లుడికి ఎక్కడ కోపం వచ్చిపోతుందో అని అగ్గగ్గ లాడిపోతూ మామ్మ ముందునుంచీ నాన్నగారి నోరు నొక్కుతూనే వుంటుంది—అవాళ్టి కవాళ బావ అన్న మాటలకి ఓ చెంప ఏడుస్తూనే 'గుడ్డి కొక్కిరాయిలా నీ అందం మహా బాగుందేమిటి' అనేసింది తను. దాంతో అత్తయ్యకీ బావకీకూడ కోపాలొచ్చాయి.

ఏమిటో చిన్నప్పుడే కలవని మనస్సులు పెద్దయాకమాత్రం ఎలా లతుకుతాయి— అయినా ఏమిటీ వెర్రి—బావే కావాలని నా మనస్సేం తహ తహ లాడిపోవటం లేదు, అతను తప్ప ఈ లోకంలో మరి పెళ్లి కొడుకులే లేరా—ప్రపంచమేం గొడ్డుపోలేదు —అన్నివిధాల బావని తలదన్నేవాడే దొరుకుతాడు నాకు—' మనస్సులో ఓ ప్రక్క తగిలిన గాయాన్ని మాన్పుకోవానికి మరో ప్రక్కనుంచి కొత్త నమ్మకాలని విశ్వాసాలని ఏర్పరుచుకుంది సురేఖ.

రుక్మిణమ్మ వూరికి వెళ్లబోయేముందు మరో సూచన కూడ చేసింది. 'ఉమని అలా వూరికే ఇంట్లో కూర్చోపెట్టటం దేనికి, మళ్లీ చదివించండి — పెళ్లి అయినా, ఇప్పుడు వూరూరా కాలేజీలు వుండనే వున్నాయి కనక చదువు మానక్కరలేదు అంతగా లేకపోతే ప్రైవేటుగా చదువుతుంది — అబ్బాయి సరదా పడుతున్నాడు,' అంటూ.

'అలాగే, దానికేం భాగ్యం,' అంటూ ఇంటిల్లపాదీ అంగీకారం తెలియజేశారు.

వెళ్లబోయే ముందు ఆడబిడ్డకి బొట్టుపెట్టి వరలక్ష్మమ్మ ఇచ్చిన చీర రవికలగుడ్డ కాబోయే వియ్యపురాలి హోదాకి తగినట్లే వున్నాయి. పసుపులు కుంకాలు కూడ అదివరకటి కంటె ఎక్కువెక్కువగానే మూటలు కట్టి ఇచ్చింది—అన్నయ్యగారికి ఇష్టం అంటూ ఇన్ని కాజాలు చేయించింది. తీపితోపాటు కారం కారంగా నములటానికి కారబ్బూంది దూయించింది ఎత్తుకి ఎత్తు జీడపప్పు వేసి.

ఆవిడ్ని వీధి గుమ్మం దాకా సాగనంపుతూ 'శలవల్లో రామకృష్ణని తప్పకుండా పంపించమని' మరీ మరీ చెప్పారు కామాక్షమ్మగారూ, రమణమూర్తి దంపతులు కూడ.

'నేను పంపేదేమిటి వాడే వస్తాడు— ఎవరి కోసమని,' అంటూ గడప అవతలే నిలబడిపోయిన ఉమని చూసి నవ్వి, రిక్షా ఎక్కి కూర్చుందావిడ.

ఆవిడ మాట ఇచ్చిందని వూరుకోకుండా— రామకృష్ణ వచ్చాడని తెలియగానే— రమణమూర్తిగారు బావగారి పేర మర్యాదగా పుత్తరం కూడ వ్రాశాడు శలవలే కనక అందరూ రావలసిందని కోరుతూ.

'నాకు ఆరోగ్యం సరిగ్గా వుండటం లేదు మీ వూళ్లో ఎండలు మరీ ఎక్కువ — అందుకే ఇక్కడే విశ్రాంతి తీసుకోవా లనుకుంటున్నాను. మరి మీ చెల్లెలు కూడ రావటానికి వీలుకాదు — మీ మేనల్లుడొచ్చి నాలుగురోజుల పాటు వుండివస్తాడు.' అని జవాబు వచ్చింది ఉమామహేశ్వరం గారి దగ్గర నుండి. (ఇంకా ఉంది)






బులుసు వేంకటరమణయ్య

సంసార సంబంధం వున్నప్పుడే సుఖ దుఃఖాలు కలుగుతాయి. అవి కలగకుండా వున్న స్థితే ముక్తి. అవి కలగకుండా వుండాలంటే పునర్జన్మ లేకుండా వుండాలి. లోకంలో దేనితోటీ తనకెట్టి సంబంధమూ లేకుండా ఉన్నప్పుడే మోక్షాన్ని పొందడానికి సాధ్యం అవుతుంది. అలా లేనప్పుడు మహామునులయిన వారికి కూడా ముక్తి లభించదు. దీనికి జడ భరతుని వృత్తాంతమే మనకు తార్కాణం.

భరతుడనే రాజా వుండేవాడు. అతడు చాలాకాలం రాజ్యం పాలించి, పుత్రులకు రాజ్యాన్ని పంచి యిచ్చి వార్ధకంలో ముని వృత్తిని అవలంబించి పులహాశ్రమంలో ముక్తినికోరి తపస్సు చేస్తూ ఉన్నాడు. ఒకనాడు గర్భవతి అయిన జింక, నదిలో నీళ్ళు తాగుతూ వుండగా భయంకరమైన సింహ గర్జన వినబడింది. హరిణి ప్రసవించి, వెంటనే మరణించినది. స్నానం చేస్తున్న భరతుడు దీనినిచూచి, జాలిపడి జింక పిల్లను తన ఆశ్రమానికి తీసుకువచ్చి పెంచుతూ వున్నాడు. అతనికి దానిపై గాఢమైన ప్రేమ కలిగింది. జింకపిల్ల కనబడకపోతే ఎంతో బాధపడేవాడతడు. చివరకు మరణ సమయంలో కూడా దానినే తలుచుకొంటూ ప్రాణాలు విడిచాడు. దానికి ఫలంగా అతడు జింక పిల్ల అయి పుట్టాడు. అయినా పూర్వ జ్ఞానం వుండడంవల్ల, తన హరిణజన్మకు కారణం తెలుసుకుని, చాలా విచారించి, నిర్లిప్తుడై ఒంటరిగా తిరుగుతూ కొంత కాలానికి మృగ దేహాన్ని విడిచి, పుణ్య పరిపాకంవల్ల అంగిరసుడనే బ్రాహ్మణుడికి పుత్రుడుగా జన్మించాడు. భరతుడికి సవతి సోదరులు చాలామంది వుండేవారు. తండ్రి మరణానంతరం వారు భరతుణ్ణి చాలా హింసించేవారు. పూర్వ జ్ఞానం గల భరతుడు నిర్లిప్తుడై, సుఖదుఃఖాలను సమానంగా చూస్తూ, ఏది పెట్టినా తింటూ, దేహాభిమానం విడిచి, చెప్పిన పనులన్నీ చేస్తూ వుండేవాడు.

ఒకనాటి రాత్రి భరతుడు చేనికి కావలి కాస్తూ వుండగా వృషల రాజు సేవకులు కాళికి బలియివ్వడానికి యితనిని తీసుకుపోయారు. ఇతన్ని బలి యివ్వనుండగా, భద్రకాళి, వాళ్ళను చంపి, యితన్ని కాపాడింది. ఇతడు దేనినీ పట్టించుకోలేదు. తిరిగి కావలి కాయడానికి పొలానికి వచ్చాడు. ఒకప్పుడు రహూగణుడనేరాజు తత్త్వ విజ్ఞానం కోరి కపిల మహాముని దగ్గరకు పల్లకిలో ఆ దారిని పోతూ వుండగా బోయీలు 'ఇతనిచేత పల్లకి మోయింతాము' అని తలచి, భరతుణ్ణి తెచ్చి, ఇతని భుజంమీద పల్లకి దండేన్ని ఉంచారు. భరతుడు తక్కినవారితో సమంగా నడవలేనందున రహూగణునికి కొంత బాధ కలిగి, భరతుణ్ణి తిడుతూ తన అధికార గర్వాన్ని చూపాడు. అప్పు డాత్మజ్ఞాని అయిన భరతుడు తనకు దూషణ భూషణములతో పని లేదనీ, ఆత్మకు దేనితోనూ సంబంధం లేదనీ, నీవే శిక్ష విధించినా, తనయెడ నిష్ప్రయోజనమని చెప్తూ, రాజు అహంకారం అణగేటట్లు తత్త్వాన్ని తెలియజేశాడు. అప్పుడు రాజు తన తప్పు తెలుసుకుని పల్లకి దిగి, భరతుడికి సాష్టాంగ నమస్కారం చేసి, తన తప్పు క్షమించాలని కోరాడు. తన ధర్మసందేహాలను తెలిపి, భరతుడివల్ల తగిన సమాధానాలు పొంది ఎంతో తృప్తి పొందాడు.

భరతుడు శిబిక మొయ్యడానికి కారణం నిర్లిప్తుడై, ఎవరు ఏమి చేసినా సహించి వూరుకోడమే! కష్ట సుఖాలను రెంటినీ సమాన దృష్టితో చూస్తూ, నిర్లిప్తుడయి ఉండడంవల్ల, అతనికి పుణ్య, పాపాలు రెండింటితోనూ సంబంధం లేకుండా పోయింది. కష్టసుఖాలను సరి సమానంగాచూచి, పుణ్యంతో కాని, పాపంతో కాని సంబంధం లేకపోవడంవల్లనే ఆయన అంగిరస, పుత్ర జన్మలో తరించి ముక్తిని పొందినాడు! ●





కానిస్టేబులు కనకయ్య అప్పలసామి కాకాహోటల్లో దూరాడు టీ నీళ్ళు తాగటానికి. అప్పలసామి హోటలు ఆ సెంటరుకు మంచి పేరుంది. ఎప్పుడూ రద్దీగా వుంటుంది. టీ కలపటంలో అతని హస్త వాసి మంచిదంటారు. అప్పు పెట్టకుండా ఎప్పటికప్పుడే పదిపైసాలు యిచ్చేస్తే అమృతంలాంటి టీ, అప్పు అని తెలిస్తే ఉప్పగావుండే టీ ఇస్తాడు. అందువల్ల అమృతం కావాలనుకున్నవారు పదిపైసాలు యిచ్చేస్తారు. కనకయ్య రావటం గమనించనట్టుగా అప్పలసామి తనపని తాను చేసుకుంటూ మనస్సులో గొణుక్కున్నాడు. ఇలా నటించటం అప్పలసామికి అలవాటు కనకయ్య వచ్చినపుడల్లా. అందుకు కారణం లేకపోలేదు. కనకయ్యకు పదిసార్లు ఆ టీ నీళ్ళు తాగటం అలవాటు వుంటే వుండవచ్చుగానీ, అతనికి ఆ పదిసార్లు మరొకచోట తాగటం అలవాటు లేకపోవటం అప్పలసామికి యిబ్బందిగా వుంది. అతని పాలిట కనకయ్య నిత్య ఖాతాదారుడు. అప్పలసామికి ఖాతాదార్లకు టీ యిచ్చినపుడు తప్పకుండా డబ్బులు పుచ్చుకునే ఆనవాయితీ వుందిగాని, అందరితోపాటు యిచ్చే అలవాటు కనకయ్యకు లేదు. అందుకే అప్పలసామి కనకయ్య వస్తే చూడనట్టు నటిస్తాడు.

'స్ట్రాంగు టీ కలపవోయ్ అప్పలసామీ!' బెంచీమీదకూచుని టోపీని ప్రక్కన పెట్టుకుని మొహం రుమాలుతో తుడుచుకుంటూ అన్న కనకయ్యను చూడగానే అప్పలసామికి ఒళ్ళు మండిపోయింది.

''బాబుగాడిసొమ్ము యిక్కడ దాచిపెట్టినట్టు అడుగుతున్నాడు'' అనుకున్నాడు అప్పలసామి. 'పంచదార తెప్పించాలి ఓ నాలుగు రూపాయలు యిలా పడేయ్ కనకయ్యా! ఫస్టుక్లాసయిన టీ కలుపుతాను' అన్నాడు అప్పలసామి. పాతబాకీ పదిహేను రూపాయల్లో కొంతయినా కక్కకపోతే టీ యిచ్చేది లేదు' అని వాడి అర్థం అని కనకయ్యకు తెలీక పోలేదు. నిజం చెప్పాలంటే అప్పలసామికి కనకయ్య బాకీ వసూలుచేయక పోయినా యిబ్బందిలేదు! కనకయ్యలాంటి వాళ్ళు యికముందు రాకుండాపుంటే అతను పగలు అప్పలసామి. సాయంకాలంనుండి అప్పలసామి తనపేటలోని వాళ్ళకు.

'సాయంకాలం నీ మొత్తం బాకీ పారేస్తాను. కలుపప్పలసామీ! నీ బాకీ తీర్చలేక

బంగారంలాంటి వుద్యోగం మానుకుని ఎటో పారిపోతాననుకున్నావా ?' అన్నాడు కనకయ్య టీ యివ్వడేమోననే భయంతో. అతనిది బంగారంలాంటి వుద్యోగం కాబట్టి సరిపోయింది. లేకపోతే అంతపనీ చేయటానికి కావలసినంత సంసారంవుంది. కానీ చూస్తూ చూస్తూ అంత మొత్తం తీర్చటానికి చేతులు రావు, ప్రాణం ఒప్పుకోదు మరి. అందుకే సాయంకాలం...రేపు...బాకీ... లాంటి పదాలు వుపయోగిస్తూ వుంటాడు, అప్పలస్వామి అడిగినప్పుడు.

'అదేం కుదరదు కనకయ్యా ! తీర్చే అప్పు పదివేలైనా యివ్వవచ్చుగాని, తీర్చని అప్పు పదిపైసలు ఇవ్వటం ఎందుకు చెప్పు ?' అన్నాడు అప్పలసామి.

'మరేం ఫరవాలేదు అప్పలసామీ ! ఒకూళ్లో వుంటున్న వాళ్లం, నువ్వు యెక్కడికిపోవు, నేనూ యెక్కడికీ పోనూ! మనయిద్దర్ని వదిలి యీ వూరు యిచ్చి పుచ్చుకోవటాలూ పోవు' ఎంతో లౌక్యంగా అంటుంటే అప్పలసామి కడుపుడికి పోయింది.

'చూడు కనకయ్యా ! నీ బాకీ మొత్తం తీరిపోయేమార్గం ఒకటి చెబుతాగాని చేస్తావా ?'

'అయితే చెప్పు ! వెంటనే చేస్తాను.' కుతూహలంగా అంటున్న కనకయ్యకు ఒక గ్లాసు టీ యిస్తూ అన్నాడు అప్పలసామి. 'ఈ టీ తాగి మళ్లీ యీ హోటలుకు రాకు. అలా చేశావంటే నీబాకీ మొత్తం ఇచ్చేసినట్టే లెక్క రాసుకుంటాను.'

టీ తాగుతున్న కనకయ్యకు నాలిక చురుక్కుమంది. తెల్లబోయాడు. తల కొట్టేసినంత పనయింది. ఈసడిస్తూ చూస్తున్న అప్పలసామిని మింగేయాలన్నంత కోపం వచ్చింది. ఆతరవాత దిగులు వేసింది. 'రేపటినుంచి తన గతేంగాను ? వెధవది ఒక్క పదిరూపాయలుంటే బావుణ్ను! వాడిమొహాన్ని కొట్టి పారేద్దును. ఇంక ఎప్పుడూ అంత యీసడింపుగా మాట్లాడకు అప్పలసామీ అని దబాయించి పారేద్దును' అనుకున్నాడు కనకయ్య.

'నువ్వు ఎంతయినా చెప్పు అప్పలసామీ ! నీచేతి టీ మాత్రం అమృతమే. నువ్వు ఎన్నిమాటలు అన్నా దానిరుచి ఎక్కడికి పోతుందోయ్ !' అంటూ అతనిచ్చిన పంచదారలేని టీ తాగి 'సాయంకాలం నీబాకీ సర్దుబాటు చేసేస్తాను అప్పలసామీ' అంటూ అక్కడనుండి బయటపడ్డాడు. పది రూపాయలు ఎలాగైనా చూడాలనే వుద్దేశంతో, ఎవరైనా రాంగుసైడు రైడర్సు, డబుల్సు రైడర్సు దొరుకుతారేమోనని చూడసాగాడు.

* * *

కడుపులో కాలుతున్న ఆకలి, పెనవేసుకుంటున్న గడియారం ముల్లులు ప్రకాశరావును తొందరపెట్టాయి. అతను తలెత్తి కౌంటరులోంచి చూశాడు యూనివర్సిటీ ఎగ్జామినేషన్సుకు ఫీజుకట్టే సమయం అవటంవల్ల బేంకు చాలా రద్దీగా వుంది.

'ఇదిగో అబ్బాయ్ ! చలానా వెనకాల నీ అడ్రసు వ్రాయటం మర్చిపోయావు' ప్రకాశరావు విసుక్కుంటూ కౌంటరులోంచి చలానా అందించాడు. ఆ అబ్బాయి దాన్ని తీసుకుని అడ్రసు వ్రాయసాగాడు. ప్రకాశరావు అతన్ని పరిశీలనగా చూశాడు. పల్చని తెల్లని మొహం, బెదురు చూపులు చూస్తున్న కళ్లు, ప్రపంచ జ్ఞానంలేని అమాయకత్వం, వేషంలో పేదరికంతో, సన్నగా చెరుకుగడలా వున్నాడు.

'నీ పేరేమిటి ?' అడిగాడు ప్రకాశరావు అతనిమాటలు యెలావుంటాయో అని తెలిసికోవటానికి.

'జగ్గు ... జగన్నాథం.' వ్రాస్తున్నవాడల్లా తలెత్తి ప్రకాశరావుని చూసి అన్నాడు, మొదట జగ్గుఅని అన్నందుకు సిగ్గుపడుతూ.

'ఏ పరీక్షకు వెళుతున్నావు ?'

'పి. యూ. సీ. అండి ! మొన్న పరీక్షలో ఒక పార్టు తప్పాను. ఇప్పుడు మొత్తం కడుతున్నాను' అడ్రసు వ్రాసి యిచ్చాడు జగన్నాథం. అతని మాటలు విన్న తరవాత,

'ఈ అబ్బాయి నాటకాల్లో ఆడపిల్ల వేషానికి బాగా సరిపోతాడు.' అని అనుకున్నాడు చలానా తీసుకుని సరిగ్గా పూర్తి చేశాడో లేదోని చూసుకుని 'డబ్బు యిటివ్వు' అన్నాడు. జగన్నాథం కాళ్ళు మునివేళ్లమీద నిలుచుని కౌంటరుమీద వుంచిన నాలుగు పదిరూపాయల నోట్లను తీసుకొన్నాడు. వాటివైపు ప్రకాశరావు పరీక్షగా చూసి, జగన్నాథాన్ని పిలిచాడు.

'ఈ డబ్బు ఎవరిచ్చారు నీకు ?' అమాయకంగా తనవేపు చూస్తున్న అతన్ని జాలిగా చూస్తూ అన్నాడు.

ఈ ప్రశ్న ఎందుకు అడిగాడో జగన్నాథానికి అర్థం కాలేదు. 'మా అమ్మ' అన్నాడు.

'మీ తల్లిగారు ఏం చేస్తుంటారు ? వారికీ డబ్బు ఎలా వచ్చింది ?'

ఈ సారి జగన్నాథానికి విసుగు కోపం వచ్చాయి. 'ఇవన్నీ యితని కెందుకు ? తన తల్లి ఏంచేస్తే యితనికి ఎందుకు ?' అనుకున్నాడు.

అతను మాటాడక పోవటంతో ప్రకాశరావే తిరిగి అడిగాడు. 'మీ నాన్నగారేం చేస్తుంటారు ?' ఆ ప్రశ్నతో జగన్నాథానికి కళ్ల నీళ్లు తిరిగాయి. 'తాలూకాఫీసులో ప్యూపిస్టు. కానీ ఇప్పుడు లేడు. చనిపోయి ఆరు నెలలయింది.' అని తల ప్రక్కకు తిప్పుకొని కన్నీళ్లు తుడుచుకున్నాడు. అది వినగానే ప్రకాశరావు మనస్సు చివుక్కుమంది. గడియారం ఒంటిగంట కొట్టడంతో దాదాపు మిగతా కౌంటర్లు అంతా కాంటీనుకు వెళ్లిపోయారు. ప్రకాశరావుకూడా అన్నీ సర్దుకుని జగన్నాథం ఇచ్చిన నాలుగు పదిరూపాయల నోట్లు, చలానా జేబులో వేసుకుని బయటకు వచ్చాడు.

'ఇదిగో జగన్నాథం ! నీతో మాటాడాలి అలా వెళదాం రా !' అంటూ అతని భుజంమీద చేయి వేసి నడిపించుకుపోయాడు. అతను కాంటీనుకు పోవటానికి మనస్కరించలేదు. హోటల్ అజంతాలో అడుగు పెట్టాడు. జగన్నాథానికి యిదేం అర్థం కాలేదు. 'డబ్బు కట్టుకోకుండా తనతో మాటాడాలంటాడేమిటీయన!' అనుకున్నాడు. ప్రకాశరావు టిఫినుకు అర్డరిస్తున్నపుడు వద్దని చెప్పలేక పోయాడు.

'చూడు జగన్నాథం. ఇవన్నీ అడుగుతున్నానని ఏమీ అనుకోకు. మీ నాన్నగారు పోయిన తరవాత మీకెలా గడుస్తోంది ? నీ చదువుకు యీ డబ్బెలా వచ్చింది ?'

అతను ప్రకాశరావు వైపు ఒకసారి చూసి అన్నాడు 'మా నాన్నగారు పోయిన తరవాత మాఅమ్మ ఒక ప్లీడరుగారింట్లో వంటపనిచేస్తూ నన్ను చదివిస్తూ వుంది. నా తరవాత ఒక చెల్లెలు మాత్రమే వుంది.

నేను ఈ పరీక్ష పాసయితే ప్లీడరుగారే ఏదో వుద్యోగం ఎక్కడైనా యిప్పిస్తా నన్నారు.'

'మరి నీ పరీక్షకు డబ్బు ఆ ప్లీడరు గారే ఇచ్చారా ?'

'లేదండి. మా అమ్మ ఎవరి దగ్గర నుండో అప్పుగా తీసుకువచ్చింది.'

'అలాగా' అంటూ సర్వరు తెచ్చిన టిఫిను ప్లేటు ఒకటి తాను తీసుకుని రెండోది జగన్నాధానికి పెట్టాడు. అతను ఆతృతగా తింటుంటే ప్రకాశరావుకు చాలా జాలి వేసింది.

'చూడు జగన్నాధం. నువ్వుతెచ్చిననాలుగు వందరూపాయల నోట్లలో ఒకటి చెల్లదు.' అతను ఉలిక్కిపడి ప్రకాశరావును చూశాడు. 'ఎందువల్లండి !'

'అందులో ఒకటి దొంగనోటు.'

ఆ మాటతో జగన్నాధం మొహంమీద చెమటలు పోశాయి. అ త ని కళ్లముందు ఒక్కసారి పోలీసులు, త న కు బేడీలువేసి తొక్కుపోవటం, తనతల్లి చెల్లెలు ఏడ వటం వంటి దృ శ్యా లు కదిలాయి. తింటున్న టిఫిను ప్ర క్క కు తోసేశాడు. 'నాకేం తెలిదండి. అది దొంగనోటని నాకు తెలిదండి !'

అతని చేత బుగ్గలమీద నిలుచున్న కన్నీరును చూసి ప్రకాశరావుకు నవ్వు

# పరిభ్రమణం

వచ్చింది. 'పిచ్చివాడివిలా వున్నావే. ఎందు కలా బెంబేలు పడతావు. అది దొంగనోట న్నానుగాని నిన్నేం అనలేదే. ముందాటిఫిను తిను. ఇంత పిరికివాడివి అయితే ఎలా?'

కానీ జగన్నాధానికి టిఫిను సహించలేదు. ప్రకాశరావుమాటలు పూరడింపు కలిగించ లేదు.

'జగన్నాధం ఇప్పుడు యీనోటు తీసు కుంటే చాలా చిక్కులు రావచ్చు. ఈ విషయం మా ఏజెంటు వరకు పోతుంది. వారు వచ్చి నిన్ను చాలా ప్రశ్నలు వేస్తారు. అయినా నీకేం ఫరవాలేదు. నా ఉద్యోగ ధర్మం ప్రకారం ఇటువంటి కరెన్సీ తీసుకు వచ్చిన వాళ్లను గవర్నమెంటుకు అప్పగిం చాలి. కానీ నీవు వొట్టి అమాయకుడిలా వున్నావు. ఇది పొరపాటుగా నీ దగ్గరకు వచ్చింది కాబట్టి అన్యాయంగా నీవు ఇందులో ఇరుక్కోవటం ఎందుకు? పోనీ నా దగ్గర వుంచుకుంటే ఉద్యోగ రీత్యా అది చాలా నేరం అవుతుంది.'

'అయితే నేను పరీక్షకు వెళ్లటానికి వీల్లేదంటారా?' అని దిగులుగా అంటుంటే ప్రకాశరావుకు జాలి నవ్వు కలిగాయి.

'ఎందుకు వీల్లేదు'?

'ఫీజు కట్టందే ఎలా వీలవుతుంది?'

అమాయకంగా అంటుంటే అతనికి నవ్వు వచ్చింది. 'ఇంటికి వెళ్లి మరో నోటు తీసుకు రావయ్యా! అప్పుడు ఫీజు కట్టవచ్చు. ఇంత అ మా య కు డ వి పి. యు. సి. ఎలా చదువుతున్నావు?'

ఆ మాటకు జగన్నాధం చిన్నబుచ్చు కోలేదు. 'మా యింటి పరిస్థితి మీకు తెలీదు. ఈ డబ్బు అప్పుగా తీసుకు రావ టానికి మా అమ్మ ఎంత శ్రమపడిందో మీకు తెలీదు. మీబోటి వారు వందరూపా యలు అప్పుగా తీసుకు రావటం చాలా తేలి కగా వుంటుంది, కానీ మా పరిస్థితి తెలి సిన వారు ఎవరూ పదిపైసలు అప్పుగా ఇవ్వరు. నేను చాలా దురదృష్టవంతు ణ్ణండి! ఎంతో కష్టపడి పాసవుతానను కున్నప్పుడు పరీక్షల సమయంలో మా నాన్నగారు పోవటం జరిగింది. రెండవసారి ఎలా అయినా పరీక్షకు వెళదామనుకుం టుండగా యీ అవాంతరం వచ్చింది, ఈ సారి గూడా పరీక్షకు వెళ్లే ప్రాప్తం లేక పోయింది. నా అంత దురదృష్టవంతుడు మరొకడు వుండడు.'

జగన్నాధం మొహం చేతో కప్పుకుని భోరున ఏడుస్తూ అంటుంటే ప్రకాశరావు హృదయం ద్రవించి పోయింది. భగవంతుడు తెలివి తేటలున్నవాడికి అవకాశాలు ఎందుకు ఇవ్వడో అని అనుకున్నాడు 'చూడబ్బాయ్! పరీక్షఫీజు గురించి నీవేమాత్రం విచారిం చకు. మిగిలిన డబ్బు వేసి ఫీజు కడతానులే. నీలాంటి తెలివైన వారికి సహాయం చేయటం కన్న మించినది ఏముంది? ఇంటికి పోయి చదువుకో! ఇదిగో! ఈ నోటు తీసుకుపోయి అది ఎవరి దగ్గర నుండి అప్పుగా తీసుకు వచ్చారో వారికే యిచ్చి వేయి. సాయంకాలం నాలుగింటికి బేంకుకు వస్తే చలానా యిస్తాను.' అన్నాడు ప్రకాశరావు.

జగన్నాధం అతని వైపు కృతజ్ఞత తోను ఆశ్చర్యంతోను చూశాడు. కళ్లల్లో భయం తగ్గి ధైర్యం కలిగింది.

'కాఫీ చల్లారిపోయింది. మరొకటి చెపుతానుండు' అంటూ అతను వద్దం టున్నా మరో కాఫీ చెప్పాడు సర్వరుకు.

'జగన్నాధం నాకు టయిం అయింది. నే వెళతాను. సాయంకాలం నాలుగింటికి నా దగ్గరకు రా!' అంటూ ప్రకాశరావు



లేచాడు బిల్లు తీసుకుని. అతను వెళ్ళగానే జగన్నాథం కాఫీ పూర్తిచేసి లేవబోయాడు, చేతిలో వున్న పదిరూపాయలనోటును పాంటు జేబులో వుంచుకుంటూ.

'కూచో నీతో పనుంది:' అంటూ ఒక చేయి జగన్నాథాన్ని కూచోబెట్టింది. అతను ఎవరాని వెనక్కు తిరిగబోతుండగా, తన ముందు కుర్చీలో కూచున్న కానిస్టేబులు కనకయ్యను చూడగానే జగన్నాథం కాళ్ళు గడగడ వణకసాగాయి. పెద్ద బుగ్గమీసాలు, నల్లని మొహం ఎర్రచారలు గల కళ్ళు అంతకన్న భయంగా తలమీద ఎర్రని టోపీని చూడగానే అతని శరీరం చమటలు పట్టసాగింది.

'ఇప్పుడు నీతో కాఫీ తాగినతను ఎవరు? ఏమిటి విషయం.' కనకయ్య దూకుడుగా అడుగుతూ వుంటె జగన్నాథానికి పై ప్రాణాలు పైనే పోయినంతపనయింది. ఏమీ చెప్పలేక తడబడ్డాడు.

'అతనేం అన్నదీ నాకు పూర్తిగా తెలుసు. ఆ తెర వెనక వుండి అంతా విన్నాను.' అన్నాడు ఏదో గొప్ప విషయం విన్నట్టుగా.

పొర్లి వస్తున్న దుఃఖాన్ని ఏడుపును ఆపుకొని అన్నాడు. 'నాకేం తెలీదు. దీన్ని మీరే తీసుకోండి.' అని జేబులోంచి పది రూపాయలనోటు యిచ్చేశాడు. 'ఇది దొంగ నోటు అని మా అమ్మకు తెలీదు. తెలిస్తే పుచ్చుకునేది కాదు. నన్ను మాత్రం ఏం చేయకండి.' అన్నాడు భయాన్ని దాచుకుంటూ.

'జగన్నాథం! మీ ఇల్లెక్కడ?' నోటు అందుకుని అడిగాడు యే మాత్రం బింకం వొడక్కుండా.

'చావడి వీధిలో.'

'ఏం చదువుతున్నావు'

'పి. యూ. సి'

'పీ. యూ.-సీ. చదువుతున్నవాడివి దొంగనోటు కనిపిస్తే దాన్ని గవర్నమెంటుకు అందజేయాలని తెలీదూ!' ఇంకా దబాయించసాగాడు.

'తెలీదండి. కానీ మీకే యిచ్చేశానుగా.'

'సరే వెళ్ళు'.

కానీ అతను అక్కడనుండి కదల్లేదు.

'ఏం యింకా నిలుచున్నావు?'

'మరి నన్నేం చేయరుగా!'

'నీకేం ఫరవాలేదు లే. పో!'

'హమ్మయ్య' అనుకుంటూ ఒక్క దూకులో హోటలునుండి బయటపడిన జగన్నాథాన్ని చూసి కనకయ్య నవ్వుకుని 'ఇంత పిరికివాడు చదువుకోవటం దండగ' అనుకున్నాడు. ఒక్కసారి హోటలంతా కలయజూశాడు, తనను ఎవరైన గమనిస్తున్నారేమోనని. ఎవరూ లేకపోవటంతో హాయిగా బిగ్గరగా నవ్వుకున్నాడు. తలమీదున్న టోపీని తీసి ఒకసారి దాన్ని ముద్దు పెట్టుకొని ప్రక్కనున్న కుర్చీలో పెట్టాడు.

'ఎందుకుసార్! అంతగట్టిగా నవ్వారు?' అప్పుడే వరుగెత్తుకు వచ్చిన సర్వరు అడిగాడు.

'ఎందుకేమిటి? నవ్వకపోతే ఏడవమంటావా? ఎదవ మొహం నువ్వునూ! వెళ్ళి వేడివేడి జీడిపప్పు పకోడా, రెండు జిలేబీలు పట్టా.'

సర్వరు నోరుతెరిచి చూడసాగాడు కనకయ్యను.

'ఆదేంటి అలా చూస్తావు! చెప్పేది నీక్కాదూ?'

'ఇంతకుముందే కదండీ, డబ్బులు యివ్వందే కాఫీగూడా యివ్వద్దని మా ప్రొప్రయిటరుగారు చెప్పింది!'

'అదంతా నీ కనవసరం. ముందు నే చెప్పినవి పట్రా. అందరు నీకు డబ్బులు చూపించే తింటున్నారా? డబ్బుల విషయం మీ యజమాని నేను చూసుకుంటాము' విసుక్కుంటూ అన్నాడు కనకయ్య.

జిలేబీలు ఆరగించి వేడివేడి జీడిపప్పు పకోడా తింటుంటే కనకయ్యకు అప్పలసామి, వాడిహొటలు బాకీ గుర్తుకు వచ్చాయి. 'వెధవ హొటలు వాడునూ. వాడి మొహంలా వుంటుంది వాడి టీ కూడాను' అనుకున్నాడు.

కౌంటరుముందు పదిరూపాయల కాగితం పడేశాడు ఎటోచూస్తూ ధీమాగా!

'అదేంటి కనకయ్యగారూ! ఒక్క 'టీ' అరువు యివ్వమని ఇంతకుముందు అడిగారు'. కౌంటరు ఆశ్చర్యంతో అడగుతూంటే చిన్నగా నవ్వేశాడు. 'జగన్నాథం లాంటి వాళ్ళుంటే రోజుకు యిటువంటి కాగితాలు చాలా సంపాదించగలను.' అనుకుంటూ మిగిలిన చిల్లర, నోట్లు తీసుకుని బయటకు నడిచాడు బర్కిలీ పాకెట్టు కోసం. ●






ఈ మధ్య తెలుగుదేశంలో కాస్త విద్యావంతులైన యువతీ యువకులు నలుగురు కలిస్తే వారి సంభాషణలో దొర్లే అతి ముఖ్యమైన విషయాల్లో 'రచయిత్రు'లు కూడా ఒకటి. పది పదిహేనేళ్ల క్రితం వారపత్రికలను చదవటం అందులోని రచనలనుగూర్చి చర్చించటం గొప్ప అభిరుచిగా భావింపబడేది. అలాగే యిప్పుడు రచనలకన్నా ఎక్కువగా ఆయా రచయితలను, రచయిత్రులను గూర్చి మాట్లాడటం ఓ ఫ్యాషనైపోయింది. ముఖ్యంగా, యీనాడు తెలుగు దేశంలో రచయిత్రుల కున్నంత 'గ్లామర్' ఆఖరికి సినిమా తారలకు కూడా లేదంటే అతిశయోక్తి కాదేమో!

ఐతే గ్లామరున్నంత మాత్రాన యీ రచయిత్రులను అందరూ (ముఖ్యంగా పురుషపాఠకులు) గౌరవిస్తున్నారనీ మెచ్చుకుంటున్నారని భావించటానికి వీల్లేదు. 'పోన్లే పాపం ఆడవాళ్లేదో కష్టపడి వ్రాసేరు' అని ఉదారబుద్ధితో కొందరు చదివితే, ఆడవాళ్ల అభిరుచులు స్త్రీ పురుష పాత్ర చిత్రీకరణలో వారి దృక్పథం ఎలా ఉంటుందో చూద్దామన్న కుతూహలంతో చదువుతారు మరికొందరు. పోతే చాలామంది విద్యావంతులు, సాహిత్యాభిమానులు అయిన వ్యక్తులవల్ల సేకరించిన అభిప్రాయాలను బట్టి రచయిత్రులను వీరంతా మూడు తెగలుగా విభజించినట్లు తోస్తోంది. స్త్రీని ఉన్నతంగా సృష్టించి పురుషులను చేతనిగా దుయ్యబట్టేవాళ్లు మొదటి రకం. స్త్రీ పురుషులిరువురినీ ఉన్నతంగా చిత్రించి వారిచేత చిలక పలుకుల్లా గొప్పగొప్ప ఆదర్శాలను వల్లింపజేసేవారు రెండవరకం. అటు స్త్రీలను యిటు పురుషులను కూడా అవసరాన్నిబట్టి సందర్భానుసారంగా సమర్థించటం, విమర్శించటం చేసేవారు మూడవరకం.

ఇందులో మూడవరకం తెలుగు రచయిత్రులు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు. రెండవతరగతికి చెందినవారిలో చాలామంది అవివాహితలు, అనుభవంలేనివారూను. ఎటొచ్చి తెలుగు రచయిత్రులలో అధిక సంఖ్యాకులు, యీ మొదటికోవకు చెందినవారేనని పలువురి ఉద్దేశ్యం. అదీకాక యీనాడు పొగడ్తలనుకాని, తెగడ్తలనుగాని అందుకుంటూ నలుగురి నోళ్లలోనూ మెదలుతున్న రచయిత్రులుకూడా వీరే! అందువల్ల స్త్రీ పురుషపాత్ర చిత్రీకరణలో యీరకం రచయిత్రుల దృక్పథం ఎలా ఉంటుందో అది పాఠకులమీద ఎలాటి ప్రభావాన్ని చూపుతుందో పరిశీలిద్దాం.

మన రచయిత్రులను విదేశీయ రచయిత్రులతో పోల్చిచూస్తే జీవితంయెడల, కథావస్తువుయెక్క ఎన్నికలోను స్త్రీపురుష పాత్ర చిత్రీకరణలోనూ వారికీ, వీరికీ ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. దీనికి సాంఘిక పరిస్థితుల్లో వారికీ, మనకీ మధ్యగల విభేదమే ముఖ్యకారణమని తోస్తోంది నాకు. విదేశాలలో (ముఖ్యంగా అభివృద్ధిచెందిన పాశ్చాత్యదేశాల్లో) స్త్రీలకు సమస్యలనేవి ఏమైనాఉంటే అవి చాలా సున్నితమైనవీ, ఆంతర్యానికి సంబంధించినవీ మాత్రమే. అందువల్ల ఆయా రచయిత్రుల రచనల్లోకూడా 'రొమాంటిక్‌టచ్' తరచుగా కనుపిస్తూంటుంది.

కాని మనదేశ స్త్రీల సమస్యలు వేరు. ఈదేశంలో స్త్రీ అసలు మనిషే కాదు. ఐతే పురుషుడికి బానిస లేదా అతని అస్థిరపోతే ప్రపంచాన్నుండి పారిపోయే భావకవులకు, జీవితంలో గెలవలేని అర్భకులకు స్త్రీ ఒక శక్తిస్వరూపిణి, ఒక పవిత్ర సుందరమూర్తి. అదో అందమైన భావం, ఒక పాతస్! అంతే రక్తమాంసాలుగల మనిషిమాత్రం ఛస్తే కాదు.

తనని యీరకంగా హీనపరచటం ఏ స్త్రీకూడా సహించలేదు అందుకే తన వ్యక్తిత్వంకోసం తన ఉనికియొక్క గుర్తింపుకోసం ఆదికాలంనుండి భారతస్త్రీ పోరాడుతూనే ఉంది. రెండుమూడు శతాబ్దాల క్రితం స్త్రీ పురుషుని పాదాలవద్ద కాస్త చోటివ్వమని దేవురిస్తే యీనాటి స్త్రీ వేదిక లెక్కి అన్ని రంగాల్లోను పురుషుడితో సరితూగుతున్నప్పటికీ తనకి సమానగౌరవం ఎందుకివ్వటంలేదని డబాయిస్తోంది. అంతే తేడా! అడిగే పద్ధతిలో తేడా ఉన్నా ఆనాడు, యీనాడు యీదేశంలోని ఆడది అడిగే దొక్కటే! తనూ పురుషుడిలానే ఒకమనిషి ననీ, తనకీ ఆశలు ఆశయాలు అధికారాలు ఉంటాయనీ, ఉండాలనీను. ఇదే విషయాన్ని కట్టెపుల్లల పొగలో ఉక్కిరి బిక్కిరయ్యే మధ్యతరగతి స్త్రీ, తప్పతాగివచ్చిన భర్తతో తన్నులుతినే శ్రామిక స్త్రీ, విదేశాల్లో డిగ్రీలు పుచ్చుకుని క్లబ్బులకుపోయే సొసైటీ స్త్రీ తన అభిప్రాయాలను అర్థం చేసుకొమ్మంటూ ఘోష పెట్టే రచయిత్రీ... తమకు వచ్చిన భాషలో వివిధరకాలుగా వెలిబుచ్చుతున్నారు. అందుకే చాలామంది పురుషులు యీనాటి రచయిత్రులమీద సదభిప్రాయాన్ని పెంచుకోవటానికి వెనకాడుతున్నారు.

సతీ సహగమనాన్ని అమానుష కార్యంగా

గుర్తించగలిగే మానవత్వం; వితంతు వివాహాలను ప్రోత్సహించగల మంచితనం విజ్ఞానంలో, లలితకళల్లో స్త్రీ తనతో సరితూగగలదని ఒప్పుకోగల విశాల హృదయం అలవర్చుకోగల భారతపురుషుడు స్త్రీని తనలానే ఉప్పు కారం తినే మనిషిలా మాత్రం చస్తే చూడడే. ఒకవేళ యుగానికో పురుషుడు నిలబడి 'వాళ్ళుకూడా మనవంటి మనుషులేనయ్యా!' అన్నాడు. యిక మిగతవారంతా అతనిని సంఘవిద్రోహిగా శాంతి నాశకుడుగా భావించి బహిష్కరిస్తారు. ఆంధ్రదేశంలోని సమాజ వ్యవస్థకు మూలస్తంభాలవంటి అభిప్రాయాలను గడగడలాడించి తెలుగు సాహిత్యంలో ఒక గాలి దుమారాన్ని రేపిన వెంటచలాన్ని చాలామంది పురుషులు మెచ్చుకోరు. ఎందుకో తెలుసా? ఆయన సెక్సుకథలు వ్రాయటమే దానికి కారణమని అంటారుకాని నిజానికి అదొక్క కుంటిసాకు మాత్రమే. అసలు రహస్యం వేరు. చలం స్త్రీజన పక్షపాతి. స్త్రీని ఆయన అర్థం చేసుకున్నంత పరిపూర్ణంగా స్త్రీకోసం ఆయన పోరాడినంత తీవ్రంగా ఏయుగంలోనూ ఏవ్యక్తి చెయ్యలేదు స్త్రీకి స్వాతంత్ర్యం కేవలం ఆమెకు చదువులు చెప్పించి ఉద్యోగాలు చేయించినంతమాత్రాన రాదనీ స్త్రీకి కావలసిన స్వేచ్ఛా స్వాతంత్రాలు ఆమె మనసుమీద ఆత్మమీద ఆలోచనలమీదననీ, స్త్రీకి కోరికలుంటాయని, ఆమె రక్తనాళాల్లో ప్రవహించేది ఎర్రటి రక్తమనీ...యిలా మాట్లాడే పురుషుడిని ఏ భారతీయుడు మాత్రం భరించగలడు?

అందుకే స్త్రీకి వ్యక్తిత్వం ఉందంటూ కాస్త గట్టిగా మోతాదును మించి మాట్లాడిన ఏ పురుషుడికీ, స్త్రీకీ కూడా యీ పవిత్ర భారతదేశంలో గౌరవమైన స్థానం లేదు. స్త్రీని నిరాకార నిర్గుణ పరబ్రహ్మస్వరూపంవలె ఒక 'యాబ్‌స్ట్రాక్ట్' విషయంలా వర్ణించిన రచయిత చాలా గొప్పవాడు...ఉన్నతమైన అభిరుచులు గలవాడౌను. స్త్రీని రక్త మాంసాలు గల మనిషిలా చిత్రించిన రచయితకాని రచయిత్రికాని క్షమార్హులు కారు. ఒకవేళ అలా అన్నా, కుండ బ్రద్దలుకొట్టినట్లు ఆ విషయాన్ని సూటిగా చెప్పక భగ్న హృదయాలు, బాష్పకణాలు వగైరా తొడుగులు తగిలించి శరత్‌బాబులా స్త్రీని చిత్రిస్తే కొంతలో కొంత ఒప్పుకొంటారు.

కేవలం స్త్రీల సమస్యలనే ప్రధాన వస్తువుగా తీసుకుంటున్నారు నేటి రచయిత్రులు—అని ఆరోపించేవారికి నా సమాధానం యిది: సాహిత్యానికి మూలం, సాహిత్యానికి జీవం, సాహిత్యానికి గమ్యం స్త్రీయే! స్త్రీలేని కావ్యం ఆత్మలేని శరీరంలాటిది. అలాటప్పుడు రచయిత్రులు ఆ స్త్రీయొక్క సమస్యలను, వాటికి కారకులైన పురుషులను కథా వస్తువులుగా తీసుకొనటంలో తప్పేం లేదు.

ఏదేశ సాహిత్యమైనా సమకాలీన సమాజానికి దర్పణంలా ఉండాలి. ఈనాడు తెలుగు పడతులందరిలోనూ ఒకతీవ్రమైన భావ విప్లవం బయలుదేరింది. గోదావరి వెల్లువవంటి యీ భావ సంచలనం సాహితీరంగాన్ని కూడా ముంచి యెత్తుతోంది. ఐతే ఆ వెల్లువ మాటున ఉన్న ఆవేదనను అసహాయతను కూడా అర్థం చేసుకుంటానికి అందరూ ప్రయత్నించాలి. ముఖ్యంగా యువతరాన్ని నేను కోరేది అదే! ●

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# వారఫలం

## 3-1-1969 శుక్రవారం మొదలు 9-1-1969 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి సాహసముతో కూడిన వ్యాపారాలు లాభించగలవు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు--సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం.** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలించగలవు. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా ప్రయోజనం ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**సింహం:** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వృత్తిలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారంమధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—అలంకార వస్తువులు కొంటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృశ్చికం** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**మకరం** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాలకి మీప్రాముఖ్యత పెరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో మాటపట్టింపులు తగవు.

**కుంభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగల రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మీనం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులు సహాయం చేస్తారు.

—మహేష్ ●




"రాధికా! కృష్ణా!...
తవ విరహే!... కేశవా!..."

మధురాతి మధురమైన జయదేవ గీతం వీనుల విందొనరించేలా సుమధుర స్వరంలో పాడుతూ స్టేజి మీద 'రాధికా నృత్యం' ప్రదర్శిస్తోంది మాధవి. ఆమె అందానికి మెరుగులు దిద్దిన అలంకరణతో, అపురూపమైన హావభావ ప్రకటనతో ప్రేక్షకుల నలరించింది మాధవి నాట్యం....

ఆనాడు మెడికల్ కాలేజి వార్షికోత్సవం. ఊళ్లోని ప్రముఖులు, కాలేజి ప్రొఫెసర్లు, స్టూడెంట్లు కాలేజి ఆవరణ అంతటా నిండిపోయి వున్నారు. పరిసరాలన్నీ వరుసల్లో అమర్చిన ట్యూబులైట్ల కాంతుల్లోను, రంగు రంగుల బల్బుల తోరణాల ప్రకాశంతోను దేదీప్యమానంగా వెలిగి పోతున్నాయి. సభికు లందరి దృష్టి స్టేజి మీదనే కేంద్రీకృతమై వుంది. డాన్సు పూర్తయి, తెర పడిన వెంటనే హర్షధ్వానాలు మిన్నుముట్టాయి...

డాన్సు దుస్తులు మార్చుకోవాలని గ్రీన్ రూమ్ వైపు నడుస్తున్న మాధవి "హలో! మిస్ మాధవీ! నా హార్టీ కంగ్రాచ్యులేషన్స్ అందుకోండి. అద్భుతంగా వుంది మీ నాట్యం.." అనే మాటలు వెనుకగా వినిపించగానే ఆగి వెనుదిరిగి చూసింది. ఎదురుగా చిరునవ్వు చిందులాడే సుందరవదనంతో, పచ్చని దేహ చ్ఛాయతో, పొడవుగా హుందాగా వున్న యువకుడు నిలబడి ఉన్నాడు. ఆరోగ్యంతో ఆకర్షణీయంగా మెరిసిపోయే విగ్రహమతనిది. ఎవరి దృష్టినయినా నిలిపి వేసే సౌందర్యం! అతన్నలా చూస్తూ, ఒక్కక్షణం రెప్ప వేయడం మరిచి నిలబడి పోయింది మాధవి. అతన్ని యిదివరకెన్నడూ చూడలేదామె..

మరుక్షణమే తడబాటుతో "థాంక్యూ వెరీ మచ్! ఏదో సామాన్యంగా చేశానండీ! అనుకొన్నంత బాగా చేయలేక పోయాననే అనిపిస్తోంది నాకు." అన్నది మృదువైన ధోరణిలో వినయంగా మాధవి.

ఆమె మంజుల కంఠస్వరం వీణ మీటినట్లు వినిపించి పులకితుడయ్యాడతను.

"నో! అదేమిటలాగంటారు? అంత బాగా చేశారు కదా! ఇక మీ గానం వింటూంటే ఎంత హాయిగా వుందో ఎలా చెప్పమంటారు? మొదటిసారిగా మీ పరిచయం చేసుకోవాలని ఆరాటపడింది నా మనసు." అని అతనంటూంటే మాధవికేదో తెలీని సంతోషం, సంతృప్తి కలిగాయి ఒక్కసారిగా. ఆ అపరిచిత యువకుని అభినందన ఆమె హృదయాన్ని మృదువుగా స్పృశించింది. అతడు సూటిగా తనవైపు చూసి మాట్లాడుతూంటె సిగ్గుపడి తల దించకుంది అప్రయత్నంగా.. అప్పుడే భుజం మీద చెయ్యి పడేసరికి ఉలిక్కి పడింది. స్నేహితురాలు ఉమ నవ్వుతూ నిలబడింది ప్రక్కన.

"ఊఁ! ఇక వెళ్దామా? మాధవీ! మీ మదర్ వెయిట్ చేస్తున్నారు." అంటూన్న ఉమ ఎదుటి వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది..

"నమస్కారమండీ! మీ అభిమానానికి కృతజ్ఞురాల్ని.. వెళ్లొస్తాను." అంటూ చేతులు జోడించి

యువకుని దగ్గిర సెలవు తీసుకుంది మాధవి.

"నమస్కారం.. చెప్పడం మరిచాను.. నా పేరు సుధాకర్.. మరి వెళ్ళకండి. గుడ్ నైట్" అంటూ అతడక్కడ్నించి వెళ్ళిపోయాడు.

ఉమతో కలిసి గ్రీన్‌రూమ్‌కి నడిచింది మాధవి తొమ్ము దుస్తులు మార్చి, కారు వైపు నడుస్తూం డగా ఉమ అంది.. "మాధవీ! వండర్ సుమా! సుధాకర్ వచ్చి నిన్నభినందించాడా? నమ్మలేని విషయం."

"అదేం అలాగంటున్నావ్? అతన్ని యీరోజే చూశాను నేను.. నీకిది వరకే తెలుసా? ఉమా!" అంటూ వింతగా చూసింది మాధవి.

"ఆహా!.. తెలియకేం?. మన సీనియర్ కదా సుధాకర్! మన కాలేజిలో లేడీస్ ఎవ్వరితోను అసలు మాట్లాడడు. గర్వమంటారతన్ని గురించి తెల్సిన అమ్మాయిలంతా. నీతోనే మాట్లాడాడనుకుంటూ యిన్నాళ్ళకి.. చిత్రంగా వుంది!.."

"అలాగా? మనిషి మంచివాడనే తోస్తూందే మరి! సరే.. పద పోదాం.." అంటూ కారెక్కింది మాధవి. అప్పటికే తల్లి, తండ్రి కారులో కూర్చు న్నారు.. ఉమను లేడీస్ హాస్టల్ దగ్గిర దింపి యింటికి చేరుకుంది మాధవి..

* * *

మాధవిరణి లాయర్ ప్రకాశరావు, సుభద్రలకు ఏకైక పుత్రిక. అల్లారు ముద్దుగా పెరిగింది. మెడికల్ కాలేజిలో నాలుగో సంవత్సరం చదువు తోంది.. చిన్నప్పట్నించీ నాట్య సంగీతాలలో అరి తేరినదైంది. కాలేజి డే సందర్భంగా ఆ యేడాది నాట్యం చేయడంతో అందరి దృష్టినీ ఆకర్షిం చింది. అంతకు ముందెప్పుడూ పాడటమేగాని నాట్యం చేయలేదామె. ఆరాత్రి ప్రక్కమీద పడుకొన్న మాధవికి వెంటనే నిద్ర పట్టలేదు. ఏవో ఆలోచనలు, మదిలో మెదిలాయి.. బావ రవీంద్ర గుర్తుకొచ్చాడు. అతన్ని గురించిన ఊహ రాగానే మాధవి చిన్నగా నవ్వుకొంది.

ఏం చేస్తున్నాడో బావ యిప్పుడు? ఫారిన్ వెళ్ళి యిప్పటికి ఏడాది కావస్తూంది. వెళ్ళేముందే తనకు పెళ్ళి చేయాలనుకన్నారు అమ్మా, నాన్న. కాని అదప్పట్లో కుదరలేదు.. అతడర్జంటుగా వెళ్ళిపోయాడు. వెళ్ళిన దగ్గిర్నించీ తనను చూడా లనుందనీ, ఎంతో త్వరలో తిరిగి వచ్చేయాలని ప్రయత్నిస్తున్నానని లెటర్సు రాస్తున్నాడు. కాని యింకా వచ్చే సూచనలు మాత్రం కన్పించడం లేదు. ఎప్పటి కొస్తాడో, ఏమో మరి? తనకు మాత్రం బావను చూడాలని ఆత్రంగా వుంది. తన చదువు పూర్తవడానికింకా ఏడాది చదవాలి.. మెడికల్ కాలేజిలో ప్రవేశించినప్పుడున్న ఉత్సాహం కొన్నాళ్ళు గడిచాక వుండదేమో? ఎప్పటికవు తుందా యీ చదువు? అన్పించిపోతుంది అందరికీ.. తనలాగే అనుకుంటోంది. ఇప్పటి దాక తన క్లాసుకి తనే ఫస్టుగా వస్తోంది పరీక్షల్లో.. ఎలాగో ఫైన లియర్ కష్టపడి ఫస్టుక్లాసులో పాసయితే బావ చాల సంతోషిస్తాడు. ఇంజనీరయిన బావ తను మంచి డాక్టరు కావాలని కోరుతున్నాడు. అతని

# మలుపు తిరిగిన...

ఆశయం నెరవేర్చడం తన విధి.. అనుకొంటూండగా మాధవికి ఆనాటి తన నాట్యప్రదర్శన, సుధాకర్ పరిచయం గుర్తుకొచ్చాయి.

ఫైనలియర్ చదివే సుధాకర్ యీ రోజు మొదటిసారిగా తనతో మాట్లాడాడు. మనిషి చాల బాగున్నాడు... గర్వమంటుందే ఉమ! ఏమిటో తనకీ నాలుగేళ్ళ కాలేజీ జీవితంలో అబ్బాయిల పరిచయం, స్నేహం ఎప్పుడూ లేవు.... కారణం ఎవరు మాట్లాడించినా, తానంతగా ఆసక్తి కన బరచక ముభావంగా ఉండటమే! తన క్లాసుమేట్సు ఇందిర, సుమన, లలిత — బోయ్ ఫ్రెండ్సుతోనే ఎక్కువగా తిరుగుతారు. తనకలాంటివి యిష్టముండవు. వారితో కలవడమంటే ఏదో భయంగా వుంటుంది తనకు.....

అలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకుంది మాధవి మెల్లగా.

* * *

"ఉమా! ఏమిటిది? కారాగిపోయింది.... ఛ.. ఏమైంది? డ్రైవర్!" అంది విసుగ్గా కారు తలుపు తీసుకుని దిగిన మాధవి.... ఉమ కూడ దిగింది...

"అమ్మగారూ! కారుకి చిన్న రిపేరు వచ్చిం దండీ! ఇప్పుడే కదలదనుకుంటాను... ఏం చేయ మంటారు?" అంటూ ఏదో సరి చూస్తున్నాడు డ్రైవరు రఘురామ్..

సాయంత్రం ప్రకృతి ఆహ్లాదకరంగా వుంది.... ఆకాశంలో అక్కడక్కడ తొలకరి మబ్బులు తొంగి చూస్తున్నాయి. కను చీకటి పడబోతూంది.... వర్షం వచ్చే సూచనలు కనుపించేసరికి కంగారు పడింది ఉమ...

"వర్షం వస్తే ఎలా? మాధవీ! ఇక్కడ్నించి యిల్లు చాల దూరం కదూ?" అంటూన్న ఉమ మాటలకు దిగులుగా ముఖం పెట్టింది మాధవి.

"అదే... ఉమా! ఎటు చూసినా దగ్గిర్లో ఏ రిక్షా అయినా కన్పించడం లేదు... ఇవాళ వానలో తడవడం తప్పదు మనకి....

మరునాడు మాధవి పుట్టిన రోజు... ప్రతి ఏడూ ఆమె బర్త్‌డే వేడుకగా జరపాలనీ, ఇంటికి స్నేహితులందర్నీ పిల్చుకొని సరదాగా గడపాలనీ తండ్రి ప్రకాశరావు కోరి .... తల్లి కూడ ఆ విష యంలో ఆసక్తి చూపుతుంది. గనుకనే మాధవి ఉత్సాహంగా అందర్నీ ఆహ్వానించేందుకు బయ ల్దేరింది. అందర్నీ పిలిచి, యింటికి తిరిగి వచ్చే టంతలో కారాగి పోయింది త్రోవలో...

ఆలోచిస్తూ నిలుచున్న మాధవి తన ప్రక్కనే వేగంగా వచ్చి ఆగిన బ్లూప్లిమత్ కారు వైపు చూసింది. డ్రైవ్ చేస్తున్న వ్యక్తి కారులోంచి దిగి నవ్వుతూ పలకరించాడు... అతడు ఎవరో కాదు సుధాకర్!

"హల్లో! గుడీవినింగ్! మిస్ మాధవీ! ఏమిలా నిల్చున్నారు?"

"గుడీవినింగ్! సుధాకర్‌గారూ! మాకారు కొంచెం ట్రబుల్ యిచ్చిందండీ! అందుకని....." అంటూ సిగ్గుపడుతూ ఉమ వైపు చూసింది మాధవి.

'అరే... అలాగా? సరే! వర్షం వచ్చేలాగుందే! నా కారులో రండి.... మిమ్మల్ని డ్రాప్‌చేసి వెళ్తాను." అంటూ మర్యాదగా, అభిమానంగా ఆహ్వానించిన అతన్ని మనసులోనే మెచ్చుకొంది ఉమ... కాని మాధవి అతని ఆహ్వానాన్నందుకోలేదు... మర్యాద గానే తిరస్కరించింది.

"నో... థాంక్స్! ఎందుకండీ మీ కంత శ్రమ? కాసేపుంటే వెళ్ళిపోగలం మా కారులోనే....." అంటూ "డ్రైవర్! అయిందా పని?" అంది రఘురామ్ కేసి తిరిగిన మాధవి. ఆమె కెందుకో సుధాకర్‌తో స్నేహం పెంచుకోవాలన్పించలేదు...

"సరే.... మీ యిష్టం. కాని నాకేమీ శ్రమ కాదు...." అనేసి సుధాకర్ ఆలోచిస్తూ వూరు కున్నాడు. ఏవిటో యీమె అభ్యంతరం? తన వంటివాడు ఆఫర్ చేసిన హెల్ప్ వద్దంటుందేం? బాగుంది! ఎంతైనా "కాలేజీ బ్యూటీ!" కదా! ఆమాత్రం గర్వం చూపించదా మరి? తనదే పొరబాటు అలా పిలవడం! అనుకొంటూండగా ఉమ మాధవి చెవిలో మెల్లగా ఏదో చెప్పింది... కొస్త ఆలోచించి తలవూపిన మాధవి వెంటనే అతని కారువైపు నడిచింది... ఉమ మౌనంగా ఆమె ననుసరించింది.....

"సరే వస్తామండి... సుధాకర్‌గారూ! ఇప్పట్లో అది కదిలేలాలేదు. మీకు ట్రబుల్ యిస్తున్నాం". అంటూన్న మాధవి మాటలతో సుధాకర్ మొహం వికసించింది. కారు వెనుక సీటు తలుపు తెరిచా డతను వెంటనే.

'ఎంత మాట... రండి! మీ యిల్లు ఎక్కడో నాకు తెలీదు. డైరెక్షన్ యివ్వండి..." అంటూ వారెక్కగానే కారులో కూర్చుని స్టార్టు చేశాడు. తమ యిల్లు గుర్తులు చెప్పింది మాధవి. కొంత దూరం వెళ్ళాక లేడీస్ హాస్టల్‌దగ్గిర ఆపమని దిగింది ఉమ. దిగేముందు మాధవితో "సుధా కర్‌ను తప్పకుండా మర్నాటి పార్టీకి పిలవడం మర్యాద" అని సలహా చెప్పింది. చిరునవ్వుతో తల వూపింది మాధవి సరేనన్నట్టుగా.

"థాంక్యూ! సుధాకర్‌గారూ! వస్తానే!" అంటూ వెళ్ళిపోయింది ఉమ. కారు కదిలింది. తమ యిల్లు సమీపిస్తుండగా అన్నది మాధవి....

"చూడండి.... సుధాకర్‌గారూ! రేపు సాయం త్రం మీరు తప్పకుండా మా యింటికి రావాలి."

"ఏమిటో విశేషం? అలా నన్ను పిలుస్తున్నా రంటే ఆశ్చర్యంగా వుందండీ!" అన్నాడు సుధాకర్ అసలు సంగతేమిటో అర్థంకాక.....

"పెద్ద విశేషమేమీ కాదుగాని, నాబర్త్‌డే.... ఫ్రెండ్స్ కందరికి చిన్నపార్టీ యివ్వాలనుకుంటు న్నాను..అంతే...మీరునాస్పెషల్‌గెస్టు...మరి వస్తారు కదూ?"

"థాంక్యూ! తప్పకుండా వస్తానండి...కాని చిన్న డవుట్... నేనెప్పుడు కన్పించానని పిలుస్తున్నారా? మాధవీ! లేకముందే నన్ను పిలవాలనుకున్నారా?" చిలిపిగా నవ్వుతూ వెనుదిరిగి చూస్తూ అడి

గాడు సుధాకర్.

మాధవి తడబడింది. 'గడుసువాడేగాక తెలివైన వాడుకూడ' అనుకుంది. స్థిరంగానే జవాబిచ్చింది. "బాగుంది...మీతో పరిచయమైంది కాని, మళ్లీ ఎక్కడా కన్పించలేదు మీరిన్నాళ్లనుంచీ..మిమ్మల్ని యిన్వైట్ చేయాలనుకున్నా ఎలా చెప్పండి? మీయిల్లు తెలీదుకదా నాకు! ఈరోజు అనుకోకుండా మీరిక్కడ కన్పించారు. ఆహ్వానమందించగలిగానని సంతోషపడుతున్నాను.... మరోలా భావించకండి....ప్లీజ్!"

"అబ్బే! నేను తమాషాకడిగానండీ! మరేం లేదు. వస్తాను...మాధవీ! మీవంటి మిత్రురాలి ఆహ్వానాన్ని కాదనగలనా?" అన్నాడు నవ్వుతూ సుధాకర్. తన మాటలకామె మనసు కష్టపడిందేమోనని కంగారు పడ్డాడతను... కాని మళ్లీ మాధవి ప్రసన్న వదనం చూసి తృప్తి పడ్డాడు.

తన ఇంటిముందు కారాగగానే దిగింది మాధవి. అతనికి థాంక్స్ చెప్పి, లోపలికి వెళ్ళిపోయింది. సీబ్లూ ప్లిమత్ కారు సిమెంట్ రోడ్డుమీద దూసుకు పోయింది ముందుకి. సుధాకర్ మనసంతా వింత భావాలతో నిండి పోయింది..... ఇంటికి చేరగానే కారును షెడ్‌లో పెట్టి తోటలో తిరిగాడు ఉల్లాసంగా .... తానెన్నాళ్లనుండో ఆరాధిస్తున్న మాధవి యీరోజు తనను పార్టీకి ఆహ్వానించింది. తానామెను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాడనేది నిశ్చయమైన విషయం. ఇక తన మనసు నామె కెరిగించి, ఆమె మనసు తాను తెల్సుకోవడం మిగిలివుంది. దానికింతవరకూ అవకాశం దొరకలేదు. ఇంకా ఆలస్యమెందుకు? వెంటనే మాధవికీ సంగతి చెప్పేయడమే ముఖ్యం ...ఆమె కాదంటుందా? ఊహు ఎన్నటికీ అనదు. అంతేకాదు. అందాల బొమ్మ మాధవీ రాణి మాటల్లో తనమీద ప్రేమ ఉన్నట్లే వ్యక్తమవుతోంది తనకు. ఏమైనా మరునాడు విషయం తేల్చుకోవాలి. ఇంతవరకూ ఏ స్త్రీ తన నాకర్షించ లేదు. మాధవిలో ఎంతశక్తి వుందో? ఆమె సౌందర్యం సాటిలేనిది.. ఆ అందమైన కళ్లలోని ఆకర్షణ సామాన్యమైనదా? మరీ—నాటి నాట్య ప్రదర్శన జరిగినప్పటినుండి తన హృదయంలో నివాసమేర్పర్చుకొంది. ఆమె తన దయితే తన్ను మించిన అదృష్టవంతుడెవరు? ఆలోచనల్లో తేలిపోతూ శేఖర్ పిలుపుతో ఉలిక్కి పడ్డాడు సుధాకర్..

"అబ్బ! ఏమిటోయ్ దీర్ఘాలోచన? పిక్చర్ కొస్తావా? పోదాం... ఇందిర, సుమన కూడ వస్తున్నామని ఫోన్ చేశారు. ..సుధా!" అన్నాడ శేఖర్ ఉత్సాహంగా విసుగ్గా చూశాడు సుధాకర్ "ఊహు....రాను.. అసలు వాళ్లిద్దరూ వస్తారంటే నీతో యివాళ నేను రాదల్చుకోలేదు. అంతే.. వెళ్ళు.. శేఖర్!"

"ఓ. కె. నువ్వు మరోనాడలా వచ్చావు గనుకనా సరేలే.. బై.. రేపు మీటవుదాం.." అంటూ త్వరగా వెళ్లిపోయాడు శేఖర్....

'ఉస్సు'రని నిట్టూర్చాడు సుధాకర్... పబ్లిక్ పరీక్షలు దగ్గరికొచ్చాయి. చదవాల్సిన సబ్జెక్ట్సు బోలెడుంటే శేఖర్ సినిమాలకు తిరుగుతున్నాడని బాధపడ్డాడు సుధాకర్. తన క్లాసుకి తన్ను మించిన వారెవరూ లేరు.. జడ్జిగారబ్బాయే కాలేజి ఫస్టు— అని ప్రతియేడూ అనిపించుకొంటున్నాడు. సుధాకర్ జడ్జి శంకర్రావు, సావిత్రి దంపతుల ఏకైక పుత్రుడు...రూపు రేఖా విలాసాలేగాక, విద్యా ధన సంపదల్లో కూడ అతనికి సాటి మరొకరు లేరా కాలేజిలో. సుధాకర్ అంటే విద్య, వినయం, రూపం, సంస్కారం సహృదయత మూర్తీభవించిన యువకుడనే పేరు పొందాడు. కాలేజి గేమ్సులో అతనే ఛాంపియన్. ప్రొఫెసర్లందరికీ అతనంటే సద్భావమూ, అభిమానం వున్నాయి. అటువంటి సుధాకర్ హృదయారామంలోని ఆరాధ్య దేవత మాధవి కావడమొక అపూర్వమైన విషయం! జీవితంలో నిర్ణయాలు చిత్రంగా జరుగుతాయి.

సాయం సమయం, పార్టీకి వచ్చిన మిత్రురాళ్ళందర్నీ సాగనంపి యింట్లోకి వచ్చింది మాధవి. తండ్రి ఎదురయాడు. ఆమె ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా వుంది. సంధ్య చీకట్లు చుట్టూ వ్యాపించాయి.

"ఏమమ్మా! రాణీ! నువ్వు పిల్చినవారంతా వచ్చి వెళ్లినట్లేకదూ? ఎవరైనా మానేశారా?" అన్నాడు ప్రకాశరావు.. మాధవిని యింట్లో 'రాణి' అని పిలుస్తారు తల్లీ తండ్రీ......

"ఆ.. అంతా వచ్చారు. డాడీ! ఒక్కరు తప్ప" అంది మెల్లగా మాధవి.

"ఎవరమ్మా? మీ క్లాసుమేట్సంతా వచ్చారుగా అందర్నీ చూశాను...." అన్నాడు వింతగా కూతురి మొహం వైపు చూస్తూ ప్రకాశరావు...

"మీకు తెలియని వారొకర్ని పిలిచాను..డాడీ! మా సీనియర్ అతను..వస్తాననీ రాలేదెందుకనో?" అంది తాపీగా మాధవి...తండ్రి మరేమనకుండా లోపల గదిలోకి వెళ్లాడు... మాధవి మనసంతా చికాకుగా వుంది. ఉమ అడిగింది కూడ "అతన్ని పిలిచానన్నావుకదా! మరి రాలేదే"మని... అలా అడగడం విన్న సుమన, ఇందిర సంగతి తెల్సుకుని పరిహాసం చేశారు. "అతనెందుకొస్తాడు? మాధవీ! నీవెర్రిగాని..అంతగర్విష్టికదా" అని.... తనేమనలేక పోయింది ఆమాటలకు. అసలు తనదే తప్పు.. సుధాకర్ కనిపిస్తే మాత్రం పిలవాలనెక్కడుంది? తన మర్యాద పోగొట్టుకోవడమే గాని... ఎంత అవమానం! ఛ.......

అంతలో వీధిలో కారాగిన చప్పుడైంది.. ఆలోచిస్తున్న మాధవి గేటువైపు చూసేంతలో ఎదురుగా కారుదిగి వస్తున్నాడు సుధాకర్. అతన్ని చూస్తేనే తృప్తి పడిందామె మనసు.. ఎదురేగి చిరునవ్వుతో ఆహ్వానించింది...

"రండి.. సుధాకర్ గారూ! ఇప్పటికైనా గుర్తుకొచ్చిందన్న మాట రావాలని. అసలు రారేమో అనుకున్నాను. మెనీ థాంక్స్!"

"గుడీవినింగ్! మాధవీ! వెరీసారీ! ఎంత మాటన్నారు. మర్చిపోలేదు. ఇంతవరకూ ఏవో పనులుండి త్వరగా రాలేక పోయాను. క్షమించాలి.. మీ ఫ్రెండ్సంతా వచ్చి వెళ్లి పోయారనుకుంటాను." అంటూన్న సుధాకర్‌ను చూస్తూ నవ్వింది మాధవి అందంగా...

"ఫరవాలేదు లెండి.. అందరూ యిప్పుడే వెళ్లారు. రండి పైకి వెళ్దాం..." అంటూ మేడమీదికి నడిచింది మాధవి. సుధాకర్ ఆమె ననుసరించాడు. అతడా రోజు ఆమె మిత్ర బృందమంతా



గ మ ని క

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥





# మలుపు తిరిగిన...

వెళ్ళిపోయిన తర్వాత రావాలనుకోనే అలా లేటు చేశాడన్న సంగతి ఆమె కెలా చెప్తాడు? ఆమెతో ఏకాంతంగా మాట్లాడాలని కదా తన నిశ్చయం! అనుకొంటూ తనలోనే నవ్వుకొన్నాడు.

మేడమీది గదిలోకి తీసుకెళ్ళి సోఫాలో కూర్చో మంటూ తండ్రిని పిల్చింది మాధవి. ఆయనకు పరిచయం చేయగానే లేచి వినయంగా నమస్కరించాడు సుధాకర్. ఆయన కోరగా తండ్రిపేరు చెప్పాడు— ప్రకాశరావు వింటూ పొంగిపోయాడు సంతోషంతో.

"అయితే, జడ్జి శంకర్రావు గారబ్బాయివటోయ్! నాకు మీ ఫాదర్ బాగా తెలుసు. సంతోషం... నిన్నింతవరకూ చూడలేదెన్నడూ..." అంటూ కరచాలనం చేశాడు సుధాకర్‌తో. కొంతసేపు మాట్లాడి, ప్రకాశరావు లేచి ఎక్కడికో వెళ్ళాడు పనిమీద... మాధవి కాఫీ, టిఫిన్లు తీసుకొచ్చి ముందు పెట్టింది.

"తీసుకోండి త్వరగా. ఇప్పటికే ఆలస్యమైంది." అంటున్న మాధవితో,

"ఓహ్.... ఇవన్నీ నా కొక్కడికా? మీరు కూడ తీసుకోవాలి.... ప్లీజ్..." అన్నాడు. తనొక ప్లేట్ తీసుకుంది మాధవి కంపెనీ కోసం.... తన వైపు తదేకంగా చూస్తూ కూర్చున్న సుధాకర్‌ను గమనించి సిగ్గుపడింది మాధవి.....

అసలే అందాలు చిందే అపరంజి బొమ్మ మాధవి.. ఆరోజు ప్రత్యేకమైన పుట్టిన రోజు ముస్తాబుతో మరింతసౌందర్యాన్ని సంతరించుకొందేమో,అన్పిస్తూ, అపురూపంగా కన్పిస్తోంది సుధాకర్ కళ్లకు.. ఆ ముగ్ధ మోహన సౌందర్యాన్నెంత చూసినా తనివి తీరడం లేదతనికి. అద్వితీయమైన అందం మనసు నాకర్షించి మురిపించడంలో ఆశ్చర్యం లేదు. అందుకే 'అందమే— ఆనందం'— అన్నారు.

ఏం మాట్లాడకుండా ఆలోచిస్తూ కూర్చున్న సుధాను పలకరించింది. "ఏదో ఆలోచనల్లో మునిగి పోయినట్టున్నారు.... సుధాకర్!"

"ఆ... ఏంలేదు.... మాధవీ! ఇదిగో— ఈ చిన్న కానుక స్వీకరించండి... విత్‌మై బెస్ట్ విషెస్.." అంటూ లేచి చేతిలోని పెద్ద పేకెట్టు నందించాడు అతను.

"థాంక్యూ వెరీమచ్! 'చిన్న కానుక' అంటూనే అంత పెద్ద వస్తువు నిస్తున్నారే! ఏమిటో? చూడాలనుంది యిప్పుడే...." అంటూ అందుకొని వెంటనే పేకెట్టు విప్పింది మాధవి.

మరోక్షణంలో పేకెట్టులోంచి తీసిన పెద్ద బొమ్మను టేబిలు మీదుంచింది మాధవి..... అది ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో తయారైన అందమైన రాధా కృష్ణుల జంట. అతి మనోహరమైన రంగుల్లో తీర్చి దిద్దిన బొమ్మలో కళాకాంతులు ప్రస్ఫుట మవుతున్నాయి. దాన్ని చూస్తూనే మాధవి కళ్లు ఆనందంతో మెరిసిపోయాయి. తనకంత చక్కని బహుమతి నిచ్చిన సుధాకర్ వైపు కృతజ్ఞతగా చూసి తృప్తిగా నవ్వింది. సుధాకర్ మురిసిపోయాడు.

"వండర్‌ఫుల్! రియల్లీ వాట్ ఎ బ్యూటిఫుల్ థింగ్!!" అంటూ చెక్కిట చెయ్యి చేర్చుకొని, తదేకంగా బొమ్మనే చూస్తూ నిశ్చలంగా నిలబడిపోయిందామె. గది ప్రక్కనున్న తోటలోని మాలతీ పూలవాసన కిటికీ నుండి గాలిలో తేలి వస్తూ మత్తెక్కిస్తూంది. సుధాకర్ మనసంతా తీయని వూహలు నిండి, అతన్ని కలవర పర్చాయి.

అతడు మెల్లగా లేచివచ్చి మాధవి సమీపంలో నిల్చున్నాడు.

"మాధవీ!" అనే మృదువైన పిలుపుతో ఒక్కసారి ఉలిక్కిపడిందామె...

"ఊ!.. ఏమిటండి?" అంటూ అతనివైపు తిరిగింది మాధవి.. తన్మయావస్థలో నున్నట్టుగా ఆమెను చూస్తున్న సుధాకర్ చేతు లప్రయత్నంగా ఆమె భుజాల మీద వేశాడు. ఆ స్పర్శతో ఒక చిత్రమైన అనుభూతినొందిన మాధవి వింతగా చూసేటంతలో అతని చేతు లామెను దగ్గరికి తీసుకోబోయాయి. తలెత్తిన మాధవి చూపులతో అతని చూపులు కలిశాయి. ఒక్క క్షణం అవ్యక్త మధుర భావం యిద్దరిలో తళుక్కున మెరిసి మాయమైంది. మరుక్షణమే మాధవి తన్ను తాను తెల్సుకొన్నట్టు కంగారుగా అతని చేతుల్ని తొలగించి దూరంగా జరిగి నిలబడింది. ఒక్కసారిగా ఆమెకు ముచ్చెమటలు పోశాయి. ఏదో తెలీని భయంతో... తప్పు చేసినట్టుగా ఫీలయింది. గదిలో నిశ్శబ్దమావరించింది కొన్ని నిముషాలు. సుధాకర్ తనే మాట్లాడాడు...

"క్షమించాలి.... మాధవీ! తొందర పడ్డానేమో? సాహసం చేశానంటారా? పొరబాటు చేయలేదనుకుంటాను.." అతడింకేదో అనేలోగానే మాధవి అందుకుంది.

"అవును సుధాకర్! పొరబాటే జరిగింది.." అనేసి తల దించుకుంది. ఆ క్షణంలో ఆమె హృదయస్థితి అయోమయంగా వుంది. ఎదట అతని ప్రేమదృక్కులామె మనసును మత్తెక్కిస్తున్నాయి. కళ్లెత్తి అతన్ని చూస్తే తానతని అందానికి వశమైపోతానేమోనని భీతిల్లింది.... సుధాకర్ ఆమెనే గమనిస్తున్నాడు.

"పొరబాటెలాగవుతుంది? మాధవీ! నేను మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. ప్రాణసమంగా ప్రేమించే 'మాధవి' శాశ్వతంగా నాదికాగల్గితే ధన్యుడ్ని అవుతానని ఆశిస్తున్నాను. దయచేసి మీ అంగీకారం తెలిపితే?"

అంతలో తలెత్తి చూసిన మాధవి నీరసంగా తడబడే గొంతుతో అన్నది... "ప్లీజ్... ఆగండి! సుధాకర్! అదసంభవమని చెప్తున్నాను— అయామ్ సారీ! నా వివాహమిదివరకే నిశ్చయమైంది..."

ఉలిక్కిపడిన సుధాకర్ ఆవేశంతో ప్రశ్నించాడు...."ఎవరితో?"

"మా బావ రవీంద్రతో... అతడిప్పుడు అమెరికాలో ఉన్నాడు— వస్తే మా పెళ్లవుతుంది."

స్థిరంగానే చెప్పేసింది మాధవి... కాని అతని మొగం చూసి అదిరిపోయింది ఒక్కసారి.

"ఏమిటిది? మాధవీ! నిజమే చెప్తున్నారా? మీకు నా పట్ల ప్రేమలేదా? మరి ఏమిటీ నాటకం? ఎందుకిలా నటించారు? నన్ను తమాషా చేయాలనా?" అంటున్న సుదాకర్ మొహంలో సమస్తం పోగొట్టుకొన్న నిరాశ వ్యక్తమైంది. కళ్లలో కోపం నిండింది. పచ్చని మొహం ఎర్రగా కంది, చెమటతో తడిసింది.

"మన్నించాలి... సుధాకర్.... అనవసరంగా ఆవేశ పడు తున్నారు. నేను మిమ్మల్నేనాడూ ప్రేమించ లేదు... అలాగని మీతో చెప్పనూ లేదు... కేవలం నా స్నేహితునిగా భావించాను.. అంతే.. ఇందులో నాటక మేముంది? చెప్పండి. నటించడం నాకు చేతకాదసలు.... సారీ! మీరే పొరబడి, నన్నపార్థం చేసుకున్నారని చెప్పడానికి విచారిస్తున్నాను.." అని కాస్త కోపంగానే అంది మాధవి.

ఒక్కసారిగా హతాశుడై తల పట్టుకొని సోఫాలో కూలబడ్డాడు సుధా.... మున్నిచ్చిన మనసు ముక్కలైంది. ప్రేమైక హృదయం మూగ వోయింది. ఏమిటీ ప్రళయం? కలలో కూడ అనుకోలేదు యిటువంటి మాట వినగలడని...ఛ... ఎంత పొరబడ్డాడు. తన రెలివి ఏమైంది? మాధవి నెంత పిచ్చిగా ప్రేమించాడు! ఆమె బావ అదృష్ట వంతుడు. మరి తనకెలా వస్తుంది ఆ భాగ్యం? అనుకొని మెల్లగా లేచాడు వెళ్లేందుకు.... మాధవి మొహంలో నెత్తురు లేనట్టు పాలిపోయింది.

"సుధాకర్! వెళ్తున్నారా? ప్లీజ్. మరోలా భావించవద్దని ప్రార్థిస్తున్నాను. మీ మనస్సును బాధపెట్టి వుంటే క్షమార్హురాలిని. దీనిలో నేను చేయగలిగిందేమీ లేదు. కాని మన మధ్య స్నేహం నిలిచే వుండాలని కోరుతున్నాను.. మళ్లీ కనిపిస్తారు కదూ!"....

ఆమె మాటలకు గిరుక్కున తిరిగి చూసిన సుధా విసురుగా అన్నాడు .....

"ఉహూ... వద్దు... మాధవీ! ఇక మనమధ్య స్నేహమే ఉండరాదు... అనవసరం.. మళ్లీ మీ యింటికి రాలేనిక.. నన్ను మరి పోండి.... వెళ్తాను. మీ అభిమానానికి, ఆతిథ్యానికి కృతజ్ఞతలు... గుడ్‌బై!....."

అతడిక మరొక్కమాట విన్పించుకోకుండా త్వరత్వరగా నడిచి బయటికి వెళ్లిపోతూంటే నిశ్చేష్టురాలై నిలబడిపోయింది మాధవి... సుధాకర్ కారు స్టార్టయిన శబ్దం విన్పించిందామెకు... వెంటనే ఒక భారమైన నిట్టూర్పు విడిచింది. ఆమె హృదయమంతా విపరీతంగా సంచలించి పోతూంది. కళ్లు రెండూ గట్టిగా మూసుకొని గదిలోని కృష్ణ విగ్రహం ముందు చేతులు జోడించి ప్రార్థించింది. అతనకు నిశ్చలతనూ, మన శ్శాంతినీ ప్రసాదించమని మనసారా కోరుకుందామె.

*        *        *

కాలచక్రం గిర్రున తిరిగింది. సంవత్సరం గడిచిపోయింది. మాధవి, సుధాకర్ల మధ్య మాటలు గాని, స్నేహంగాని లేకుండా పోయాయి. ఫైనలియర్ పాసయిన సుధాకర్ హౌస్ సర్జన్‌గా పని చేస్తున్నాడదే హాస్పిటల్‌లో... ఫైనలియర్ పరీక్షలు పూర్తి చేసిన మాధవికి బెంగ తీరినట్టుంది. ఆ రోజుతో ప్రాక్టికల్సు పూర్తయాయి. విశ్రాంతిగా యింట్లో గడుపుతూంది. అనుక్షణం రవీంద్ర జ్ఞాపక మొస్తున్నాడు. కళ్లు మూసుకుంటే అతడే కన్పిస్తున్నాడు. కొన్నాళ్ల నుండి రవి దగ్గిర్నుంచి ఉత్తరాలు లేవు.... తన పరీక్షల ముందు వ్రాశాడు. బాగా చదివి ధైర్యంగా వుండమనీ, ఎక్జామ్స్ బాగాచేసి ఫస్టుక్లాసులో పాసవ్వాలనీ వ్రాశాడంతే. అతనెప్పుడొచ్చేదీ వ్రాయక పోవడానికి కారణం తెలీక ఆందోళన పడుతున్నారు మాధవితో పాటు సుభద్ర, ప్రకాశరావు కూడ. రవీంద్ర వెళ్లి రెండేళ్లయింది. మాధవి పరీక్షలు కాగానే అతనికి లెటర్ వ్రాసింది. దానికే జవాబు... వచ్చిందామెకు.... పోస్టుమేన్ నుండి లెటర్ నందుకున్న మాధవి ఆత్రంగా ఉత్తరం చదువుతూ, తల్లిని పిలిచింది..... అశోక సుదీర్ఘ లేఖ.

"డియర్ మాధవీ!......

నీ పరీక్షలు బాగా వ్రాసినట్టు తెలిసి ఆనందించాను. ఎన్నోరోజుల్నుంచీ సరిగా లెటర్ రాయనందుకు నామీద ఆగ్రహించి వుంటావని తెలుసు. కాని ఏం చేయను? నాపరిస్థితులలా వున్నాయి. నీకేమీ వ్రాయలేని దుస్థితి కలిగింది. నా ఆగమనానికై ఎదురు తెన్నులు చూస్తూ, ఆత్రంగా ప్రేమతో నిరీక్షించే నీకు నేనందించబోయే వార్త ఎంత బాధ కలిగిస్తుందో నేనే ఊహించగలను...

మధూ! అనుకోకుండా నా వివాహం యిక్కడే రజనితో జరిగిపోయింది. ఏడాది గడిచింది మాపెళ్లయి.. ఇంతవరకూ నీకీ విషయం తెలిపే సాహసం రాలేదు. నన్ను క్షమించమని కోరే అర్హతలేదు.. కాని నీ క్షమాభిక్ష లభిస్తే ధన్యుడ్ని కాగలను..త్వరలో నీకు నచ్చిన చక్కని యువకుడ్ని, నిన్ను ప్రేమించి, ఆరాధించే వ్యక్తిని చూసి వివాహం చేసుకో...నన్ను మరచిపో.. ఇప్పట్లో ఇండియాకు రాలేను.. అత్తయ్య, మామయ్యలకు నాముఖం చూపలేను. నీజీవితం సుఖవంతం కావాలని కోరుతూ,

శుభాకాంక్షలతో,

నీవాడుకాలేని బావ

రవీంద్ర."

ఉత్తరం చదువుతూనే తలమీద పిడుగు పడినట్టుగా వణికి పోయింది. మాధవి.."అమ్మా రవి....బావ...." అంటూనే స్పృహ తప్పి పడి పోయింది. ఆమె కన్నీళ్లు చెంపల మీదికి జాలు వారుతున్నాయి. "ఏమే! రాణీ! సంగతేమిటి? మీబావకేమైంది?" అంటున్న సుభద్ర మాటలకు జవాబు లేదు. ఆమె ఆందోళన పడుతూ వెళ్లి మాధవి పరిస్థితిని భర్తకు తెలిపింది.. ప్రకాశరావు వచ్చి కుమార్తె చేతిలోని ఉత్తరం చదవగానే ఉగ్రుడయ్యాడు...

"ఛీ.. దుర్మార్గుడు! ఎంత మోసం చేశాడు? మన రాణి నెలా మర్చి పోయాడు?" అంటూ "సుభద్రా! రవి పెళ్లి చేసుకున్నాడట అక్కడే. మాధవి ఏమవుతుందో! నువ్వు చూస్తూండు.. నేను డాక్టర్‌ను తీసుకొస్తాను". అని వెంటనే కారులో బయల్దేరాడు..సుభద్ర కళ్లనీళ్లు పెట్టుకుంది. విన్నవార్త ఆమెను నిశ్చేష్టురాలిని చేసింది. తన కూతుర్ని ప్రేమించిన రవి మరొకర్ని పెళ్లాడాడన్నది నమ్మలేని నిజం! ఇక రవిని ప్రాణంగా ప్రేమించిన మాధవి ఏమవుతుందో ఆవిడ అసలు ఊహించలేని విషయం......

*        *        *

తమరు దయవుంచి పైకి ఎక్కి కూర్చుంటారూ!



## మలుపు తిరిగిన...

డాక్టర్ కేశవ మూర్తి వచ్చి మాధవిని చూసి వెళ్ళారు.. మరేం ప్రమాదం లేదని చెప్పి, మందిచ్చిన కొంతసేపటికి తెలివి వచ్చిం దామెకు. కాని ఆమె మునుపటి మాధవి కాదు. మారి పోయింది.! తన పరిసరాలను గాని, మనుషులను గాని గుర్తించ నట్టు ప్రవర్తిస్తోంది. దిగాలు పడిన వదనంతో, కాంతిలేని కళ్ళతో, నిరాశ నిండిన మనసుతో హృదయ విదారకంగా ఏడుస్తూంది తల్లి, తండ్రి పలకరిస్తే జవా బివ్వదు. "రవీ! నన్నెలా మరిచిపోయావు? నన్నింత బాధ పెడతావా? బావా! నేనేం తప్పు చేశానని? ప్లీజ్ చెప్పు. ఇలా నా జీవితంతో తమాషా చేయాలని సరదా పడ్డావా? సరేలే... నీవైనా సుఖంగా వుండు. నాకిక బ్రతకాలని లేదు. అంటూ దుఃఖించే మాధవి నెలా ఓదార్చాలో తోచక అయోమయావస్థలో పడిపోయారు సుభద్ర, ప్రకాశరావు.. సంగతి తెలిసి పరుగెత్తుకొచ్చిన ఉమ మాధవి తీరు చూసి భయపడి కన్నీళ్ళు పెట్టుకుంది.. మాధవి నెలా మామూలు స్థితికి తెప్పించడమో, ఆమె కర్థంకాలేదు... వారంద రికీ ధైర్యం చెప్పి మాధవిని హాస్పిటల్‌లో చేర్పించి, తనే ట్రీట్ చేస్తున్నారు కేశవమూర్తి. ఆయన ఏళ్ళో నిండిన అనుభవజ్ఞుడైన ఫిజీషి యన్.. కాని ఆయనకే మాధవి పరిస్థితి ప్రమాద కరంగా తోచింది. ఆమె మనసు హఠాత్తుగా తగిలిన గాయంనుంచి తేరుకోవాలంటే దానిని నేర్పుగా మరొక వైపుకి మరల్చాలి. మాధవి రవిని గాఢంగా ప్రేమించింది. అతనితో వివా హమవుతుందనే నమ్మింది. ఇప్పుడతని సంగతి తెలిసి బాధపడుతోంది.. మాధవి రవిని మరిచిపో గల్గితే మామూలు మనిషి కాగలదు. అంతే అదెలా సాధ్యమో తెలీడం లేదు ఆయనకే ఎంత ఆలోచించినా.. అదొక చిక్కు సమస్యగా పరిణ మించింది.

*  *  *

ఆరోజు ఆదివారం..ఉదయం పదకొండుగంటలు.. వార్డులో తన పని ముగించుకొని యింటికి వెళ్ళబోతున్న డాక్టర్ సుధకర్ ఎదురుగా వస్తున్న డా. కేశవమూర్తిని చూశాడు. మర్యా దగా ఆయన్ని విష్‌చేసి నమస్కరించాడు. ఏమి టోయ్? సధాకర్! ఈ మధ్య నువ్వెక్కడా కన్పించడం లేదు. వర్కు హెవీగా వుందా? హౌస్ సర్జన్ పని పూర్తయాక ఏం చదవబోతున్నావ్?" అన్నా రాయన ఆప్యాయంగా సుధకర్ భుజంమీద చేయి వేసి....

"ఆ హవుస్ సర్జన్ పని యీనెలతో పూర్తవు తుందండీ! వెంటనే ఎమ్. ఎస్. లో చేరాలను కుంటున్నాను. సార్! విశేషాలేమిటి? చెప్పండి!"

"ఏమున్నాయ్! ఫైనలియర్ మెడికల్ స్టూడెం టయిన ఒకమ్మాయిని స్పెషల్‌లో ఎడ్మిట్ చేశాం.. తమాషా కేసోతే... నాతో వచ్చి చూస్తావా? పద"...

"ఎందుకులెండి".అనాలనుకునీ, ఆమె ఎవరో చూద్దామన్పించి బయల్దేరాడు సుధాకర్.అతనికి కేశవ మూర్తి పట్ల భక్తిగౌరవాలు ఎక్కువే ఉన్నాయి. ఇద్దరూ స్పెషల్ వార్డు చేరేసరికి రూమ్ లోంచి వస్తున్న సుభద్ర ఎదురైంది..

"నమస్కారం..డాక్టరుగారూ! జ్వరం తగ్గ లేదండీ! పిచ్చిగా మాట్లాడుతోంది. భయంగా వుందండీ! పిల్ల మళ్ళీ బాగుపడుతుందా? చెప్పండి!" అంటూ భోరునఏడ్చేసిందావిడ.."ఊరుకోండి.మీరు ధైర్యంగా వుండాలి.. రావోయ్! సుధ!" అంటూ లోపలికెళ్ళి బెడ్‌వైపు చూశారాయన..మాధవి మగ తగా కళ్ళు మూసుకొని పడుకుంది.. ఆమెను చూడగానే, "అరె..మాధవి!" అంటూ ఉలిక్కి పడ్డ సుధకర్ ఆశ్చర్యంగా డాక్టర్ మూర్తి వైపు చూశాడు."ఏమైంది" అన్నట్టు.. అతని మనసు భయంతో నిండింది ఎందుకనో....

"నీకు తెలుసా? యీమె మాధవిరావు.. ఫైనలియర్ పరీక్ష రాసింది..దాన్ని, మ్యాథమెటి క్‌లలో ఎక్స్‌పర్ట్.." అంటూ యింకేదో ఆయన చెప్పబోగా అన్నాడు సుధ తాపీగా.."ఆ..తెలుసు నాకు.. ఒకప్పుడు మాధవితో స్నేహముండేది. కాని కొన్నాళ్ళనుండి ఆమె నసలు చూడలేదు నేను.. ఇప్పుడేమైంది మాధవికి?" అతనిమాటల్లో ఏమంత ఆసక్తి వ్యక్తం కాలేదు...గాని అతన్ని నిశితంగా పరిశీలించిన మూర్తిగార్కి ఏదో భావం మనసులో మెదిలిందప్పుడే.. వెంటనే "ఎందుకని? మీ మధ్య ఏమైనా అపార్థాలు, పేచీలు వచ్చాయా సుధా?" అని నవ్వుతూ అడిగా రాయన. "ఊ..ఏదో లేనెంలెండి.. మీరు చెప్పండి.." అన్నా డతను.

"సరే..విను.." అంటూ కేస్ సంగతంతా వివరించి నిట్టూర్పు విడిచారు మెల్లిగా. అంతా విన్న సుధాకర్, "అయితే యీమెకు మతి చలించే ప్రమాదముందంటూరా? సార్!" అన్నాడు ... "ఆహా!..లేకేం? ఇదే పరిస్థితిగా వుంటే హండ్రెడ్ పర్సెంట్ వుంది. ఎవరినీ అసలు గుర్తించడం లేదు. నువ్వు మాట్లాడి చూడరాదూ? ఎరిగిన వాడివే కదా." అనడంతో, సుధాకర్ ముందు కెళ్ళి "మాధవీ! ఇలా చూడండి.. నేనెవరో మీకు తెల్సు కదూ? మాట్లాడరేం?" అన్నాడు మృదువుగా.

"నాకు తెలీదు మీరెవరో!..వెళ్ళండి ప్లీజ్... నా బ్రతుకే ఏకమైపోయాక యిక మాటలేమిటి?" అంటున్న మాధవి దీనవదనం అతని మనసును కలచివేసింది.

చిరునవ్వుతో అతని భుజం తట్టిన డాక్టర్ మూర్తి "పద.. వెళ్దాం" అంటూ బయటికి నడిచారు. కొంతసేపు అతనితో చెప్పి, "ఏమం టావ్? సుధా!" అన్నారు.

"ఊహూ. సారీ! అది నా వల్లకాదు..సార్! ప్లీజ్ క్షమించండి!" అన్నాడు కంగారుగా. "అలా గనకు.. మరేం ఫరవాలేదు. నేను రేపు సాయంత్రానికి రిజల్టు చెప్పాలి.. ఏం? విష్ యూ గుడ్‌లక్!" అంటూ అతన్ని వదిలి వెళ్ళిపోయా రాయన.

అయోమయంగా నిలబడిపోయిన సుధాకర్ మనసులో మాధవి పట్ల ఉన్న ప్రేమ ఒక్కసారిగా పెల్లుబికింది. కాని వెంటనే ఆమె తిరస్కృతి, తన నిశ్చయమూ గుర్తుకొచ్చి బాధగా కళ్ళు మూసుకున్నాడు.. కొంతసేపటి కేదో ఆలోచించి



చకచకా ముందుకు నడిచాడు.. కన్నుల్లో దీక్ష మెరిసింది. మూర్తిగారి మాట అక్షరాలా అమలులో పెట్టాడు. ఫలితం! ఊహించిన దాని కంటె ముందుగానే మాధవి మామూలు మనిషి కావడం జరిగింది. మూర్తిగారు ఆలోచించింది యిదే.. ఆమె మనసును మలుపు త్రిప్పగల శక్తి సుధాకర్‌కే ఉందని ఆయన గ్రహించారు.. కారణం మాధవిని ప్రేమించి, ఆమె ప్రేమను పొందలేక సుధాకర్ బాధపడుతున్నాడని ఆయన అతని మాటలవల్ల ఊహించారు. ఇక యిప్పుడతను తన ప్రేమతో మాధవి మనసును తన వైపు మరల్చుకోగల్గితే, ఆమె తేలిగ్గా రవిని మరచిపోగలుగుతుంది.. ప్రేమాఘాతం తగిలిన మనసును ప్రేమతోనే మలుపు త్రిప్పాలని తోచి, సుధాకర్‌ను ప్రోత్సహించారు. అతడామెపట్ల తన విముఖతను పారద్రోలి, తన ప్రేమతో మాధవిని తనకు సుముఖురాలుగా చేసుకోగలననే దృఢనిశ్చయంతో, ఆత్మవిశ్వాసంతో తన శాయశక్తులా ప్రయత్నించాడు.

అతని ప్రయత్నం ప్రారంభించిన మొదటినాడే సత్ఫలితం కన్పించింది. ఆనాడు హాస్పిటల్‌లో ఇంజక్షన్ తీసుకోనని అల్లరి చేసిన మాధవికి, ఇంజక్షన్ యివ్వగలిగాడు. ఆమెను మెల్లగా మంచి మాటలతో మాట్లాడించాడు సుధాకర్..

"చూడు... మాధవీ! ఇలా అల్లరి చేస్తే ఎలా? చెప్పు.. హాస్పిటల్‌లోనే వుంటావా?"

"నాకు చచ్చిపోవాలనుంది.. డాక్టర్! మరే ఆశ లేదు..." అంది దుఃఖంతో మాధవి.

"అలాగనకు.. నువ్వు బ్రతకాలి.. సరదాగా వుండాలి.. నువ్వు దుఃఖిస్తే నేను చూడలేను..నా మాట విను.." అంటూ దగ్గిర కూర్చుని కన్నీళ్లు తుడిచాడు..

"ఎవరి కోసం బ్రతకాలి? డాక్టర్! చెప్పండి.. బావ మోసంతో.." అంటూ చేతుల్లో మొగం దాచుకొని ఏడుస్తున్న మాధవి పట్ల ప్రేమ, కరుణ నిండా యతనిలో.

"ఎవరి కోసమా? నా కోసం.. నిన్ను నా ప్రాణంగా ప్రేమిస్తున్నాను గనుకనే నీ కోసం బాధ పడుతున్నాను. నీకే విధమైన బాధ కలగకుండా చూసే పూచీ నాది.. సరేనా? మరెప్పుడూ ఏడవనని మాటియ్యి.. నిన్ను మరిచిపోయిన రవిని నీవెందుకలా తల్చుకోవడం? ఏమంటావ్? మాధవీ! ఇలా చూడు.." అంటూ మౌనంగా కూర్చున్న మాధవి మొహాన్ని పైకెత్తి ఆమె కళ్లల్లోకి ప్రేమగా చూశాడు..

"సరే. ప్రయత్నించి చూస్తాను.. డాక్టర్! మీమాట వినాలి కదూ!.."

"ఎస్.. థాంక్యూ! వెళ్లివస్తాను..మరి.."

ఆరోజే విషయమంతా విన్న మూర్తిగారతన్ని అభినందించారు సంతోషంగా.

*   *   *

హాస్పిటల్ నుండి యింటికి వెళ్లిపోయింది మాధవి.. ప్రతిరోజు సుధా వచ్చి ఆమెను చూసి వెళ్లేవాడు.. ప్రేమగా మాట్లాడేవాడు.. అలా ఒక నెల గడిచింది. ఇప్పుడు మాధవి వదనం కలకళ్లాడుతోంది.. లోకంలోని ఆనందమంతా ఆమె మొగంలోనే ప్రస్ఫుటమవుతోంది. స్నేహితురాలిలోని మార్పుకి ఉమ సంతోషించింది. సుభద్ర మనసులోని బెంగ తీరింది.

ఆరోజు శ్రద్ధగా అలంకరించుకొని, ముచ్చట్గా ముస్తాబైంది మాధవి. తన కోసం వస్తానన్న సుధాకర్ యింకా రాలేదని ఆత్రంగా నిరీక్షిస్తోంది.. అనుకొన్న టైము కంటె కాస్త ఆలస్యంగానే వచ్చాడతను.. తిన్నగా మాధవి ముందుకి వెళ్లి,

"గుడ్‌మార్నింగ్! మేడమ్!" అన్నాడు నవ్వుతూ సుధాకర్..

"ఓహో! గుడ్‌మార్నింగ్! ఇప్పుడే వస్తున్నారు కాబోలు డాక్టర్‌గారు.. చెప్పిన మాట మరిచిపోయారు కాబోలు? అందుకే అసలు మీ మగవాళ్లను నమ్మకూడదు.." అంటూ పెదాలు బిగించి మూతి ముడుచుకొంది మాధవి.. సుధాకర్ దగ్గరకొచ్చి




# రంగులరాట్నం

## దుముకుడుచేప

దుముకుడు చేపరా బాబూ!

చేపలు నీటిలోనే నివసించడం కద్దు. బయటకొస్తే అవి బతకలేవు. వాటి ఊపిరి అవయవాలు నీటిలో ఉంటేనే పని చేస్తాయి. ఈ దుముకుడుచేప—మడ్‌స్కిప్పర్ అంటారు —సముద్రాల్లో నివసించేదే. అయినా దీనికో అలవాటు ఉంది. అప్పుడప్పుడు సముద్రం వదలి, నేలమీదకి వచ్చేస్తుంది. అందులోనూ ముఖ్యంగా సముద్రం వెనక్కి తీసికోపోయినప్పుడు (లో టైడ్). తినడానికి ఆహారం సరిపోకనో ఏమో, గుంపులు గుంపులుగా ఆడుకోడానికి పోయినట్టుగా నేలమీదకి దుముకుతూ వచ్చేస్తాయి. ఈదడంకన్నా ఇదే వాటికి బాగా వచ్చు. అవసరం వస్తే మనకన్నా తొందరగానే, నేలమీద సాగిపోతాయి. వాటి ముందుజత చేపరెక్కలు (ఫిన్సు) చాలా బలంగా గెంతడానికి అనువుగా ఉన్నాయి. అక్కడక్కడా వుండే పురుగుల్ని కీటకాల్ని ఇవి వేటాడి తింటూ ఉంటే చూడ్డానికి వినోదంగా ఉంటుంది. ఇలా నేలమీద ఇవి కొన్నిరోజులవరకు ఉండిపోతాయి.

చేపలకళ్లు సామాన్యంగా నీటిలో చూడ్డానికే వీలుగా ఉంటాయి. బయట గాలిలో చూడ్డానికి అనువుగా వుండవు. దీనికి అలాకాక గాలిలో చూడ్డానికే సాధ్యమవుతుంది. పైగా అన్ని దిక్కులకు చూడ్డానికి వీలుగా, కళ్లు ఉబ్బెత్తుగా ఉంటాయి. శ్వాసావయవాలుకూడా గాలి పీల్చుకోడానికి వీలుగా మారాయి. శరీరంలోని నీరు ఆవిరిగా పోకుండా చర్మం మందంగా ఉంటుంది.

ఇంతకూ ఇవి ఏ కారణంవల్ల ఇలా బయటకొచ్చాయో కాని, సముద్రంలో చేపల పోటీ కొంత తగ్గింది!

—జమ్మి కోనేటిరావు

# మలుపు తిరిగిన...

ప్రక్కనే కూర్చున్నాడు. ముడుచుకొన్న ఆమె పెదాలను ప్రేమగా చుంబించాడు. అభ్యంతరం చెప్పలేదు మాధవి. ప్రపంచాన్నే జయించిన గర్వం తొణికిసలాడింది అతని నేత్రాల్లో.. అంతలో మాధవి కళ్లు మూసుకుని అతని గుండెల మీద వాలింది.. "హమ్మయ్య! మాధవీ! ఎంత కోపం వచ్చిందో నని భయపడ్డాను సుమా! మా ఫాదర్ చెప్పిన అర్జంటు పని ముగించి వచ్చేసరికింత ఆలస్యమైంది.. సారీ!" అని ఆలస్యానికి కారణం వివరిస్తున్న అతన్ని చూసి తృప్తిగా నవ్వింది మాధవి.. ఆమె మనసులోని మమత కన్నుల్లో ప్రతిఫలించింది ఆమె కాటుక కళ్లను చూస్తూ,

"మాధవీ! మరి మనపెళ్లి ఎప్పుడో? చెప్తావా?" అన్నాడు సుధాకర్ చిలిపిగా..

"అబ్బ! నన్నడుగుతారేం? నాకేం తెలీదు.. అవన్నీ మీ యిష్టమే కదా! మీకే తెలియాలి." అంటూన్న మాధవిని మనస్ఫూర్తిగా దగ్గిరికి తీసుకుని గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు సుధాకర్. "నిజంగా నాదెంత అదృష్టమో! మధూ! ఈ అందాల రాణి నాదవుతుందనుకోలేదు. ఆనాడే ఆశ వదిలేసుకున్నాను ఇలా చిత్రమైన మలుపులు జీవితంలో సంభవిస్తే అంటే ఆశ్చర్యంగా వుంది." అంటూన్న అతని మాటలకు మాధవి మనసులో మల్లెలే విరిశాయి. అప్పుడే గది బయటనుంచి, "మాధవీ!" అని పిలిచాడు ప్రకాశరావు. అతనితో కలిసి వచ్చిన డాక్టర్ కేశవమూర్తికి నమస్కరించింది మాధవి వినయంగా, కృతజ్ఞతతో..

తృప్తిగా మాధవి తల నిమిరిన ప్రకాశరావు "ఇదంతా మీ దయ.. డాక్టర్ గారూ! చూశారా? మాధవిలో మార్పు! ఎలా మీ ఋణం తీర్చుకోగలం?" అంటుండగా కేశవమూర్తి హాయిగా నవ్వేశారు తేలికైన హృదయంతో..

"ఊ.. దానికేం భాగ్యం? నన్ను త్వరగా మీ యింట్లో పెళ్లి విందుకి పిలవండి.. తీరిపోతుంది మీ ఋణం కాస్త.. ఏమమ్మా! మాధవీ! అంతే కదూ!.." అనేసరికాయన మాటల కందరూ ఒక్కసారిగా నవ్వారు.. మాధవి సిగ్గుతో తలవంచుకొంది. ఆమె వదనం రాగరంజితమైంది.. ఆమెను చూస్తున్న సుధాకర్ పెదాలపై అందమైన చిరు దరహాసం మెరిసింది.

తరువాత ఒక సుముహూర్తాన మాధవీ, సుధాకర్‌ల కల్యాణం అతివైభవంగా జరిగింది. సుధాకర్ తల్లిదండ్రులు కోడల్ని చూసి మురిసిపోయారు. జంటగా తన పాదాలకు నమస్కరించిన నూతన వధూవరులను నిండుమనసుతో, ఆనందబాష్పాలతో ఆశీర్వదించారు డాక్టర్ కేశవమూర్తి.

ఆ సంవత్సరం దీపావళి వారి వివాహమైన రెండు నెలలకే వచ్చింది.. పండుగ సరదాగా, అతి వేడుకగా గడిపారు.. ఇంటింటా ఆనందంగా వెలుగుతూన్న దీపావళి వారి గృహంలోనేగాక, వారి జీవితాల్లో నూతన కాంతుల్ని విరజిమ్ముతూ, దివ్య జ్యోతులను వెలిగించింది. ●




### ఎమ్. పి. ఆర్, హైదరాబాదు

మిమ్మల్ని పురుష పక్షపాతిగా గుర్తించే వారికి మీరిచ్చే సమాధానం ?

సమాధానం ఏముంటుంది? ఇంకోళ్లు యింకోటి అనేదాకా, 'కాబోలు' అనుకుంటాను.

### శ్రీనాథ్, విశాఖపట్నం

మేము పంపించే ప్రశ్నలలో మీకు కోపం తెప్పించే ప్రశ్న లుంటాయి.

నాకు సాధారణంగా కోపం రాదు.

### కె. జి. ఆర్, రాజమండ్రి

మా మూడు సంవత్సరముల పిల్లవాడికి చెవులు వినబడుటలేదు. దానిగురించి మాట్లాడుట కూడా లేదు...

మద్రాసు వంటి పట్నాలకు తీసుకువచ్చి చెక్ చేయించండి ప్రముఖ సర్జన్లున్నారు. అవసరం అయితే ఆపరేషను చేసేనా నయం చేయ కల్గుతారు. బెంగపడి ఊరుకోవడం కాదు. ప్రయత్నించండి.

### నిరంజన్, న్యూఢిల్లీ

నేడు శూన్యమైతే నిన్నటి సుఖాన్ని తలచి సంతోషించు, లేదా రేపటి సుఖాన్ని ఆశించి నిరీక్షించు అంటారు ఆశావాదులు. కాని అన్నీ కలిసి సమిష్టిగా ఎదురుదెబ్బ తీస్తే ఆ వ్యక్తి తట్టుకునేదెట్లా ?

ఏమిటి—నిన్న రేపులు యీనాటితో ఎలా కలిసి పోతాయండీ బొత్తిగా నిరాశావాది దృక్పథంతో ఉన్నారు! . రేపు ఎదురు దెబ్బ తగిలినా ఆ రేపుకి మరో రేపు ఉండదా ఏమిటి?..

### కె. జి. ఎమ్, ఉంగుటూరు

శరత్ సాహిత్యంలోని దేవదాసు...అర్థం ఉందా ? అని మీరన్నారు. అర్థం లేక పోవడం ఏమిటి ? మీరు అర్థం చేసుకొనుటలోనే ఉంది. అటువంటి సాహిత్యం లోని అంశాలను వేలెత్తి చూపే అర్హత ఎవరికి ఉంది ?

క్షమించు దేవదా!! శరత్ 'రాయుసకాని'గా కాని పని చేశారా ఏమిటి?. సాహిత్యంపై వ్యక్తిగత అభిప్రాయాలు ప్రకటించే హక్కు, మీ ధర్మమా అని యీ దేశంలో ఇంకా ఉంది

### డి. టి. ఎస్. ఎన్, శింగరాయపాలెం

శరత్ సాహిత్యాన్ని గురించి మీరు వ్రాసిన అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. మొదటినుండి యీ అభిప్రాయాలని స్నేహితులతో అనడం వారు నన్ను తిట్టడం పరిపాటి అయింది ..

సంఘంపై చదివేవాని దృక్పథాన్ని పట్టి అతనికి సాహిత్యం అర్థం అవుతూ ఉంటుంది అభిప్రాయాలు ఏర్పడుతూ ఉంటాయి. ఒకళ్లకీ వెయ్యిమందికీ నచ్చింది కనుక 'నీకెందుకు నచ్చదు?' అన్న ప్రశ్నకి అర్థంలేదు. కన్నీరూ, పాద ధూళీ, తరుణ వయస్కులను కదలించవచ్చు. కాని మెచూర్ పరితలకి అవి అసందర్భంగా.. కథాగమనాన్ని బలహీనపరిచేవిగానూ, సాకులుగానూ మాత్రమే తోస్తాయి. తప్పేముంది? ఆడవాళ్లని ఏడిపిస్తే సినిమా సక్సెస్ అవుతుందన్నట్టు, యువతరంలో రాబోయే కుర్రకారుని కదలించి పారేస్తాడు శరత్

### వి. ఎమ్. ఆర్, విజయవాడ

అరిస్టాటిల్ సోక్రటీస్ ఒనాసిస్సు అని రాసి బ్రాకెట్లులో 'అరి' అని రాశారెందుకు ?

'అరి' ఒనాసిస్ ముద్దుపేరు! అంతా పిలిచే పేరు. పొట్టి పేరు.

### ఎన్. ఆర్. ఆర్, సీతాఫల్‌మండి

'......' నేనింత వరకు ప్రేమించి వివాహం చేసుకొన్నవాళ్లను చూడలేదు. పై ఇంగ్లీషువాక్యం నూటికి నూరుపాళ్లు నిజం అంటాను మీరేమంటారు ?

నిజమే. రొమాంటికతే అన్నది వూహాజనితం. సాహిత్యంలో రాణించినట్టు జీవితంలో కన్పించదు. కాని ఓసంగతి మరిచిపోతున్నారు. ప్రేమించి కావాలని వివాహం చేసుకున్నవాళ్లు బ్రతకాలి కదా సుందర నందనవనాలు, నక్షత్రాలూ చంద్రుడూ, పక్షులూ, జలపాతాలూ—అంటూ కూర్చోరు. వారి బాట ఒకటే-అది కలిసి నడవాలని నిర్ణయించుకుంటారు. దారిలో ముళ్లు ఉండవచ్చు. పూలు పరుచుకుని ఉండవచ్చు—ఎడబాటులు రావచ్చు—కాని వారి ధ్యేయం మారదు అది ప్రేమకి పునాది. మిగిలినదంతా మామూలే..

ఇక ప్రేమించి పెళ్లి చేసుకున్న వాళ్లని చూడలేక పోవడం దురదృష్టమే. అటువంటి వారు మనసు కోరికనీ వూహలకి రెక్కలనీ యిస్తారు—ఈసారెప్పుడైనా చూడ్డానికి ప్రయత్నించండి బ్రదర్.

### కె. ఎల్. ఆర్, రాజమండ్రి

రాస్తున్నప్పుడు నానుడు లెందుకు వాడ్డం ?

"తేట వెన్నెల వెలుగులు తెలుగు నుడులు" అన్నారు నాళం వారు. భాష కందాన్నిచ్చే మాటలు వాడ్డం ఎందుకంటారేమిటి?

### పి. ఎస్. ఆర్. పి, శ్రీకాకుళం

విరిగిన మనసులు కలుసుట సాధ్యమా?

ఆఁ పూర్తిగా క్షమించి మరిచిపోకల వ్యక్తులుంటే.

### ఎస్. పి. జగిత్యాల

స్త్రీ తనను భర్త తిటితే ఊరుకుంటుంది. కాని తన వాళ్లను తిడితే ఊరుకోదు. ఎందువలన అంటారు ?

స్త్రీ నిజంగా ఈనిన పులిలాంటిది. తన వాళ్లను రక్షించవలసిన బాధ్యత మరిచిపోలేదు.

### బి. వి, అనంతపురం

శ్రీమతి కెన్నెడి పునర్వివాహం పై మీ అభిప్రాయం ?

అభిప్రాయం దేనికి సోదరా, ఆమె కోరి ఒకతన్ని చేసుకుందని అమెరికా యావత్తూ అసహ్యించుకుంటూంది. వీళ్లు చెప్పిన ఎవరినైనా చేసుకుంటే ఆదరించేదా? లేక నేషనల్ మాన్యుమెంటు లాగా అలాగే ఉండి పోతే పూజించేదా?.. మన ఊహాగానాలు అనవసరం.

### జి. వి. ఆర్, పెనుమదం

మా ఊళ్లో ఒకతను ఎప్పుడూ ఎవరితోనో విన్నా వినకపోయినా తను చూసిన సినిమాకథ చెప్పేస్తూ ఉంటాడు. అతనికా దుర్గుణం మాన్పించే ఉపాయం ఏదేనా ఉందా ?

పోనీండి పాపం, కొందరికేనా ఆయా సినిమాలు చూసే బాధ తప్పిస్తున్నాడు కదా?

### వి. వి. ఎల్, బందరు

మీ వయస్సెంత ?

నిజమైన వయస్సు చెప్పే ఆడదాన్ని నమ్మకూడదంటాడు వైల్డ్. అదే చెప్పిన మనిషి ఏమైనా చెప్ప కలదట!

### జి. ఎల్. డి, కాకినాడ

నా ముఖం బాగుండదు...

ఉత్సాహం హృదయంలో ఉంటే ముఖం అదే అందంగా ఉంటుంది. ఛీరప్!



# విజయలలిత జవాబులు

కె. ఉదయకుమార్, హైద్రాబాద్

ప్ర: మీరు నా హృదయాన్ని దొంగిలించారు; దయచేసి తిరిగి యిస్తారా?

జ: మీరు దొంగిలించినదాన్ని యెప్పుడయినా తిరిగి యిచ్చి వున్నారా?

పి. కృష్ణారెడ్డి, మహబూబ్‌నగర్

ప్ర: మానవుడు తన జీవితములో సాధించవలసిన ముఖ్యకార్యమేమి?

జ: నొప్పించక తానొవ్వక వుండడమే.

## బహుమతి పొందిన ప్రశ్న

పి. రాజేంద్ర, విజయవాడ

ప్ర: చిత్రంలో మీ నృత్యం కనబడగానే యువకులు ఆసక్తితో చూడ్డానికి, వయసు మళ్ళినవాళ్ళు మొహం చిట్లించుకోడానికి గల కారణం ఏమిటండీ?



జ: యువకుల కళ్ళు పదునుగా వుంటాయి కాబట్టి ఆసక్తి కనిపిస్తుంది; వయసు మళ్ళినవాళ్ళ కళ్ళు తళ్ళుగా వుంటాయి కాబట్టి చిట్లింపు కన్పడుతుంది.

టి. ఈశ్వరరావు, ఎలమంచిలి

ప్ర: భర్తను దైవముగా నమ్మిన స్త్రీ లెవరు? అటువంటి స్త్రీలు మీ సినీ యాక్టర్లలో ఎవరైనా వున్నారా?

జ: ప్రతి స్త్రీకి భర్తే ప్రత్యక్ష దైవం; సినీయాక్టర్లను దేవతలనుకుంటున్నారా లేక మానవకాంతలనుకుంటున్నారా?

కె. చంద్రశేఖరరావు, గుంతకల్లు

ప్ర: మీరు హాలీవుడ్ నటిగా రాకుండడమే మా అదృష్టము; కాని తెలుగు నాగరికతను అభివృద్ధిపరచి తెలుగు సెక్సీ నటిగా వుండడమే మా నిజమైన అదృష్టము, మరి మీరేమంటారు?

జ: తెలుగు నాగరికతను అభివృద్ధిపర్చడమో లేక కించపరచడమో మనందరిమీద వుంది; ఎవరి అదృష్టం యెవరికి తగుల్తుంది? నా అదృష్టం యెలా వుందో! ఒకవేళ హాలీవుడ్ నటిగా వస్తే ఎలా?

జె. సత్యనారాయణ, కాకినాడ

ప్ర: 'పేరులోనే పెన్నిధి వుంటుంది' అంటారు పెద్దలు; మీ పేరులో యెంత పెన్నిధి వుందో చెబితే మా చెల్లికి మీ పేరు పెడతాను; చెబుతారుకదూ!

జ: మీ చెల్లెని నా దగ్గరకి తీసుకువస్తే, ఆమె రూపురేఖా విలాసాల్ని బట్టి నా పేరు ఆమెకి అతుకుతుందో లేదో తేలుస్తాను.

ఎస్. ఎ. బకాష్, గుంతకల్

ప్ర: కొందరు ప్రభుత్వముచేత, ప్రజలచేత 'పద్మశ్రీ', 'మాతృశ్రీ' అను బిరుదులు పొందుచున్నారు; మరి మిమ్ము 'సెక్స్‌శ్రీ' అని పిలవాలనుకుంటున్నా, ఏమంటారు?

జ: నేను ఏమనగలను, 'వెక్కుశ్రీ' గారూ!

జి. గంగాధర్, భీంగల్లు

ప్ర: మన చిత్రాల్లో ముద్దుల ప్రవేశ పెడితే జాతీయ సమైక్యతకై ఒక మెట్టు నదిరోహించిన వారము కాగలమంటారా?

జ: లోకో భిన్నరుచిః; కాబట్టి మనంగా నిర్ణయించడానికి మనం యెవళ్ళం చెప్పండీ...

వై. వి. రమణారావు, రామకృష్ణాపురం

ప్ర: మీరు మీ పిడనే ప్రేమిస్తారు. (బాగానే వున్నది); ఒకవేళ మిమ్మల్ని యితరులు ప్రేమిస్తే?

జ: వారి పిడనే నా కృతజ్ఞతని వుంచుతాను.

ఎం. సురేంద్రనాగ్, మద్రాసు

ప్ర: ఏదో 'కాఫీమ'లో ఇలా మీకు పంపే ప్రశ్నలన్నిటికీ ఏ బదులు మీ సెక్రటరీనే సమాధానాలిస్తారని వేశారు! అయితే మీరు కూడా అంతేనా?

జ: అదేదో నవలలో యిలా మీరు వేసే ప్రశ్నలన్నీ యెవరో చెప్తేతే వేస్తున్నారని విన్నాను; మీరు కూడా యింతేనా!



'విచిత్రసోదరులు'లో ఎల్. విజయలక్ష్మి.

<u>సమీక్ష :</u>

# విచిత్రసోదరులు

యమ్ జి రామచంద్రన్ ద్విపాత్రాభినయంతో తెలుగులో విడుదలయిన చిత్రం 'విచిత్ర సోదరులు'. కవలలుగా జన్మించిన ఇద్దరు సోదరులు కారణాంతరాలవల్ల విడిపోతరు. ఒకడు తల్లి పెంపకంలో పెరుగుతాడు. రెండవవాడు తండ్రినిచంపిన హంతకుని చేతుల్లో పెరుగుతాడు ఈ ఇద్దరు యమ్‌జిఆర్ ల చేతుల్లోనూ కథ ఆద్యంతమూ పట్టుగానడిచి ప్రేక్షకుల్ని రంజింపచేస్తుంది. , రెండు పాత్రలని తీర్చిదిద్దిన తీరు, పాత్రల వైవిధ్యాన్ని ప్రస్ఫుటంచేస్తూ గణనీయంగా నటించిన యమ్ జి అర్. ప్రతిభ ఈ చిత్రానికి గొప్ప ఆకర్షణ. ఇందులో యల్. విజయలక్ష్మి నృత్యం ఒక ప్రత్యేక ఆకర్షణ.

యమ్. జి. రామచంద్రన్‌తోపాటు నంబియార్, జయలలిత, రాజశ్రీ, పండరీబాయి మొదలైనవారు నటించారు. పూర్తిగా రంగుల్లోనిర్మించిన దేవీ ఫిలిమ్స్ వారి 'విచిత్ర సోదరులు' కళ్లకి నిండయిన వినోదం !

—నీకరాజు

# సినిమా

భరణి స్టుడియోలోకి అడుగిడిన నాకు మృదు మధురమయిన గానం విన్పించింది; అంతే సరాసరి రికార్డింగు థియేటర్లోకి వెళ్లాను. మైకుముందు సుశీల ఘంటసాల పాడుతూ వున్నారు! సౌండు ఇంజనీరు కోటేశ్వరరావు వాల్యూమును త్రిప్పుకుంటున్నాడు; కవి నారాయణరెడ్డి, సంగీతసారధి రాజేశ్వరరావు పాటను వింటూ తలూపుతున్నారు;

బిడియమేల ఓచెలీ
పిలిచె నిన్నే కౌగిలి
మొదటిరేయి ఒదిగిపోయి
మోము దాచేవెందుకో; ఎందుకో!'

ఈపాట ప్రసాద్ ఆర్టు పిక్చర్సుకు గాను రికార్డు చెయ్యబడింది.

* * *

నన్నుచూచిన నిర్మాత అనుమోలు వెంకట సుబ్బారావు, దర్శకుడు ప్రత్యగాత్మ 'రండి, రండి సమయానికే వచ్చారు' అని సాదరంగా ఆహ్వానించారు; 'మీ చిత్ర వివరాలను 'ఆంధ్ర సచిత్రవారపత్రిక' పాఠకులకు తెల్పగలరా' అని అడిగాను; 'బై ఆల్‌మీన్స్' అంటూ నిర్మాత యీ క్రింది వివరాల్ని నాకు చెప్పారు; నేను విన్నదాన్ని మీకు తెల్పుతున్నాను.

'ఇది మా 11 వ చిత్రం; ఇది ప్రత్యగాత్మచే వ్రాయబడ్డది; ఆత్రేయ సంభాషణలను వ్రాసాడు; ముఖ్యపాత్రలను నాగేశ్వరరావు, జయలలిత, నాగభూషణం, ఎస్. వరలక్ష్మి, గుమ్మడి, అంజలీదేవి, పద్మనాభం, సుకన్య, భీమరాజు, గీతాంజలి పోషిస్తారు, మా చిత్రం యొక్క మొదటి షెడ్యూలు సారధి స్టుడియోలో డిసెంబరు 20 న ప్రారంభమై 31 వరకు సాగుతుంది. ఈ షెడ్యూలులో భరణిలో రికార్డుచేసిన పాటను చిత్రీకరిస్తాము, జయలలిత, నాగేశ్వరరావు పాల్గొంటారు' అని ముగించాడు; మరి టెక్నీషియన్స్ సంగతేమిటిఅని అడిగాను, 'మా యూనిట్ వుండనేవుందిగా' అన్నాడు సుబ్బారావు.

## గత చిత్రాల్లోకెల్లా మెరుగు

ప్రసాద్ ఆర్టు పిక్చర్స్ చిత్రమంటే అందులో మంచికథ, మంచి టెక్నికల్ విలువలు, చక్కటి టేకింగు, ప్రేక్షకుల్ని ఆకర్షించే అంశాలు వుంటాయి అనేది అభిప్రాయం వుంది. ఇంతవకు ఆ బ్యానర్‌లో వచ్చిన చిత్రాలన్నీ ప్రేక్షకుల్ని విశేషంగా ఆకర్షించాయి అనడానికి వారి చిత్రాలు అందుకున్న విజయాలే సాక్ష్యాలు. ఈచిత్రం గత చిత్రాలకన్నా అన్నివిధాలా మెరుగ్గా వుంటుంది అని నిర్మాత ఘంటాపథంగా చెప్పారు.

* * *

సుబ్బారావుతో మాట్లాడి వస్తుంటే ప్రత్యగాత్మ యెదురయ్యాడు; ట్వీడ్ ప్యాంటును టక్‌చేసి స్వెట్టర్‌తో శరీరాన్ని



'కథానాయకుడు' లో రమాప్రభ, పద్మనాభం.



'ఇంద్రధనస్సు' ప్రారంభం - రాజశ్రీ, హరనాథ్. శ్రీ చక్రధరరావు క్లాప్‌కొట్టారు.

## సినిమా

కున్న ప్రత్యగాత్మను ఏమిటండీ ఉదయంపూట యీ డ్రెస్సు. అని అడిగాను. ఆయన నవ్వి 'చలిగా' వుంది గదండీ, అందుకే అన్నాడు, మరి మీ ప్రోగ్రాము గూర్చి యేమయినా చెప్తారా అని ప్రశ్నించాను; 'ఏముంది—డిసెంబరు 18 న హైద్రాబాదుకు వెళ్తున్నాను. ప్రసాద్ ఆర్టు పిక్చర్సు షూటింగు 20 నుండి 31 వరకు వుంటుంది; ఆ పైన మద్రాసుకు వచ్చి శ్రీశ్రీ వ్రాసిన పాటను పి. ఎ. పి. కి గాను రికార్డు చెయ్యించడం; ఆపైన బొంబాయికి వెళ్ళి 'తమన్నా' షూటింగును పూర్తి చెయ్యడం' అని ఆగాడు; 'అప్పుడు యేదో ఒక కొత్త సంస్థకు హిందీ చిత్రాన్ని డైరెక్టు చేయబోతున్నట్టు చెప్పారే' అని ప్రశ్నించాను. 'అవునండీ ఎం. బి. ఎం. సంస్థ నిర్మించే చిత్రాన్ని ఫిబ్రవరిలో ప్రారంభించాలి' అని ముగించారు.

మనకున్న మంచి దర్శకులలో ప్రత్యగాత్మ ఒకరు. ఇంతవరకు ఆయన దర్శకత్వం వహించిన ప్రతి చిత్రం మీ అభిమానాన్ని విపరీతంగా చూరగొనింది; సహజత్వానికి దగ్గరగా వుండేట్టు ప్రతిపాత్రను



"అన్నదమ్ములు"లో జ్యోతిలక్ష్మి.

కన్సీవ్ చేసి, ఆపాత్ర మీలో మరపురాని అనుభూతిని యేర్పరచే విధంగా ఆయా నటీ నటులచే నటింపచెయ్యడమే యితనిలోని ప్రత్యేకత.

### సహజంగా ఉన్న సన్నివేశం

భరణినుండి ప్రసాద్ స్టూడియోకి వెళ్ళాను.

శోభన్‌బాబు నవమన్మధుడిలా వున్నాడు. అతని వాడి చూపుల్లో రతీదేవిలాగా శోభిల్లిన రాజశ్రీ వుక్కిరి బిక్కిరి అయిపోతూ వుంది; ఇద్దరూ ఒకర్నొకరు తదేక దృక్కులతో చూచుకుంటూ ఒకటై పోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు; ఇద్దరి

# సినిమా డైరీ

● బాలాజీ ఫిలింస్ నిర్మిస్తున్న "కిల్లర్ నరసింహన్" చిత్రం యొక్క షూటింగు డిసెంబరు 13 న ఎ వి ఎం. స్టుడియోలో సి ఎస్. రావ్ దర్శకత్వంలో ప్రారంభమైంది. కటిపిటి మునయ్య, టి నరసింహారెడ్డి నిర్వహణలో తయారవుతున్న యీ చిత్రంలో రంగారావు, శోభన్‌బాబు, విజయ నిర్మల, రాజసులోచన ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

● జగ్గయ్య, జమున ప్రధాన పాత్రలను ధరిస్తున్న ఎస్ పి వి ప్రొడక్షన్ "గిరిజా గంగా కళ్యాణం" ఒక సెట్టు పని జరిగింది డిసెంబరు 16 న గోల్డెన్‌లో పాటల రికార్డింగు జరిగింది. ఈ చిత్రానికి కమలాకర్ కామేశ్వరరావు దర్శకుడు.

● లక్ష్మీ నారాయణ పిక్చర్స్ నిర్మించే జానపద చిత్రం యొక్క షూటింగు డిసెంబరు 13 న వాహినీ స్టూడియోలో మధ్యాహ్నం నాలుగుంటలకు ప్రారంభమైంది. విఠలాచార్య దర్శకత్వంలో ఎన్ టి ఆర్, జయలలిత, రామకృష్ణ, విజయలలిత, సత్యనారాయణ, త్యాగరాజు, బాలకృష్ణ ముఖ్య భూమికలను ధరిస్తున్నారు తోట రామస్వామి నిర్మించే యీ చిత్రాన్ని రాయల విడుదల చేస్తారు.

● 125 చిత్రాల్లో నటించిన శివాజీ గణేశ్‌కు డిసెంబరు 15 న (ఆదివారం) రాజేశ్వరీ కళ్యాణ మండపంలో ఘనమయిన సన్మాన సభ జరిగింది. ఈ సభకు మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై, కేంద్ర మంత్రులు శ్రీ చవాన్, కె. కె షా పాల్గొన్నారు.

● వి మధుసూధనరావు దర్శకత్వంలో సారథి స్టూడియోస్‌కుగాను డి. మధుసూదనరావు నిర్మించే సాంఘిక చిత్రంలో అతిథి నటుడిగా ప్రభాకరరెడ్డి ఒక ముఖ్య పాత్రను ధరించాడు.

● మధు పిక్చర్స్ "మంచి మిత్రులు" షూటింగు పూర్తయింది. నవయుగ విడుదల చేసే యీ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు. మల్లికార్జునరావు నిర్మించిన యీ చిత్రంలో శోభన్‌బాబు, కృష్ణ, విజయ నిర్మల, చలం, త్యాగరాజు, గీతాంజలి, జగ్గారావు ముఖ్య పాత్రధారులు.

లోను ఉద్వేగం, ఉత్తేజం కట్టలు తెంచుకు పోయింది; ఇక ఆగలేకపోయారు. శోభన్ యేం చేసాడో తెలుసా? చల్లగా అడుగుపై అడుగు వేసుకుంటూ, మెల్లగా రాజశ్రీ వెనుకవైపుగా వెళ్ళి ఆమెను మెత్తటి తన చేతులతో తాకాడు; ఆ తాకుడు రాజశ్రీలో ఒక కొత్త ఆవేశాన్ని రగిల్చింది. అంతే ఆమె తన పద్మంలాంటి హస్తాలతో శోభన్ చెంపలను తాకింది; ఆ తాకుడు అతనికి వెయ్యిసుగంధాల పరిమళాన్ని అందించినట్టు అనిపించింది; అంతే ఒక్క క్షణంలో రాజశ్రీని తన బాహుబంధాల్లో యిరికించుకున్నాడు; ఇదినిజంగా జరిగిన సంఘటన గాకపోయినా సహజంగా జరిగినట్టే అనిపించేలా దర్శకుడు కె బాలచందర్ యీ సన్నివేశాన్ని చిత్రీకరించాడు; ఈ రుచికరమయిన సన్నివేశాన్ని ప్రసాద్ ఆర్ట్స్ 'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రంలో చూడండి. నెల్లూరీయుడు, నెమ్మదస్తుడు అయిన ప్రసాద్ యీ చిత్రాన్ని నిర్మిస్తున్నాడు; ఎం.ఎస్. విశ్వ

# సినిమా

సాధం విన్పించిన సంగీతంమన హృదయాంతరాళాల్లోకి చొచ్చుకుపోతుంది: శోభన్‌బాబు, చలం, గుమ్మడి, రావికొండలరావు, రాజశ్రీ విజయలలిత, రోజారమణి ముఖ్యపాత్రలను ధరించిన ఈ చిత్రం జనవరి మొదటి వారంలో విడుదలౌతుంది.

*     *     *

ప్రసాద్ స్టుడియోలోవున్న నాకు ఆ రోజు కె. ఆర్. విజయ పుట్టినరోజు అని యెవరో చెప్పారు; వెంటనే టాక్సీయెక్కి ఆమె యింటికివెళ్ళి విచారించగా ఆమె వీనస్ స్టుడియోలోకి వెళ్ళింది అని చెప్పారు; పరేనని టాక్సీని వీనస్‌కు మళ్ళించాను. నేను వెళ్ళేసరికి లోపల కృష్ణ, సత్యనారాయణ, కృష్ణంరాజు, రాంమోహన్, ధూళిపాళ, టి. జి. కమల, ఛాయాదేవి, గీతాంజలి యిత్యాదులు కుర్చీల్లో ఆసీనులై వున్నారు; కె. అర్. విజయ టేబిలుముందు నిలబడి 'బర్త్‌డే కేకు'ను కోసేందుకు రెడీగా వుంది; ఆమె ప్రక్కనే వున్న పేకేటి 'రెడీమామ్' అనగానే కేకుకోయడం జరిగింది; 'హ్యాపీ బర్త్‌డేటుయూ' అని మేమందరం విజయను అభినందించాం 'ఈ రోజు మీరు పుట్టినరోజు అని చెప్పారు, నిజమేనా' అని అడిగాను. 'బలే వారండీ. మీరూ కోల్తావడ్డారా!' అని నవ్వి వూరుకుంది; అంతలో పేకేటి నా సందేహాన్ని తీర్చేసారు. ఈ వేడుక శ్రీదేవి కంబైన్స్ నిర్మిస్తున్న 'భలే అబ్బాయిలు' చిత్రంలో మీరు చూస్తారుగ; తోట సుబ్బారావు నిర్మించే ఈ సమస్యాత్మక సాంఘిక చిత్రాన్ని పేకేటి తన దర్శకత్వ ప్రతిభతో మీకు నచ్చేవిధంగా చిత్రీకరిస్తున్నాడు. కృష్ణ, విజయ, రాంమోహన్, గీతాంజలి, కృష్ణంరాజు, ధూళిపాళ, టి. జి కమల, ఛాయాదేవి మరియు సత్యనారాయణ ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు.

## నిజస్వరూపం ?

వీనస్‌నుండి వాహినికి వెళ్దామనుకున్నాను; కానీ వరుణదేవుడు నాకు అంతరాయం కల్గించాడు. అందుకని ఆరోజు నేను వేసుకున్న ప్రోగ్రాము అప్‌సెట్ అయింది; ఆరోజుకి విశ్రాంతి తీసుకున్నాను. మర్నాడు వాహినికి వెళ్ళాను.

కృష్ణ, విజయనిర్మల అన్నా చెల్లెళ్ళు తన అన్న చాలా మంచివాడు, పరోపకార పరాయణుడు అని నిర్మల అనుకుంటూ వుండేది. ఒకరోజు అనుకోకుండా తన అన్న నిజస్వరూపం బయట పడింది; తన అన్న యింత నీచుడా అని వాపోతుంది; విజయనిర్మల ఏం చూసింది? కృష్ణ చేసిన నేరం ఏమిటి? అని మీరు తెల్సుకోవాలిగా, అయితే చదవండి.

కృష్ణ, నాగభూషణం స్నేహితులు; ఇద్దరూ కలసి అనేక దోపిడీలు, దొంగతనాలుచేసారు. ఇద్దర్నీ పోలీసులు తరుముతుంటారు. ఒకరోజు నాగభూషణాన్ని పోలీసులు తుపాకితో కాలుస్తారు అతడు పడిపోతాడు; కొనప్రాణంతో వుంటాడు; ఆ సమయంలో కృష్ణ అక్కడికి వస్తాడు; నాగభూషణాన్ని చూచి కృష్ణ విలపిస్తాడు తనకు కూడా యీగతి యేర్పడక తప్పుతుందా అని వాపోతాడు; ఇకపై మంచిగా ప్రవర్తించాలనుకుంటూ గతంలో తను చేసిన నేరాన్ని ఒక్కొక్కటిగా తలచి బాధపడే సమయంలో విజయనిర్మల చాటుగా వింటుంది; కృష్ణ అక్కడ వుంటే అపాయం అని గ్రహించాడు; అక్కడినుండి పారిపోడానికి ప్రయత్నిస్తాడు. కాని తన చెల్లెలు అటకాయించింది; ఆపైన యేం జరిగిందో మీరే వూహించుకోండి; మీరు వూహించినట్టు జరిగిందో లేదో 'మంచిమిత్రులు' చిత్రం వస్తే చూడండి; మల్లికార్జునరావు

## మీకు తెలుసా

హిందీనటి సయిరాబానుకు స్విమ్మింగ్‌పూల్‌లో ఈదడం అంటే యిష్టం; మద్రాసులో వున్నప్పుడల్లా ఆమె స్విమ్మింగ్‌ను చూడాలని చాలా మంది గుమికూడుతారట.

హిందీనటి మీనాకుమారి ప్రస్తుతం ఉర్దూకవిత్వం వ్రాయడంలోను, నవలలను చదవడంలోను నిమగ్నురాలయి వున్నదట.

హీరో నాగేశ్వరరావులాగే తమిళ హీరో శివాజి గణేశన్‌కూడ ఆదిలో (నాటకాల్లో) స్త్రీపాత్రలు ధరించేవాడు

హాలివుడ్‌లోగల ప్రముఖ కథా రచయితలు నటీ నటులుకన్నా యెక్కువ డబ్బును పుచ్చుకుంటారట

హిందీ నటుడు సునీల్‌దత్తుకు ఎరి కొత్త కార్లనుకొనడం, వాటిని శుభ్రంగా వుంచుకోవడం అలవాటు.

ప్రముఖ తమిళనటుడు ఎం. జి. రామచంద్రన్ తిరుపతివెళ్ళి ఏడుకొండలస్వామిని దర్శించాడట



'సత్తెకాలపు సత్తెయ్య'లో విజయలలిత, చలం.



'సప్తస్వరాలు'లో రాజశ్రీ

నిర్మించిన యీ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు. సంగీతాన్ని కోదండపాణి, కెమరాను వెంకటరత్నం నిర్వహించారు నవయుగా విడుదలచేసే యీ చిత్రంలో శోభన్‌బాబు, కృష్ణ, విజయనిర్మల, చలం గీతాంజలి, త్యాగరాజు, జగ్గారావు, వి. జె శర్మ ముఖ్యపాత్రలను పోషించారు

## సంభ్రమాశ్చర్యాలు కలిగించే సంఘటనలు

నిర్మాత మల్లికార్జునరావు సెట్టులో కూర్చుని (ఏకాంతంగా) దీర్ఘాలోచనాపరుడై వుండడాన్ని గమనించి, ఆయన్ను సమీపించాను. నన్ను చూడగానే కూర్చోమని చెప్పి రెండు నెస్‌కేఫ్‌కాఫీకి ఆర్డరు యిచ్చారు; ఏమిటండీ దీర్ఘంగా ఆలోచిస్తున్నారు? అని ప్రశ్నించాను 'మరేం లేదు. 'మహాబలుడు' చిత్రంలో ఒక ఎపిసోడ్ పెట్టాలనుకుంటున్నాను; అంతే' ఏమిటది అని అడిగాను. ఆయన యిలా వివరించారు.

'మహాబలుడు' చిత్రలలో కృష్ణ కథా నాయకుడు. కృష్ణ ఒకరోజు ఒక వూరికి వెళ్తూవుంటాడు. ప్రయాణ బడలిక వల్ల అతనికి దాహం వేస్తుంది: అక్కడ ఒక కొలను కనుపిస్తుంది; కృష్ణ దోసిలితో నీళ్ళు తాగుతాడు; తాగడమే తరువాయి స్త్రీగా మారిపోతాడు; ఒకే ఒక క్షణంలో సాహసోపేతుడయిన కృష్ణ అంద చందాలొలికే విజయలలితగా మారిపోతాడు కృష్ణ చేరుకున్న రాజ్యానికి రాజబాబు మహారాజు. ఈ రాజ్యంలోని ప్రజలంతా మరుగుజ్జులు (పొట్టివాళ్ళు) రాజబాబు విజయలలిత అందాన్ని చూచి ముగ్ధుడౌతాడు; ఆమెను పొందాలనుకుంటాడు; ఇదీ ఎపిసోడ్. యెలావుంది' అని అడిగాడు మల్లికార్జునరావు బ్రహ్మాండంగావుందండీ యిది జనాన్ని విపరీతంగా ఆకర్షిస్తుంది అన్నాను; ఇలా ఒకటూ, రెండా వ్రాసి చూపించేందుకు; మిమ్మల్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తే సంఘటనలు కోకొల్లలుగా వుండే చిత్రం 'మహాబలుడు'. రవికాంత్ నగాయిచ్ దర్శకత్వం వహించే మొదటి తెలుగుచిత్రం యిదే. అప్పలాచార్య రచనా పటిమను చాటి చెప్పే, కోదండపాణి ద్వారా మధురాతి మధురమయిన పాటలను వినిపించే చిత్రం యిది. మీరు 'మహాబలుడు' చూస్తేగానీ నేను చెప్పిందంతా నిజమా; కాదా అని మీకు తెలియదు. అందాకా కాస్త ఓపిక పట్టండి.

## ఏకలవ్య విద్య

మల్లికార్జునరావుతో సంభాషణ ముగించి గోల్డెన్ స్టుడియోకి వెళ్ళాను; ఆరోజు యే చిత్రం షూటింగు లేకపోవడం నాకు ఆశ్చర్యాన్ని కల్గించింది; నేనుదిరిగి రాబోతుంటే భావనారాయణ అప్పుడే స్టుడియోలోకి రావడాన్ని చూచి ఆగాను; నన్ను చూచి కారు ఆపి 'దేవుడిచ్చిన భర్త చిత్రాన్ని చూసారుగా? మీరు చూచినదాన్ని పాఠకులకి తెల్పండి' అన్నారు. అలాగే అని చెప్పి వచ్చేసాను. 'దేవుడిచ్చిన భర్త' చిత్రంలోని ఒక సన్నివేశాన్ని మీ ముందుంచబోతున్నాను.

శ్రీదత్తునికి, అమృతవల్లికీమధ్య వల్లమాలిన ప్రేమ అయితే తానొక ద్వారపాలకుని కుమారుడు; అమృతవల్లి యువరాజుకు అస్త్ర గురువయిన వల్లభాచార్యుని కుమార్తె; తాను అస్త్ర విద్యలో అసాధారణ ప్రజ్ఞసంపాదించి అమృతవల్లిని పొందడానికీ' అర్హత సంపాదించాలని శ్రీదత్తుని ఆశయం; కానీ వల్లభాచార్యులు శ్రీదత్తుని తన శిష్యునిగా అంగీకరించడు; కారణం— యువరాజుకు సహాధ్యాయిగ ఒక ద్వార పాలకుని కుమారుడ్ని చేర్చుకుంటే మహారాజు



"బందిపోటు దొంగలు''లో జమున, గుమ్మడి.

మండిపడ్తాడు; శ్రీదత్తుడు వల్లభాచార్యుని ప్రతిరూపాన్ని పూజిస్తూ, తన మిత్రుల సహకారంతో అచిరకాలంలో వీరవిద్య అభ్యసించాడు; ఏకలవ్య విద్యను చేపట్టిన శ్రీదత్తుడు, అమృతవల్లిని పెండ్లాడుతాడా! వీళ్ల వివాహానికి వల్లభాచార్యులు అంగీకరిస్తాడా? ఈ ప్రశ్నలకు సమాధానం గౌరి ఆర్ట్సు పిక్చర్స్ 'దేవుడిచ్చిన భర్త' చిత్రం చూడండి. పాలగుమ్మి పద్మరాజు దర్శకత్వంలో నిర్మితమయిన యీ జానపద చిత్రాన్ని మీకు చూపించే బాధ్యతను పూర్ణా పిక్చర్స్ స్వీకరించారు. శ్రీదత్తుడు మీ అభిమాన కథానాయకుడు కాంతారావు; అమృతవల్లి రాజశ్రీ; యువరాజు సత్యనారాయణ; వల్లభాచార్యులుగా కీ. శే. ఎ. వి సుబ్బారావు (జూనియర్) నటించాడు; అప్పలరాజు అనెడి నూతన సంగీత దర్శకుడ్ని భావనారాయణ యీ చిత్రం ద్వారా పరిచయం చేసాడు.

**మంచి మనిషిగా మారినా వదలని పోలీసులు!**

నాగేశ్వరరావు తెలిసో, తెలియకో జగ్గయ్య, ప్రభాకరరెడ్డిలతో కలసి కొన్ని నేరాలు చేసాడు; కొంతకాలానికి తను చేసేది తప్పు అని తెల్సుకుంటాడు; తన జీవితాన్ని సక్రమ పంథాలో నడిపించాలని నిర్ణయించుకుంటాడు; మంచి మనుషిగా మారిపోతాడు; కానీ అతన్ని పోలీసులు యింకా వెంబడి

## సినిమా

స్తున్నారు; అతన్ని యింకా దొంగగానే పరిగణిస్తున్నారు. గతంలో చేసిన నేరాల్ని నెమరు వేసుకుంటూ ఒక ప్రక్క, వాపోతూ, తను మంచివాడుగా మారినా పోలీసులు తన్ను అనుమానిస్తున్నారేనని మరో ప్రక్క చింతిస్తూ, నాగేశ్వరరావు క్షోభించిపోతాడు; ఈ పాత్రలో నాగేశ్వరరావు అద్వితీయమయిన నటనను ప్రదర్శించినట్టు 'అదృష్టవంతులు' రష్ చూసినవాళ్ళు అభిప్రాయపడుతున్నారు; జగపతి సంస్థ నిర్మించిన యీ చిత్రం తప్పక బాక్సాఫీస్ చిత్రం అనే నా నిర్ణయం; నా నిర్ణయానికి కారణం మీరే-- యింతకుముందు రాజేంద్రప్రసాద్ నిర్మించిన అన్ని చిత్రాలు మీ మెప్పును బడసినవే. చక్కటి సాంఘిక కథలను యెన్నుకుని, వాటిని మీకు మెప్పించే రీతిగా దర్శకుడు మధుసూదనరావు స్క్రీన్‌ప్లే తయారుచేసి, చిత్రం ఆద్యంతం రక్తి కట్టించేందుకు ప్రయత్నిస్తూ, కృతకృత్యులౌతున్నారు; ఈ చిత్రంలో జయలలితను చూచి, ఆమెలో ఇంతటి ఉత్తమ నటన వుందా అని ఆశ్చర్యపోతారు. చిత్రంలోని ముఖ్యపాత్రలను నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, భీమరాజు, ఆనందమోహన్, జయలలిత, విజయలలిత, గీతాంజలి, రేలంగి, సూర్యకాంతం పోషించారు; సంగీతాన్ని మహదేవన్, కెమెరాను వెంకటరత్నం నిర్వహించిన యీ సాంఘిక చిత్రం 1969 లో విడుదల కానున్న ఉత్తమ చిత్రాల్లో ఒకటిగా వుండగలదని ఆశిస్తున్నాను

**సాంఘిక సమస్యల సహజ చిత్రీకరణ**

ఎన్. ఎ. టి అండ్ రామకృష్ణా కంబైన్స్ నిర్మించిన 'వరకట్నం' 1969లో విడుదలయ్యే ఉత్తమ చిత్రాల్లో ఒకటి; ఎన్. టి. రామారావు దర్శకత్వం వహించిన యీ చిత్రం తెలుగువారి హృదయాల్లో కలకాలం నిలిచిపోతుంది. మన యిళ్లలో జరిగే సంఘటనల్ని, నేడు సంఘంలో ప్రబలిపోతున్న సాంఘిక సమస్యల్ని సహజంగా చిత్రించిన చిత్రం 'వరకట్నం'. వరకట్నం యివ్వలేక బాధపడే కుటుంబాలు, వరకట్నం యిస్తామని మాట యిచ్చి, యివ్వలేక పోయినప్పుడు వాళ్ళు పడే అవస్థలు, వరకట్నం తీసుకురాని కోడళ్లు పడే బాధలు ఎలా వుంటాయో యీ చిత్రం చూస్తే మీకే తెలుస్తుంది. ఇలాంటి ఉత్తమ చిత్రాలను చూచిన తర్వాతయినా మన సంఘంలో మార్పు తీసుకు రావడం మన ధర్మం. అడుగడుగునా మిమ్మల్ని కంట తడి పెట్టించే విధంగా, ప్రతి సన్నివేశాన్ని ఎన్. టి. ఆర్. బిగువుగా, హృద్యంగా చిత్రించారు. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను రామారావు, సావిత్రి, కృష్ణకుమారి, సత్యనారాయణ, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, రాజనాల, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, చంద్రకళ అండ్ పద్మనాభం పోషించారు. ఈ చిత్రానికి సంగీతాన్ని టి. వి. రాజు, కెమెరాను రవికాంత్, ఆర్టును కృష్ణారావు నిర్వహించారు. యీ చిత్రాన్ని మీకు చూపించే బాధ్యత విజయ పిక్చర్స్‌కు అప్పగించబడింది.

* * *

మంచివాళ్లకు మంచి రోజులొస్తాయి అనడానికి 'నిండు సంసారం' చిత్రం ప్రత్యక్ష సాక్ష్యం. గంగాధరరావు పడ్డ శ్రమ వృధా పోలేదు; 'నిండు సంసారం' చిత్రం ప్రతి తెలుగు సంసారం మెచ్చుకుంటున్నది. లింగిశెట్టి సమర్పించిన



శ్రీ రాజ్ ఆర్ట్ ఫిలింసలో షీలా.

ఈ చిత్రం యిటీవల విడుదలయిన చిత్రాలన్నిటికన్నా మిన్నగా వుందని ప్రేక్షకులు అభిప్రాయపడుతున్నారు. ఈ చిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా చూపెట్టిన దర్శకుడు సి. ఎస్. రావును, చక్కటి కుటుంబకథను యెన్నుకున్న గంగాధరరావును మనసారా అభినందిస్తూ, మున్ముందు కూడ నిర్మాత మంచి చిత్రాలను నిర్మిస్తారని ఆశించవచ్చు.

### ఇంద్రధనుస్సు

సరస చిత్ర వారి తొలి సాంఘిక చిత్రం 'ఇంద్రధనుస్సు' షూటింగు ప్రారంభోత్సవం వీనస్ స్టూడియోలో ఒకటి రెండు తేదీల్లో జరిగింది. మోహన్ ఫిలిమ్స్ డిస్ట్రిబ్యూటరు శ్రీ నాగభూషణంశెట్టి కెమెరా స్విచ్ ఆన్ చేశారు శ్రీ చక్రధరరావు క్లాప్ కొట్టారు. లైబ్రరీ సెట్టులో హరనాథ్, రాజశ్రీలపై చిత్రీకరణ జరిగింది.

ఈ చిత్రంలోని యితర ముఖ్య పాత్రలలో గుమ్మడి, జగ్గయ్య, విజయనిర్మల, రమణారెడ్డి నటిస్తున్నారు. మురళి, ఏ. ఎన్. ఆర్., బి. శ్యామల అనే నూతన నటులను పరిచయం చేస్తున్నారు ... రచన అనిసెట్టి. సంగీతం: టి. వి రాజు, ఛాయ: హరి, కూర్పు: బి గోపాలరావు, కళ: రంగారావు, స్టిల్సు: చిట్టిబాబు. నిర్మాతలు: అనిసెట్టి సుబ్బారావు, ఆలపాటి నరసింహారావు. దర్శకత్వం: అనిసెట్టి అప్పారావు. శ్రీనివాస్ ●


'దేవుడిచ్చిన భర్త'లో విజయలలిత, జయంతి.

### శ్రీ సుందర్‌లాల్ నహతా అభినందన సభ

శ్రీ సుందర్‌లాల్ నహతా మద్రాసు 'షెరీఫ్' పదవిని అలంకరించిన సందర్భంలో పరిశ్రమకి చెందిన వివిధ సంఘాల వారు ఫిలిం ఛాంబర్ ఆవరణలో ఆయనని అభినందించారు.

అభినందన సభకి డాక్టర్ పి. వి. రాజమన్నార్ అధ్యక్షత వహించారు సుందర్‌లాల్ నహతా రాజస్థాన్ కుటుంబానికి చెందిన వారయినా, దక్షిణాదివారుగా స్థిరపడ్డారని, జాతీయ సమైక్యతా భావానికి ఆయన ఒక ఉదాహరణ అని అధ్యక్షులు ప్రశంసించారు.

మద్రాసు మంత్రిణి శ్రీమతి సత్యవాణిముత్తు, మాజీ షెరీఫ్ శ్రీ యన్ నారాయణస్వామి, శ్రీయుతులు యన్ టి. రామారావు, ఎ. యల్. శ్రీనివాసన్, ఎ. వి. మెయ్యప్పన్, యు. విశ్వేశ్వరరావు, బి. అనంతస్వామి శ్రీ నహతా గుణగణాల్ని ప్రశంసించారు శ్రీ డి. వి. యస్. రాజు వందన సమర్పణ చేశారు. (ఐ. వి)

# పుస్తకాలు

## కవిత్రయి
## (నలుగురు నవకవుల రచనలు)

ఎంత గొప్ప భావాన్నయినా ఒకేఒక చిన్ని పద్యంలో హృద్యంగా చమత్కారంగా ఇముడ్చ వచ్చు. ముచ్చటగా రాగయుక్తంగా పాడవచ్చు— అని కవుల అభిప్రాయం కాలంతో పాటు ఈనాడా అభిప్రాయం మారింది.

'ఛందస్సు వచ్చినవారంతా పద్యం వ్రాయవచ్చు కానీ, నిజమైన వచన కవిత వ్రాయడం ఏ కొందరికో కాని అందరికీ సాధ్యమైన పని మాత్రం కాదు' అనే సూత్రాన్ని అక్షరాలా నిరూపించే కావ్యం—

### 'చీకటినుంచి'

కర్త: శ్రీ నూతలపాటి గంగాధరం డెమ్మీ 1/8 సైజు 98 పేజీలు. వెల. రూ. 3. ప్రచురణ కళాసాహితి, 83 లేక్‌వ్యూ రోడ్డు, మద్రాసు—33

శ్రీ దాశరథి 'ఉషోరేఖలు'తో ప్రారంభమైన ఈ కావ్యంలో 39 శీర్షికలు, కవిగారి 'చివరి, మాట'తో ముగింపు. 'వ్యావహారిక భాషా విప్లవం తోనే ఆంధ్ర సారస్వతాని కొక మంచి అదృష్టం పట్టింది. వచన కవితా ఉద్యమం మరొక అదృష్టం' అన్నారు కవి. ఈ విధంగా చీకటి నుంచి వెలుగు లోకి నడిపించే ఉద్యమాన్ని బలపరచాలనే ప్రబల కాంక్షతో ఈ వచన కావ్యాన్ని రచించి, నవకవులకు దారి చూపారు శ్రీ గంగాధరం 'వేదనా మథిత మైన మదిలో నుండి 'మధుర కవితామృతాన్ని అందిస్తున్న' కవిగారిని శ్రీ దాశరథితో పాటు మనమూ అభినందించడం సమంజసం.

### జయధ్వజం

పాత కొత్తల మేలు కలయికతో, రాజకీయ ప్రబోధానికి అనువయిన పద్యకావ్యం—

రచన, ప్రచురణ: శ్రీ వానమామలై ఎర్రదాచార్యులు క్రౌన్ అక్టేవో 74 పేజీలు. వెల రు 1 50. ప్రతులకు చెన్నూరు, అదిలాబాదు జిల్లా.

నాయకుల స్తుతి, మహావీరుల సంస్మరణ, వందన సమర్పణ శీర్షికలతో ఈ కృతి మనదేశ చరిత్రను ఒక్కమాటుగా కళ్లకు కట్టినట్లు ప్రదర్శిస్తుంది. ఝాన్సీ, భగత్సింగ్, తిలక్, బోస్, వల్లభాయి, సరోజని, విశ్వదాతల వంటి మహా మహులు జ్ఞాపకానికి వస్తారు. చీనావాడినీ, పాకి స్తాన్‌నూ—ముఖ్యంగా భుట్టోనూ కవిగారు నిర్మోహమాటంగా దులిపి వదిలారు. ఆ ఘట్టా లలో పద్యరత్నాలు ఉద్రేకాన్ని రేకెత్తించి తీర తాయి. ఒక్క భారతావని గురించే గాక, అమెరికా —వియత్నామ్‌ల విదేశీయ రాజకీయాలు కూడ ఇందులో అభివర్ణితమైనాయి. మన శత్రువులను ద్వేషించటానికీ, తద్వారా జాతీయతను ప్రబోధించ టానికీ ఇటువంటి కావ్యాలు గొప్పగా ఉపకరిస్తాయి.

### చివరి మజిలీ

జనప్రియమైన మరొక ఆధునిక కావ్యం— సంయుక్త రచన. శ్రీయుతులు రవీంద్రబాబు, వాసు. క్రౌన్ 63 పేజీలు. వెల రు. 1—50. ప్రచురణ: ఆర్ట్స్ లవర్స్, హైద్రాబాదు.

సంవత్సరాలు గడచిపోతున్నా ప్రజలు బాధల తోనే జీవిస్తున్నారు. కారణం?— ఛాందసాభి ప్రాయాలు, సమాజాన్ని దోపిడి చేసే ఆర్థిక, నైతిక, మత నమ్మకాలు. వీటిని దూరంగా విసరి వేసే ఎన్నో యత్నాలలో ఈ కావ్య రచన ఒకటి.

ప్రపంచానికి కావాల్సిన మార్పు సమసమాజం. ఇదే 'మంచి.' ఈ మంచికోసం నడిచిన ఈ గేయాలలో కవికుమారులిరువురనూ నడిపించిన మూల సూత్రం: దరిద్ర మానవజాతి ఒక్కటే. పీడిత మానవుల పట్ల సానుభూతిని వెల్లడించాలంటే— వారిని పీడించే ధనికవర్గాల జీవితాన్ని, ధనికుల్ని పుట్టించిన దేవుణ్ని, దేవుణ్ని అనుసరించే పుట్టు పర్తి సామిని—వీరి గుట్లన్నీ బయల్పెట్టితీరాలి!— అదే ఈ కావ్యం ప్రతి పేజీలోనూ చూస్తాం.

ఈ యువకవులకు శ్రీ రమణారెడ్డి మనసు విప్పి రాసిన అమూల్య లేఖ, కావ్యానికి 'ముంద, మాట'గా వెలువడింది ఈ లేఖలో వారికే కాదు, నవ కవులందరకూ అగత్యమైన అమోఘ సందేశం ఇమిడ్చి వుంది.

—శివకుమారి

### రాజ్యకాంక్ష

శ్రీ పట్టెల రామకోటేశ్వరరావు రచన 'రాజ్య కాంక్ష' (జానపదనాటిక) మా కార్యాలయం చేరింది. 31 పేజీలు గల ఈ పుస్తకం వెల ఒక రూపాయి. ప్రతులకి రచయితకి కేరాఫ్ శ్రీ టి సత్యనారాయణ టింబర్ డిపో, బండ్లమిట్ట, ఒంగోలుకి రాయాలి.

### సమిధ

ఆంధ్ర నాటకబ్రహ్మ ఆచార్య చింతపల్లి హను మంతరావు రాసిన 'సమిధ' (ఏకాంక నాటిక)మా కార్యాలయం చేరింది నలభై పేజీలు గల ఈ పుస్త కం వెల రు. 1—25 పైసలు. ప్రతులకి ఉదయ సాహితీపబ్లికేషన్స్, మహంతీపురం, విజయవాడ—1కి రాయాలి.

### ప్రజారాజ్యం

శ్రీ పి. బి. శామ్యూల్ కలం నుంచి వెలువడిన 'ప్రజారాజ్యం' (స్త్రీపాత్ర లేని నాటిక) మా కార్యా లయం చేరింది. ముప్ఫై రెండు పేజీల ఈ పుస్త కం వెల ఒక రూపాయి ఇరవై అయిదు పైసలు కావలసిన వారు ఉదయసాహితీపబ్లికేషన్స్, మహంతీ పురం. విజయవాడ—1కి రాసి పొందవచ్చును.

### ఆరు ఏకపాత్రాభినయ నాటికలు

శ్రీ సోంపల్లి బాపయ్య రచన 'ఆరు ఏకపాత్రాభి నయ నాటికలు' మా కార్యాలయం చేరింది.. ఇందులో ఖడ్గతిక్కన, పృథ్వీరాజు, యాచమ నాయుడు, దుర్యోధన, నలగామరాజు, బైజవాన్ ఏకపాత్రాభినయ నాటికలున్నవి. 52 పేజీల ఈ పుస్తకం వెల రు. 1—50 పై. ప్రతులకి ఉదయ సాహితీపబ్లికేషన్స్, మహంతీపురం, విజయవాడ—1కి రాయాలి.

### పదిరూపాయల నోటు

శ్రీకృష్ణచందర్ రచించిన, శ్రీ పోలు శేషగిరి రావు అనువదించిన "పది రూపాయల నోటు' నవల మా కార్యాలయం చేరింది. 175 పేజీలు గల ఈ నవల వెల మూడు రూపాయలు. మేలు ప్రతి రు. 4 లు. ప్రతులకు విశాలాంధ్ర పబ్లి షింగ్ హవుస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2కి రాయాలి.



హైదరాబాదు రవీంద్రభారతిలో ఆంధ్ర బాలానంద సంఘం నిర్వహించిన నాటికల పోటీలలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణమ్మగారి వద్దనుండి "ధ్రువతార" సంగీత రూపకంలో ధ్రువపాత్రధారి చిరంజీవి నిమ్మ అరుణాచలం ఉత్తమ నటనకు ప్రథమ బహుమతి అందుకొంటున్న దృశ్యం.

Editea, Frinted and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



# ఆంధ్రసచిత్రవారపత్రిక

జనవరి

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | |

1969